# శిథిలాలయం

ూర్పు కనుమల్లోని పర్వతారణ్య
ంతాల్లో శబరజాతి వాళ్ళు నివసించే
్లు అనేకం వుండేవి. వాటిలో కుంభార
ట్టి అనే పల్లెకు శివాలుడు అనే వాడు
యకుడు. అతడు అరవైఏళ్ళు పైబడిన
ద్ధుడు. అతడికి పద్దెనిమిదేళ్ళ యువ
డైన శిఖిముఖి అనే కుమారుడున్నాడు.

శిఖిముఖి అంటే తండ్రికి పంచ
ాణాలు. అందుక్కారణం అతడు శివా
డికి నడివయసు దాటింతర్వాత కలిగిన
క సంతానం కావటం.

తన తరవాత పల్లెకు నాయకత్వం
గించవలసిన వాడు శిఖిముఖి కావటం
త శివాలుడు కొడుక్కు బాల్యప్రాయం
ంచీ తగిన గురువులను పెట్టి కర్ర కత్తి
సాము. అరణ్యంలో, నదుల్లో వేటాడి
ఆహారం సంపాదించే విద్యలూ నేర్పించాడు.
వీటన్నిటిలో శిఖిముఖి తన పదిహేనవ ఏట
నుంచే నిపుణుడనిపించుకున్నాడు. కుంభార
మిట్టలోనే గాక, ఆ చుట్టు పక్కల వున్న
మరే శబరపల్లెలో కూడా అతన్ని మించిన
వేటకాడూ, ధైర్యశాలీ, ఉపాయశాలీ లేడు.

శిఖిముఖిని నలుగురూ మెచ్చుకునే
ప్పుడు శివాలుడు ఎంతో సంతోష పడేవాడు.
కాని, అంత సంతోషంలోనూ అతడికి
కొడుకును గురించి అవగింజంత విచారం
కూడా వుండేది. తనలాగే కొడుకును కూడా
చదువ రాయు నేర్చిన వాన్నిగా చేయాలని
శివాలుడు ఎంతో ప్రయత్నించాడు. కాని,
ఆది ఫలించలేదు.







కుంభారమిట్టకు చుట్టూ నూరు నూట యాభై కోసుల దూరంలో చదవటం రాయటం చేతనైన శబరజాతి వాడు ఒక్క శివాలుడు తప్ప మరెవరూ లేరు. శబరులు ఆటవికులు. అరణ్యాలూ, కొండలే వాళ్ళ నివాసస్థానాలు. వేటా, పశు సంపదే వాళ్ళ జీవనాధారం. వాళ్ళకు నగర జీవితం తెలీదు, నాగరికులతో ఎలాంటి పొత్తూ లేదు. ఆ పరిస్థితుల్లో చదువు సంధ్యల్లాంటివి వాళ్ళకు కొరగాని విషయాలుగా కనబడ టంలో ఆశ్చర్యం లేదు. కాని, శివాలుడు యువకుడుగా వున్నప్పుడు ఒక క్షత్రియుడి వెంట దేశదేశాలూ తిరిగి రణకౌశలం, చదువారాయా నేర్చుకున్నాడు. వాటి జీవితంలో అతడికి ఎన్నో ప్రయోజన కనిపించినై. శిఖిముఖి మాత్రం యీ యంలో తండ్రికి చాలా అశాభంగం గించాడు.

రోజూ సూర్యోదయంతోనే శిఖిము విల్లంబులూ, ఈటె తీసుకుని, వేటకై అ ణ్యానికి పోతున్నానని తండ్రికి చెప్ప మామూలు. తిరిగి అతను అరణ్యాన్ను పల్లెకు రావటం సూర్యాస్తమయ తర్వాతనే.

ఒకనాటి ఉదయం శిఖిముఖి తం చెప్పి వేటకు బయలుదేరాడు. వె ఎర్రగండు అనే అతడి వేటకుక్క వున్న దాన్ని చిన్న పిల్లగా అతడే సాకి చేశాడు. అది ధైర్యంలో సింహం, జిత్తు గుంటనక్క. అరణ్యంలో వాళ్ళిద్ద ఒకళ్ళకొకళ్ళు తోడుగా తిరుగుతూ వే వాళ్ళు. ఎర్రగండు పసిగట్టి ముందు చూపేది, శిఖిముఖి దాన్ని అనుస పోయి మృగాలను వేటాడేవాడు.

శిఖిముఖి, ఎర్రగండూ అరణ్యం చాలాదూరం పోయారు. ఆ రోజెందుచే మిట్టమధ్యాహ్నం వేళ అయినా, వాళ ఒక్క లేడి గాని, అడవిదున్న గాని, అ





పందిగాని కనిపించలేదు. అరణ్యం ఎందు వల్లనో నిశ్శబ్దంగా వున్నది. అప్పుడప్పుడూ కోతులు చెట్లల్లో కిచకచ మంటూ అరిచి, కొమ్మల్లో దూరి దాక్కుంటున్నవి. ఎక్కడో సింహం, మరెక్కడో పులీ పరిగెత్తుతూ అరిచినట్టుగా ధ్వని అప్పుడిక్కడా మరు క్షణం మరో దిక్కు నుంచీ వస్తున్నది.

"అంత నిశ్శబ్దం ఏమిటి? అరణ్యాని కేమన్నా సుస్తీ చేసిందా? వేట జంతువు లన్నీ ఎక్కడ దాక్కున్నయి? సింహం, పులీ అలా వౌదు కెత్తుతున్నయ్యేం?" అంటూ శిఖిముఖి ఎర్రగండు కేసి చూశాడు. ఎర్రగండు నేల మూచూస్తూ కొద్ది దూరం పోయి, యజమాని వెంటరాక పోవటంతో, ఆగి చిన్నగా మొరగసాగింది.

శిఖిముఖి కుక్క కేసి గుచ్చి చూస్తూ, "ఏమిటీ, ఎండ తాపానికి నీ కేమైనా పిచ్చెత్తుతున్నదా? నీ మొరుగుడుకు చుట్టు పక్కల కోసు దూరంలో వున్న జంతువు లైనా బెదిరి పారిపోతై," అన్నాడు.

ఎర్రగండు కొద్ది సేపు వూరుకుని మళ్ళీ నేలను వాసన చూసి, ముందుకు పరిగెత్తి శిఖిముఖి కదలక పోవటంతో వెనుదిరిగి వచ్చి, అతడి చుట్టూ గిరికీలు కొట్టసాగింది. కుక్క ప్రవర్తనకు ఆశ్చర్యపడుతూ శిఖి



ముఖి అక్కడున్న ఒక ఎండు మోడు పై కెక్కి నిలబడి కుక్క పరిగెత్తబోయిన దిక్కు కేసి చూశాడు. అతడికి ఒక్కగా నొక్క జంతువు గాని, మనిషి గాని కని పించ లేదు. కుక్క మాత్రం యింకా చిన్నగా మొరుగుతూనే వున్నది.

ఎర్రగండు కున్న పశికట్టే శక్తి గురించి బాగా తెలిసినవాడు కావటంతో శిఖిముఖి, కుక్కను ఓ సారి దువ్వి అందుబాటులో వున్న ఒక చెట్టు పై కెక్కి అక్కణ్ణుంచి, అది పరిగెత్తబోయిన దిక్కు కేసి పరీక్షగా చూశాడు. అతడి దృష్టి ఒక వింత అశ్వికుడి పైన పడింది. అశ్వం, రౌతూ కూడా కప







చాలు ధరించి వున్నారు. రొతు నడుం నుంచి పొడవాటి కత్తి ఒకటి వేలాడుతున్నది. కుడిచేతిలో పెద్ద ఈటె నొకదాన్ని ఎత్తి పట్టుకుని వున్నాడు. దాని అలుగు నుంచి ఒక చిన్న పతాకం — ఎరుపూ పసుపూ రంగులు గలది, గాలికి రెపరెప లాడుతున్నది.

"అత నెవడో, అయ్య చెప్పే పురాణ కథల్లోని అతిరథుడో, మహారథుడో అయి వుంటాడు. వెంట రథం లేదే? ఆహా, భలే వేషం!" అనుకుంటూ శిఖిముఖి నవ్వ సాగాడు. కవచాలు ధరించిన యోధుల్ని అత డింతవరకూ చూసి ఎరగడు. ఒకటి రెండుసార్లు రాజుగారి సైనికుల్ని చూశాడు గాని వాళ్ళిలా నిలువెల్లా కవచం ధరించి కనబడలేదు.

ఆ అశ్వికుడి కేసి వింతగా చూస్తున్న శిఖిముఖికి మరింత ఆశ్చర్యం, భయం కొలిపే మరొక దృశ్యం కంట బడింది. ఏడెనిమిది మంది మనుషులు — వాళ్ళ దుస్తుల తీరును బట్టి దారిదోపిడిగాళ్ళలా వున్నారు — అశ్వికు డొస్తున్న మార్గానికి పైన వున్న చెట్లకొమ్మల్లోంచి, అతడికి వెనకా ముందూ ఒక్కసారిగా కిందికి దూకారు. గుర్రం బెదిరింది. అశ్వికుడు దాన్ని కళ్ళెం లాగి ఆపుతూ, పెద్దగా సింహనాదం చేసి, ఒర నుంచి కత్తి దూసి వాళ్ళతో తలపడ్డాడు.

శిఖిముఖికి ప్రమాదంలో చిక్కుకున్న ఆ అశ్వికుణ్ణి చూసి చాలా జాలి కలిగింది. ఒకడి మీద పదిమంది కత్తులెత్తటం అధర్మం, సహించరానిది. శత్రుబలం చూసి లొంగిపోక, అంతమందినీ ఏకాకిగా ఎదిరించి పోరాటానికి ఉపక్రమించిన అశ్వికుడంటే అతడి కెంతో గౌరవభావం కలిగింది. అతడు ఎర్రగండును హెచ్చరించి, చెట్ల ఊడలు పట్టుకుని వూగుతూ, క్షణాల మీద అశ్వికు డున్న ప్రాంతం చేరాడు.







ఈ లోపల అశ్వకుడు వాహనం మీద వుండే దొంగలను కత్తితో ఎడాపెడా కొడుతూ, "విక్రమకేసరి కత్తి బలి కోరుతున్నది! నీచుల్లారా పారిపోక నిలబడండి, నా ప్రతాపం తెలుస్తుంది," అంటూ కేకలు పెడుతున్నాడు. అంతలో ఒక దొంగ, చాటుగా వుండి గుర్రం కాలికి గురిచేసి కత్తి విసిరాడు. గుర్రం గాయపడి వేగంగా పక్కకు తిరిగింది. అశ్వకుడు ఆ ఉదుపుకు కిందపడి, అంతలోనే లేచి నిలబడి, ఈసారి కత్తి, ఈటె రెంటినీ రెండు చేతుల్లో పట్టుకుని, పెద్దగా హుంకరించి దొంగలను ప్రతిఘటించసాగాడు.



"శబరమాతకూ, జై!" అంటూ శిఖిముఖి చెట్టు మీది నుంచి దొంగల మధ్యకు దూకాడు. ఈలోపల ఎర్రగండు ఒక దొంగ మీది కురికి, వాడి కంఠం పట్టుకునేందుకు పైకెగిరింది. అశ్వకుడు ఒక్క క్షణకాలం యీ వచ్చినవాడు శత్రువో మిత్రుడో అన్న అనుమానంతో స్థాణువులా అయిపోయి, శిఖిముఖి ఈటెను దొంగల మీదికి గురిచేయటం చూసి, "మిత్రమా! యీ దుర్మార్గుల్లో ఒక్కణ్ణి కూడా ప్రాణాలతో పోనివ్వకూడదు," అని కేక వేశాడు.

అంతలో అరణ్యంలో ఎక్కడో దూరం నుంచి ఎవరో పెద్దగా ఈల వేశారు. మరు క్షణం దొంగలు అశ్వకుణ్ణీ, శిఖిముఖినీ విడిచి కలిసికట్టుగా అక్కణ్ణించి పారిపోసాగారు. బరువైన కవచం ధరించి వుండటంతో అశ్వకుడు వాళ్ళను వెంబడించలేకపోయాడు. శిఖిముఖీ, ఎర్రగండూ వాళ్ళను కొంత దూరం తరిమి, వాళ్ళు అందకుండా గుబురు చెట్లల్లోకి పారిపోవటంతో వెనుతిరిగి అశ్వకుడున్న చోటుకు వచ్చారు.

వాళ్ళు వచ్చేసరికి అశ్వకుడు తన గుర్రానికి తగిలిన గాయాన్ని పరీక్షిస్తున్నాడు. శిఖిముఖి అతణ్ణి సమీపించి, "ఆ దుష్టులు











అందకుండా పారిపోయారు. ఈ అరణ్యంలో మీరు ఒంటరిగా ప్రయాణం చేయవలసింది కాదు. మీరేం గాయపడలేదు కదా?... అదృష్టం. గుర్రం గాయానికి మందు వేద్దాం వుండండి," అంటూ దాపుల నున్న చెట్ల దగ్గిరకు పోయి ఆకులు కోయసాగాడు.

అశ్వకుడు మారుమాట్లాడకుండా శిఖిముఖిని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూస్తూ వుండి పోయాడు. అతడికి ఈ యువకుడు ఆటవిక జాతివాడని తెలుస్తూనే వున్నది. శబర మాతకూ, జై, అంటూ దొంగల మధ్యకు దూకాడు. బాగానే వున్నది. నిజంగా యితడు శబరుడేనా? ఇందులో మోసం ఏమీ లేదు కదా—అశ్వకుడిలా ఆలోచిస్తున్నాడు.

శిఖిముఖి అశ్వాన్ని సమీపించి దాని గాయానికి ఆకుపసరు పూస్తూ, అశ్వకుడితో, "మీ పేరేమిటి? ఒంటరిగా అరణ్యంలో తిరుగుతున్నారేం?" అని ప్రశ్నించాడు.

అశ్వకుడు జవాబు చెప్పేందుకు ఓ క్షణ కాలం తటపటాయించి, "మనిద్దరం సమాన వయస్కులం, పద్దెనిమిది యిరవై ఏళ్ళ వయసు వాళ్ళం, అవునా? ముసలి వాళ్ళలాగా మీరూ మీరూ అని మాట్లాడు కోవటం ఎందుకు? అది సరే. నీ ప్రశ్నలకు జవాబిచ్చే ముందు నే నొక ప్రశ్న అడగవలసి వుంది," అన్నాడు.

"ఏమిటా ప్రశ్న?" అని అడిగాడు శిఖిముఖి, అశ్వకుడి మాటలకు కొంచెంగా ఆశ్చర్యపడుతూ.

"నీవు శబరజాతివాడివి, అవునా?" అన్నాడు అశ్వకుడు.

"అవును, నా పేరు శిఖిముఖి. మీ... నీ పేరు?" అన్నాడు శిఖిముఖి.

"శిఖిముఖి!" అంటూ అశ్వకుడు కళ్ళింత చేసుకుని తలాడిస్తూ, "అది, నీ తాత పేరు. అవునా? నా పేరు విక్రమకేసరి, యిది మా తాత పేరు. మీ తండ్రి





శివాలుడు. ఆ విక్రమకేసరిని గురించి నీకు చెప్పే వుండాలే. ఆయన క్షేమంగా వున్నారు గదా?" అని ప్రశ్నించారు విక్రమకేసరి.

విక్రమకేసరి మాటలు వింటూంటే శిఖిముఖికి ఏదో కల గంటున్నట్టుగా వున్నది. తను జన్మలో ఆతణ్ణి చూడటం తటస్థపడుతుందని ఆత డేనాడూ అనుకోలేదు...

"నా తండ్రి క్షేమంగానే వున్నారు. మీ తాతగారిని గురించి నేను చాలా విన్నాను. మీది శూరసేన దేశం కాదా? నీ ప్రయాణం మా పల్లెకే అని తెలిసిపోయింది. కాని, ఇదంతా నాకు నమ్మశక్యం కాకుండా వున్నది." అన్నాడు శిఖిముఖి

"ఇంకా నమ్మశక్యం కాని సంగతు లనేకం మీ ఇంటికి చేరింతరవాత తీరిగ్గా చెబుతాను. ఇంతకుముందు నన్ను చుట్టుముట్టినవాళ్ళు కేవలం దొంగలు కాదు. వాళ్ళకి కావలసింది, ఈ జీనుకు వేలాడుతున్న సంచీయే కాక, నా ప్రాణం కూడా. కనక మనం త్వరగా మీ పల్లె చేరటం క్షేమం," అన్నారు విక్రమకేసరి.

ఆసరికి శిఖిముఖికి తామున్న ప్రదేశం ఎంత ప్రమాదకరం అయిందో తెలిసి వచ్చింది. దొంగలు ఏ చెట్లచాటునో పొంచి వుండి తిరిగి మీద పడేందుకు అవకాశం కోసం ఎదురు చూస్తూంటారు...

గాయపడిన గుర్రాన్ని నడిపించుకుంటూ శిఖిముఖి, విక్రమకేసరి కుంభారమిట్ట పల్లెకు బయలుదేరారు. దారిలో శిఖిముఖి ఒక అడవిపందిని కొట్టి భుజాన వేసుకున్నాడు. దొంగల నుంచి మరే ప్రమాదం ఎదురుపడలేదు. కాని, చీకటి పడిన కొంత సేపటికి వాళ్ళు పల్లెను సమీపించేసరికి, శివాలుడూ మరికొందరూ అరణ్యం కేసి వస్తున్నారు. శిఖిముఖిని ముందుగా చూసిన పల్లెవాసులు కొందరు ఉత్సాహంగా కేకలు వేస్తూ, అతడి దగ్గిరకు పరిగెత్తుకు రాసాగారు. —(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 2

[శిఖిముఖి అనే శబరయువకు డొకడు అరణ్యానికి వేటకు వెళ్ళి, అక్కడ కవచం ధరించివున్న అశ్వికయోధు డొకడి మీద దొంగలు దాడి చేయటం చూసి, అతడికి సహాయం చేశాడు. ఆ యోధుడు తన పేరు విక్రమకేసరి అని చెప్పాడు. ఇద్దరూ కలిసి చీకటివేళ పల్లెను సమీపించేంతలో, పల్లెవాసులు వాళ్ళ కేసి పరిగెత్తుకు రాసాగారు. తరవాత—]

శిఖిముఖి తన కేసి వచ్చే పల్లెవాసుల్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. వాళ్ళందరూ ఆయుధాలు ధరించి వున్నారు. ముందుగా అతణ్ణి సమీపించిన శబరులు అతడి చుట్టూ చేరి కేకలు వేస్తూ, పాటలు పాడసాగారు.

"ఈ గొడవంతా ఏమిటి? పల్లెపల్లెంతా కదిలినట్టుందే. ఏం జరిగింది?" అని అడిగాడు శిఖిముఖి, తన చుట్టూ చేరి గంతులు వేస్తున్నవాళ్ళను.

"అరణ్యంలో విన్నూ, మరొక వింత మనిషినీ కొండదొంగలు చంపేశారని విని, పల్లె పెద్దతోపాటు అందరం బయలుదేరాం. అడవిలో గొడ్లను మేపే పల్లెపిల్లలు చెప్పింది అబద్ధం అయినా కావాలి, లేదా నువ్వూ, ఆ జనపమనిషీ కలిసి కొండ దొంగలను చంపయినా వుండాలి," అన్నారు వాళ్ళు.

శిఖిముఖి పెద్దగా నవ్వుతూ విక్రమ కేసరి దగ్గిరకుపోయి, "చూశావా! మా పిల్ల







కాదు వెధవలు గోరంతదాన్ని కొండంత ఎలా చేస్తారో. మనం దొంగల చేతిలో చచ్చి పోయామనే, వాళ్ళు పల్లెకుపోయి చెప్పారట. నీకు వాళ్ళు పెట్టిన పేరు ఇనప మనిషి," అన్నాడు.

విక్రమకేసరి కిదంతా మంచి వినోదంగా వున్నది. పల్లెవాసుల ఐకమత్యానికీ, తమ నాయకుడి కుమారుడంటే వాళ్ళకున్న వాత్సల్యాభిమానాలకూ అతడు చాలా సంతోషపడ్డాడు. తన తండ్రి తలపెట్టిన సాహసకార్యానికి నిజంగా తోడ్పడగలవాళ్ళు యీ శబరులన్న నమ్మకం అతడికా క్షణంలో కలిగింది.

శివాలుడు మరి కొందరితో కలిసి తన కొడుకున్న చోటుకు రాగానే, అప్పటివరకూ శిఖిముఖి చుట్టూ చేరి గడబిడ చేస్తున్న వాళ్ళందరూ పక్కకు తప్పుకున్నారు. శివాలుడు తన కొడుకును సమీపించి కౌగలించుకున్నాడు. అంతలో కాగడా వెలుగు పైన పడటంతో విక్రమకేసరి అతడి కంట బడ్డాడు.

శివాలుడు ఒక్క క్షణకాలం నిశ్చేష్టుడై పోయి, విక్రమకేసరిని కన్నార్పకుండా చూస్తూ, అతడి కేసి రెండడుగులు వేసి, "ఎవరూ, విక్రమకేసరి దొరా?" అన్నాడు ఆనందం ఆశ్చర్యం కనబరుస్తూ.

విక్రమకేసరి అతణ్ణి సమీపించి నమస్కరిస్తూ, "నేను విక్రమకేసరినే, కాని మీరు నన్నెరగరు," అన్నాడు.

శివాలుడు, విక్రమకేసరిని వింతగా చూస్తూ, "అవును, నలభైఏళ్ళనాటి మాట! ఆ దొరా నా వయసువాడే, ముసలివాడు కాకుండా ఎలా వుంటాడు? మేం యిద్దరం నీ వయసువాళ్ళమై వుండగా చక్రవర్తి సేనలో చేరి ఉత్తరాన బ్రహ్మపుత్రానది లోయల వరకూ జైత్రయాత్ర చేసి, చక్రవర్తికి అంతులేని ధనం, కీర్తి సంపాయించి పెట్టాం. అంతకూ నీవెవరు? మళ్ళీ ఆనాటి

దొర విక్రమకేసరినే చూశానని భ్రమ పడ్డాను," అన్నాడు.

"నేనా విక్రమకేసరి మనవడిని. నా పేరూ విక్రమకేసరే. నా తండ్రిగారు మీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడేందుకు నన్ను పంపారు," అన్నాడు విక్రమకేసరి.

"ఆశ్చర్యంగా వుంది. మీ తాతగారు చనిపోయారని కూడా విన్నాను. అయినా, నీ రూపం నన్ను భ్రమింపజేసింది. మీ నాన్నగారు జయపాలుడు క్షేమమా? ఈ శబరుణ్ణి ఆయన గుర్తుపెట్టుకోవటమే గాక, తన కుమారుణ్ణి ఒక ముఖ్య విషయం మాట్లాడేందుకు పంపటం, నాకు అబ్బురం కలిగిస్తున్నది. సంస్థానాధీశులైన మీ తండ్రిగారు యీ శబర పల్లెపెద్దతో సంప్రతించవలసిన అంత గొప్ప విషయం ఏమిటి?" అని అడిగాడు శివాలుడు.

"అదంతా మీ పల్లె చేరిం తరవాత చెపుతాను. నన్ను మీ పల్లె చేరకుండా అటకాయించేందుకు కొందరు దుర్మార్గులు అరణ్యంలో చాలా పెద్ద ప్రయత్నం చేశారు," అన్నాడు విక్రమకేసరి.

"ఆ సంగతి తెలిసే మేమంతా అరణ్యానికి బయలుదేరాం. శిఖిముఖి వెంట వున్నది,



నా పూర్వ యజమాని మనవడని మాత్రం నాకు తెలియదు. ఎవరో జనపదమనిషి అంటూ పిల్లలు చెప్పారు. సరే, ఇద్దరూ క్షేమంగా బయటపడ్డారు. పల్లెకుపోదాం పదండి," అన్నాడు శివాలుడు.

అరగంట తరవాత అందరూ పల్లె చేరే వరికి, శివాలుడి ఇంటిదాపున చాలామంది ఆడవాళ్ళు గుంపుగా చేరి గొడవగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళందరి చేతుల్లోనూ నీళ్ళ కడవలున్నాయి. శివాలుడూ, అతడి వెంట వున్న పల్లెవాసులూ అడిగిన మీదట, తాము నీరు తెచ్చుకునేందుకు కొలను కెళ్ళామనీ, అక్కడ కొందరు కొత్తవాళ్ళు







కనిపెంచి, శివాలుడి యిల్లెక్కడ అని అడిగారని చెప్పారు. వాళ్ళు చూడటానికి దారిదోపిడిగాళ్ళలా వున్నారని, అందరి చేతుల్లోనూ ఆయుధాలున్నవనీ కూడా చెప్పారు.

ఒకటికి రెండుసార్లు ప్రశ్నించిన మీదట ఆడవాళ్ళు ఆ కొత్తవాళ్ళు ధరించిన దుస్తుల తీరూ అదీ వర్ణించారు. వాళ్ళు చెప్పిందానికీ, అరణ్యంలో గొర్లకాచే పల్లెపిల్లలు దొంగల్ని గురించి చెప్పిందానికీ సరిపోయింది. శివాలుడు అక్కడ ఎవరితోనూ ఏమీ అనక, తన ఇల్లు చేరగానే విక్రమకేసరితో, "ఆ దొంగలెవరో కాని గొప్ప సాహసికులుగా వున్నారు. మా మెరగని ప్రాంతాలకు వచ్చి, శబర పల్లెపెద్ద ఇంటి మీదే దాడిచేయాలని చూస్తున్నట్టు కనబడుతున్నది. ఎంత ధైర్యం!" అన్నాడు.

"వాళ్ళు ఒక వేళ యీ ఇంటి మీదికి దాడివస్తే, మీ కోసం కాదు, నా కోసం. నేనూ, శిఖిముఖీ కలిసి పల్లె కేసి బయలుదేరటం వాళ్ళు చూసివుంటారు. వాళ్ళకు కావలసింది నా ప్రాణం కన్న యీ సంచీలో వున్న వస్తువులు," అంటూ విక్రమకేసరి గుర్రంజీను నుంచి వేలాడుతున్న సంచీ విప్పి, శివాలుడికి అందించాడు.

శివాలుడు ఆ సంచీని భద్రంగా గదికి ఒక మూలవున్న కులదేవతల విగ్రహం ముందుపెట్టి, "రాత్రి చాలావుంది, అంతా తీరిగ్గా మాట్లాడుకోవచ్చు. ముందు తిండీ తిప్పల సంగతి చూద్దాం," అన్నాడు.

ఆ తరవాత అందరూ రకరకాల మాంసాలతో, పానీయాలతో తృప్తిగా భోజనం చేశారు. శివాలుడు గోడకానుకుని కూర్చుని గుడుగుడులో పొగాకు కుంపివేసి, నిప్పంటించి పొగపీలుస్తూ, ఎదురుగా గొంగళ్ళు పరిచిన చాప మీద కూర్చుని వున్న విక్రమకేసరి, శిఖిముఖుల కేసి చిరునవ్వు నవ్వుతూ చూసి, "మీ ఇద్దర్నీ పక్కపక్కల చూస్తూంటే, నాకు విక్రమకేసరి దొర గుస్తు







కొస్తున్నారు. ఆయన మనవడు ఒకానొక
రోజు నా ఇంటికొచ్చి అతిథిగా వుండబోతా
డని నే నేనాడూ ఊహించలేదు," అన్నారు.

"నా తండ్రిగారు కూడా నేను ఉత్తర
దేశం నుంచి యింత దూరం ప్రయాణం
చేయవలసి వస్తుందని కలలో కూడా అను
కుని వుండరు. ఆయన మా తాతగార్ని
గురించీ, మిమ్మల్ని గురించీ చాలా అద్భుత
విషయాలు చెపుతూండేవారు. కాని....మీకు
యిప్పటివరకూ తెలియని సంగతొకటి
చెపుతాను. మా తాతగారు విక్రమకేసరి
ఇప్పటికి ఇరవై సంవత్సరాల క్రితం తిరిగి
మరొకసారి బ్రహ్మపుత్రానది ప్రాంతాలవున్న



కామాఖ్య నగరం కేసి వెళ్ళారు. ఇంత
కాలమైనా తిరిగి రాలేదు. చనిపోయి వుంటా
రనుకున్నాం. ఇప్పటికి రెండు నెలల క్రితం
అందిన వర్తమానాన్ని బట్టి, ఆయన యింకా
సజీవుడేమో అన్న అనుమానం కలుగు
తున్నది," అన్నాడు విక్రమకేసరి.

ఆ మాటలు వింటూనే శివాలుడు
ఆశ్చర్యపడుతూ విక్రమకేసరి కేసి తేరిపార
చూసి, "కేసరిదొర మరొకసారి ఆ బ్రహ్మ
పుత్రానది ప్రాంతాల్లోని అరణ్యాల కేసి
వెళ్ళారా? అది జరిగి ఇరవై ఏళ్ళయి
వుంటే—మాటమాత్రంగా మనిషితో
కబురు పెట్టివుంటే నేనూ ఆయన వెంట
బయలుదేరేవాణ్ణి. ఇంతకూ ఆ దొర మళ్ళీ
అంతదూరం ఎందుకెళ్ళినట్టు?" అని
ప్రశ్నించాడు.

"ఆదేదో చాలా నిగూఢ రహస్యం అనీ,
తాను చచ్చేలోపల సాధించి తీరవలసిన
కార్యమనీ, మా తండ్రిగారితో చెప్పారట.
అంతకన్న వివరాలేమీ చెప్పలేదు. కాని,
రెండు నెల్లక్రితం మా సంస్థానం వాడే
అయిన ఒక పండితుడు ఆ ఉత్తర
దేశాన్నుంచి తిరిగి వచ్చి, మా తాతగారి
వస్తువులంటూ కొన్ని మా నాయనగారికి
ఒప్పచెప్పాడు. వాటిలో ఎక్కువ భాగం











తాళపత్ర గ్రంథాలు. అతడు చెప్పేదాన్ని బట్టి మా తాతగారు అక్కడి కొండల్లో ఎక్కడో సన్యాసిగా జీవిస్తున్నాడని తెలుస్తున్నది. అయినా అందుకు గట్టి రుజువేమీ లేదు," అన్నాడు విక్రమకేసరి.

శివాలుడు కొంచెంసేపు తల వంచుకు ఆలోచిస్తూ వూరుకుని, "నువ్వు చెప్పేది వింటూంటే నాకు మతిపోతున్నట్టుగా వున్నది. ఆ దొర మళ్ళీ ఆ ఘోరారణ్య ప్రాంతాలకు ఎందుకెళ్ళాడు? ఆ నిగూఢ రహస్యం ఏమిటి? ఆయన వస్తువులు మీ సంస్థాన పండితుడి కెలా దొరికినై?" అని అడిగాడు. విక్రమకేసరి పండితుడు చెప్పిన దంతా శివాలుడికి కొద్దిమాటల్లో చెప్పేశాడు.

ఆ పండితుడు బాల్యంలోనే ఇల్లు విడిచి నానా దేశాలూ తిరిగి, శాస్త్రవిద్యలన్నీ నేర్చుకుని వృద్ధాప్యంలో తిరిగి ఇంటికి చేరాడు. ఆయన బ్రహ్మపుత్రానది ప్రాంతాల్లోని అరణ్య ప్రదేశాల్లో చాలాకాలం నివసించాడు. అక్కడ వుండే ఆటవికులకు రోగాలూ రొప్పులూ వస్తే మందుమాకు ఇచ్చి సహాయపడ్డాడు. ఆ ఆటవికుల్లో అనేక జాతులవాళ్ళూ, భాషలవాళ్ళూ వున్నారట. వాళ్ళల్లో ఇభ్యులనే ఏనుగులను మచ్చిక చేసే జాతివాళ్ళు. ఆ పండితుడి జన్మదేశం అవి తెలుసుకుని, తమ పల్లెలో విక్రమకేసరి అనే క్షత్రియుడు కొంతకాలం తన కొడుకుతో నివసించాడని, అతడికి మన్నె జ్వరం రాగా అడవికి మూలికల కోసం పోయినప్పుడు పులి ఎత్తుకుపోయిందని చెప్పారట. ఆయనకు సంబంధించినవే అంటూ కొన్ని తాళపత్రగ్రంథాలూ, చిన్న కత్తి వగైరా ఆ పండితుడికి ఒప్పచెప్పారు. కాని, ఆయన ఆ అరణ్యంలో మరొక ప్రాంతానికి వెళ్ళినప్పుడు, విక్రమకేసరి అన్న పేరుగల సుక్షత్రియు డొకడు అఘోరీలనే సన్యాసులతో కొండల్లో నివసిస్తున్నట్టు మరికొందరు చెప్పారట. ఆ పండితుడు







ఆ సన్యాసుల్లో చాలామందితో మాట్లాడి చూశాడు. కాని, ఉన్నాడనటమే తప్ప మా తాతగారు ఎక్కడ వున్నదీ వాళ్ళల్లో ఏ ఒక్కడూ చెప్పలేకపోయాడు. ఇదంతా విన్న మీదట మా నాయనగారు, మా తాతగారి వస్తువులనబడే వాటినన్నిటినీ యీ సంచిలో పెట్టి మిమ్మల్ని కలుసుకుని మాట్లాడితే ప్రయోజనం వుంటుందేమో అని నన్నిక్కడికి పంపారు. సంచిలో వున్న తాళపత్ర గ్రంథాల్లో కొన్ని మా తాతగారు స్వహస్తంతో రాసినవి. అవి చదివితే మీకు ఆయన ఏ నిగూఢ రహస్యాన్ని ఛేదించేందుకు ఆ ప్రాంతాలకు వెళ్ళాడో తెలియవచ్చు. అంతేకాక వాటిద్వారా మీరు ఆయన సజీవుడో కాదో కూడా గ్రహించగలరని మా తండ్రిగారు ఆశపడుతున్నారు.

విక్రమకేసరి చెప్పినదంతా శ్రద్ధగా విన్న శివాలుడు కొద్దిసేపు మౌనంగా వూరుకుని, హఠాత్తుగా ఏదో జ్ఞప్తికి వచ్చినవాడిలా తుళ్ళిపడి, "బహుశా, కేసరిదేవ నిగూఢ రహస్యం అనేది శిథిలాలయానికి సంబంధించినది కాదు గదా? ఒకవేళ అదే అయితే, ఆ ఆలయాన్ని చేరటంకన్న హిమాలయాల్లోని కైలాసగిరి శిఖరం ఎక్కటం తేలిక. శిఖీ, ఆ సంచి యిటు తీసుకురా," అని తన కొడుకును హెచ్చరించాడు.

శిఖిముఖి లేచి కులదేవతల విగ్రహాల ముందున్న సంచి తీసుకుని తండ్రి దగ్గరకు వచ్చి, దాన్ని అతడి చేతికి అందించబోయాడు. అంతలో వీధి వైపునున్న తలుపును చీకటి కమ్మినట్టయింది. నల్లని దుస్తులు ధరించిన ఒక వ్యక్తి—ఆరున్నర ఏడడుగుల పొడవుగల మరీ బక్కపలచని వాడు, తల మీద గుడ్లగూబ ఆకారంలో వున్న శిరస్త్రాణం ధరించి—వాళ్ళముందు ప్రత్యక్షమయాడు. శివాలుడూ, శిఖిముఖీ, విక్రమకేసరీ ఆ వికృతాకారాన్ని చూస్తూనే నిర్విణ్ణులయారు. —(ఇంకా వుంది)





# శిథిలాలయం

## 3

[శివాలుడి వెంట పల్లెవాసులందరూ తిరిగి శబరపల్లె చేరారు. విక్రమకేసరి, శివాలుడికి తాళపత్రాలున్న ఒక నంది చూపి, తన తాత మరీచపాణి బ్రహ్మపుత్రానదీ లోయల కేసి వెళ్ళాడని చెప్పారు. శివాలుడు, శిధిమునిని నంది తెమ్మని చెప్పేంతలో, ఒక వికృతాకారుడు వారి ముందు ప్రత్యక్షమయాడు. అందరూ నివ్వెరపోయారు. తరవాత—]

వికృతాకారుడు నిశ్శబ్దంగా అడుగులో అడుగు వేసుకుంటూ శివాలుణ్ణి సమీపించి, "మీరందరూ బలవన్మరణం పాలుకాదలచకపోతే, ఆ నంది యిటుయివ్వండి. నేను గత వెయ్యేళ్ళుగా శిథిలాలయం పూజారిని. దాన్ని దూరదలిచి బ్రహ్మపుత్రానదీ లోయల కేసి వచ్చిన వాడెవడూ యింత వరకూ ప్రాణాలతో బయటపడలేదు," అంటూ నంది కోసం చేయిచాచాడు.

అంతలో శివాలుడు తాను మునిగిన భయసంభ్రమాల నుంచి తేరుకుని, వికృతాకారుడి కేసి తీక్షణంగా చూస్తూ, "ఇంటికొచ్చిన అతిథిని—పిలవని పేరంటంగా వచ్చి దుర్భాషలాడే వాడినైనా సరే—తన్ని తగిలేయటం శబరులు చేయకూడని పనుల్లో ఒకటి. అనక, మర్యాదగా చెపుతున్నాను. వెంటనే బయటికి వెళ్ళిపో," అంటూ హుంకరించాడు.









వికృతాకారుడు కనిపించలేదు. ఇంటిచుట్టూ వున్న కంచెదారి దగ్గిర ఇద్దరు ముగ్గురు భటులు నిలబడి ఇంటికి కాపలా కాస్తు న్నారు. శశిముఖి వాళ్ళను సమీపించింది. "ఇక్కడంతా—అంత పొడుగున్న నల్లదుస్తు లవాడు ఎటు పోయాడు?" అని ప్రశ్నించారు.

"నల్లదుస్తులవాడా? అలాంటివాడెవడూ ఇటు రాలేదే!" అంటూ కాపలివాళ్లు ఆశ్చర్యపోయారు. అంతలో ఎర్రగంటు పెద్దగా మెరుగుతూ కొలను కేసి పరిగెత్త సాగింది. విక్రమకేసరి, శశిముఖి దాన్ని వెంబడించారు.

"సరే, పోతున్నాను. శిథిలాలయ పూజారి శక్తిసామర్థ్యాలు నీకు తెలియవు. ఈ అవమానానికి ప్రతీకారం చేసి తీరు తాను. ఆ సంచిలో వున్న తాళపత్రాలు నీ వంశనాశనానికీ, విక్రమకేసరి వంశనాశ నానికీ మాత్రమే ఉపయోగిస్తవి," అంటూ వికృతాకారుడు ద్వారం కేసి వెళ్ళి కనబడ కుండా పోయాడు.

అతడు తలుపు తెరవటంగాని, మూయటం గాని ఎవరికంటాబడలేదు.

శశిముఖి, విక్రమకేసరి చప్పున లేచి ద్వారం దగ్గిరకు పోయి తలుపు తెరిచి బయటికి చూశారు. బయట అంతా చీకటి.

వాళ్ళిద్దరూ కొలనుప్రాంతం చేరేసరికి, కొలనులో ధబీమంటూ ఏదో బరువైన వస్తువు పడినశబ్దం వినబడింది. కొలను చుట్టూ ఎత్తుగా పెరిగివున్న చెట్ల చాటున నీడల్లా మానవాకారాలు కదలటం కన బడింది. విక్రమకేసరి చిన్న గొంతుతో, "శశిముఖీ! అరణ్యంలో నన్ను దొంగ చాటుగా ముట్టడించిన దుర్మార్గులకు, ఆ వికృతాకారుడు నాయకుడని తెలుస్తూనే వున్నది. వాణ్ణిగాని లేక వాడి అనుచరుల్లో ఒక్కణ్ణిగా నొక్కణ్ణయినా గాని మనం పట్టుకో గలిగితే, వికృతాకారుడి ఎత్తుగడలేమిటో మనం తెలుసుకోవచ్చు," అన్నాడు.







"బావుంది. అలా అయితే యుద్ధరం ఒకే దిక్కుగాకేసి వెళ్ళటంకన్న చెరొకవైపుగా పోవటం మంచిది. వాళ్ళు సాహసికులు, ఈపె ఉపయోగించడానికి వెనుదీయరు. గాయపడినవారు దొరికినా మన ప్రయత్నం ఫలిస్తుంది," అంటూ శశిముఖి కొలనుకు ఎడమవైపు నున్న చెట్ల కేసి దొరుచుకొనాడు. విక్రమకేసరి కుడివైపుకు పరిగెత్తాడు.

గుబురుచెట్ల వెనక నుంచి శశిముఖికి దొంగల మాటలూ, వాళ్ళు నడుస్తున్నప్పుడు కాలికింద పడిన ఎండుటాకులు చేసే కర కరధ్వని వినబడింది. ఎర్రగండు చాలా దూరం నుంచి మొరుగుతున్నది. అది అందరికన్న ముందు పోతున్న దొంగవా డైవస్తే వెంబడిస్తున్నట్టున్నది. కుక్కను విడిస్తే తనకెంతో సహాయంగా వుంటుంది. కాని, దొంగలకు తను వాళ్ళను వెంబడిస్తున్నట్టు తెలిసిపోతుంది. పల్లె యువకుల్ని ముందుగా హెచ్చరించి వున్నట్టయితే, వాళ్లందరి సాయంతో దొంగలను చుట్టుముట్టి పట్టుకునేవని. తనూ, విక్రమకేసరి ఒంటరిగా బయలుదేరటం పొరబాటే అయింది. ఇప్పుడేం చేయాలి?....

శశిముఖి యిలా ఆలోచిస్తున్నంతలో దొంగల్లో ఒకడు కొంచెం బిగ్గరగా, "పదండి. పూజారి దొర మూడోకన్ను తెరిచాడు!" అన్నాడు. ఆ వెంటనే నలుగు రైదుగురు దొంగలు చెట్ల మాటు నుంచి గబగబా, ఇటువైపు వచ్చి కొలనుకు అల్లంత దూరంలో వున్న మామిడితోపు కేసి పరిగెత్తసాగారు.



పూజారి దొర మూడోకన్ను తెరవటం ఏమిటి? అని ఆశ్చర్యపడుతూ శశిముఖి మామిడితోపు కేసి దృష్టి సారించాడు. అక్కడ ఒక మాను పక్కగా—ఆరేడడుగుల ఎత్తున ఏదో కాంతి కనురెప్పపాటులో ఆరుతూ వెలుగుతూ అతడి కంటబడింది. అది పూజారి మూడో కన్నా? అద్భుతం!









ముఖి నేల పెట్టి, మామిడితోపులో వెలుగు కనబడుతున్న వైపుకు సూటిగా పరిగెత్తాడు.

అతడు తోపును సమీపించ బోతున్నంతలో అంతవరకూ మాను పక్కన కనబడుతున్న వెలుగు కాస్తా మాయమయింది. ఆ వెంటనే ఎవరో చిన్నగా మాట్లాడిన ధ్వని, నలుగు రైదుగురు నడిచి పోతున్న శబ్దమూ శిఖిముఖికి వినబడింది. అతడు ఆ శబ్దం వస్తున్న వైపుకు జాగ్రత్తగా నడవ సాగాడు. చెట్ల మాటు నుంచి ఏ శత్రువైనా తన మీద కత్తి విసరవచ్చునన్న భయం అతడికి కలిగింది.

శిఖిముఖికి తనకు కొంచెం ముందుగా నడిచి పోతున్నవాళ్ళు మాట్లాడు కోవటం మరింత స్పష్టంగా వినబడింది.. వాళ్ళు తనను చూసే అంత నిర్భయంగా వస్తున్నారా అనుకున్నాడతను. అంతలో దొంగల్లో ఒకడు కొంచెం పెద్దగానే, "అది కుక్క కాదు, పిశాచం. పూజారి దొరను చూస్తూనే కుయ్యోకయ్యో అనకుండా దాని దవడలు నొక్కుకుపోయినై," అన్నారు.

వాడు మాట్లాడుతున్నది తన ఎర్ర గండును గురించి. దాన్ని యీ నీచులు చంపారా? ఆ అనుమానం కలగ్గానే శిఖిముఖి కోపంతో ఒళ్ళు మరిచాడు. ఆ స్థితిలో

వాడు వెయ్యేళ్ళుగా శిథిలాలయానికి పూజారిగా వుంటున్నట్టు చెప్పాడు. ఆ వృద్ధు మూడో కన్ను తెరిచి చూస్తున్నాడు. ఇదంతా మోసమా లేక వాస్తవమా?...

శిఖిముఖి యిలాంటి సంశయాలతో కొట్టుమిట్టాడుతూనే మామిడితోపు కేసి పరిగెత్త బోయేంతలో, ఎర్రగండు దెబ్బతిన్నదానిలా కుయ్యోమంటూ పెద్దగా అరిచింది. ఆ అరుపు వింటూనే శిఖిముఖి ఉగ్రుడైపోయాడు. తన కుక్కను దొంగల్లో ఎవడో గాయపరిచి వుంటాడు. వాళ్ళ నెత్తురు కళ్ళ చూడాల్సిందే. పూజారి గుండెల్లో ఈటె గుచ్చి తీరతాను. 'జై, శబరమూర్తా!' అంటూ శిఖి





అతడు వెనకా ముందులు చూసుకోకుండా, "దుర్మార్గులారా, ఆగండి! ఈటె దెబ్బ కాచుకోండి!" అంటూ ముందు కురికాడు. కాని, అతడు నాలుగైదు అంగలు వేశాడో లేదో, ఎడమ కాలి కింద భూమి చప్పున కుంగిపోయింది. ముందుకు పడబోయిన వాడల్లా తమాయించుకుని, కుడి కాలి ఊతంతో, ఎడమకాలును పైకి లాగబోయేం తలో, కాలికి తాడులాంటి దేదో గట్టిగా బిగుసుకు పోయి పైకి గుంజింది. మరు క్షణం శిఖిముఖి చెట్టుకొమ్మ కొకదానికి ఒంటికాలి పట్టుతో తలకిందులుగా వేళ్ళాడ సాగాడు. అదృష్టం కొద్దీ అతడి కుడి చేతిలో వున్న యీటె గుప్పెట పట్టు నుంచి జారిపోలేదు.



తను ఎంత ఘోర ప్రమాదంలో చిక్కు కున్నదీ శిఖిముఖి అర్థం చేసుకునే లోపలే చెట్ల చాటు నుంచి అపహాస్యం చేస్తున్నట్టు పకపక మంటూ నవ్వు వినిపించింది. ఆ వెంటనే ఒక గొంతు, "పూజారి దొరా! కొదమసింగాన్ని అనుకునేవాళ్ళం. కుందేలు పిల్ల కింద ఉచ్చులో పట్టేశాం. అప్పుడేం చేద్దాం?" అని అడిగింది.

"తొందరపడి అప్పుడే వాడి చర్మం ఒలచకండి. కొంచెం ఎడం ... మరి సమీ పాని కొస్తే, నా మూడో కంటి వేడికి భస్మమై పోతావు," అంటూ వికృతాకారుడు చెట్టు చాటు నుంచి బయటికొచ్చాడు. అతడు తన మూడో కన్ను అంతలోనే మూయటం తెరవటం శిఖిముఖి చూశాడు. ఈ వికృతా కారుడా శిథిలాలయ పూజారి? అను కున్నాడు శిఖిముఖి. తను ఇంటిలోకి వచ్చి నప్పుడు వీడికి నిప్పులా భగ్గుభగ్గున మండుతూ అరే మూడో కన్ను వున్నట్టు తాను గమనించలేదు. వాడు ఈటె పోటుకు అందేంత సమీపానికి వస్తే ఎంత బాగుం డును, అనుకుంటూ శిఖిముఖి ఈటెను బాగా చాచి, పూజారి కేసి ఊగేందుకు







శరీరాన్ని బలంగా కదిలించాడు. అతని ప్రయత్నం ఏమిటో గ్రహించిన ఇద్దరు ముగ్గురు దొంగలు, తమ నాయకుణ్ణి ప్రమాదం నుంచి కాపాడేందుకు శిఖిముఖి పక్కకు వచ్చి నిలబడ్డారు.

"ఓహో, యీ ఆటవికుడు తన చేతి లోని పొడిగ పుల్లతో నన్ను పొడవాలని చూస్తున్నట్టున్నదే!" అని పూజారి వికవిక మంటూ నవ్వి, "ఒరే, పిల్లకుంకా, నీ దర్పం యింకా అణగలేదా? తొందర పడకు," అంటూ ఒక్క క్షణం ఆగి, అంత లోనే పెద్దగా చప్పట్లు చరుస్తూ, "తల తిప్పగలిగితే చూడరా. పకీ! నీ శిబిర పల్లెను నా మూడో నేత్రానికి ఆహుతి చేస్తున్నాను," అన్నాడు.

శిఖిముఖి పట్టుబలమంతాన తల పక్కకు తిప్పి పల్లె కేసి చూశాడు. పల్లెలో పెద్ద మంటలు లేస్తున్నవి. పల్లె తగలబడి పోతున్నట్టు తెలియగానే అతడు ఎక్కడలేని ఉద్రేకంతో, కాలిని బిగించి పట్టి వున్న తాడును తెంచుకునేందుకు పెనుగులాడుతూ, "దుర్మార్గుడా, నీ సేవకుల్ని పంపి, పల్లెకు నిప్పు పెట్టించావా? నీకు చావు తప్పదు. కొద్ది సేపట్లోనే మా వాళ్లంతా యిక్కడికి వచ్చి నిన్ను చిత్రవధ చేస్తారు," అన్నాడు.

పూజారి పకపక నవ్వి, "మీ వాళ్లంతా యిక్కడికి రాకుండా వుండేందుకే పల్లెకు అగ్గి పెట్టాను. అందరూ ఎవరి కొంపలు వాళ్ళు చల్లార్చుకునే ప్రయత్నంలో వుంటారు. అది సరేకాని, నిన్ను ప్రాణాలతో వదుల్తాను. ఆ తాళపత్ర గ్రంథాలున్న సంచి నాకు తెచ్చిస్తావా?" అన్నాడు.

"తాళపత్రాలు కాదు, నీ తల నరికి విక్రమకేసరి కివ్వబోతున్నాను," అంటూ శిఖిముఖి బాగా చేయి చాచి ఈటెను పూజారి కేసి విసిరాడు. కాని, అదే సమయంలో ఒక దొంగ అడ్డు రావటంతో ఈటె





వాడి భుజంలో గుచ్చుకున్నది. వాడు ఒక చావు కేక పెట్టి విరుచుకుపడ్డాడు.

"వీడు నే ననుకున్న దానికన్నా మూర్ఖుడు, సాహసి. కాలి కట్టు విప్పి, మెడకు తగిలించి లాక్కురండి. నేను మహా వృక్షాల మీదుగా నడిచి, అడ్డదారి వెంట అరణ్యం చేరతాను," అంటూ పూజారి పెద్దపెద్ద అంగలు వేస్తూ మాను దాటుకు వెళ్ళిపోయాడు.

పూజారి కనబడకుండా పోగానే, దొంగలందరూ ఒక చోట కూడి, గాయపడిన తమ అనుచరుల గాయాలకు కట్లు కట్టారు. గాయపడిన వాళ్ళల్లో ఒకరు మూలుగుతూ, "ఒరే, అబ్బిగాళ్ళూ, ఇక మన దారిన మనం పోదాం. ఈ పూజారిని నమ్మి మన ప్రాణాల మీదికి తెచ్చుకోవటం ఎందుకు?" అన్నారు.

"నోరు ముయ్యరా పిరికి సన్నాసి. పూజారి దగ్గర మన ఇచ్చిన బంగారం మాటేమిటి? ఆ దొరకు మనం చేసిన ప్రమాణం సంగతేమిటి? మన మేమన్నా నీతి జాతీ లేనివాళ్ళమా?" అంటూ కసిరాడు ఒక దొంగ.

"అసలు పాట్లన్నీ యీ అడవి దున్నగాడు యిక్కడికి రావటంతో మొదలయినై. వీణ్ణి వెంట పెట్టుకుపోయే శ్రమ మనకెందుకు? పారిపోవాలని చూస్తే చంపేమని చెప్పొచ్చు. కత్తితో గుండెల్లో ఒక్క పోటు పొడుస్తాను," అంటూ దొంగల్లో ఒకడు మీసం మెలివేస్తూ లేచి కత్తి ఎత్తి శిలిముఖిని పొడవబోయాడు. కాని, శిలిముఖి తన యీటెతో దాన్ని పక్కకు నెట్టి, అదే సమయంలో దొంగను యీటెతో గట్టిగా పొడిచాడు. ఆ పోటు దొంగ వీపుకు తగిలింది. వాడు బాధతో అరిచాడు. మిగతా దొంగలు కోపంతో ఒళ్ళు మరిచి, "చంపండి!" అంటూ ఒక్కసారిగా శిలిముఖి మీద కత్తులు ఎత్తారు.

—(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 4

[శిథిలాలయ పూజారినని చెప్పిన వికృతాకారుడి కోసం శిఖిముఖి, విక్రమకేసరి చెరొక మార్గాన వెళ్లారు. శిఖిముఖి మామిడితోపులో అడుగు పెట్టేసరికి, అతడి కాలి కింద తాడు బిగుసుకుపోయి, చెట్టుకొమ్మకు వేలాడదీసింది. పూజారిని శిఖిముఖి ఈటెతో పొడవ బోయాడు. పూజారి అనుచరులు అరుస్తూ, అతణ్ణి చంపేందుకు కత్తులెత్తారు. తరవాత—]

పూజారి అనుచరులు తన పైకి కత్తులెత్తటం చూస్తూనే శిఖిముఖి తనకు చావు తప్పదనుకున్నాడు. తను చచ్చే ముందు ఆ దుర్మార్గుల్లో ఒక్కణ్ణయినా చంపి తీరాలన్న పట్టుదలా, ఉద్రేకం అతడిలో పరవళ్ళు తీసింది. ఆ వెంటనే అతను 'జై, శబర మాతా!' అంటూ అరణ్యం ప్రతిధ్వనించేలా అరిచి, తన కాలిని బిగించి పట్టి వున్న తాడును ఈటెతో గురిగా ఒక్కపోటు పొడిచాడు. ఆ దెబ్బకు తాడు సగం నరుక్కుపోయింది, తతిమ్మా సగం అతడి బరువును మోయలేక పటీ మంటూ తెగింది. శిఖిముఖి ఏ మాత్రం అజాగ్రత్తగా వున్నా, అతడి తల బలంగా నేలను తాకటం జరిగేది. కాని, అతడు వానరంలా ఒక్క ఊపున కాళ్ళు రెంటినీ పల్టీకొట్టినట్టు గిరున భూమి మీదికి తెచ్చి, దాని తాకిడిని తట్టుకునేందుకు ఈటెను ముందుగా నేల మీద గుచ్చాడు.







పూజారి అనుచరులు అతడి లాఘవం చూసి ఆశ్చర్యపోయారు. వాళ్ళల్లో ఒకడు శిలీముఖిని మెచ్చుకుంటూ, "కబర వెధవ బాగా సాముగరిడీలు నేర్చిన వాళ్ళా వున్నాడు. ఇలాంటివాడు మన ముఠాలో కలిసివుంటే, మనం సాధించలేం దేముంటుంది?" అన్నాడు.

"వీడు మనిషి కాదు, మర్కటం. నేలంట కుండా చెట్లకొమ్మల మీద గెంతుతూ వింధ్య పర్వతాలనే చేరగలడు. చూస్తారేం, పొద వండి!" అన్నాడు మరొక అనుచరుడు.

ఈ విధంగా ఒకటి రెండు క్షణాలు పూజారి అనుచరులు నిర్విణ్ణులైపోయి, తన మీద కత్తులు ప్రయోగించటానికి బదులు, వాచాలత చూపటం శిలీముఖికి మంచి అవకాశం కలిగించింది. అతడు ఒడుపుగా ఒక విరోధి మోకాలి మీద బలంగా తన్ని, వాడు అమస్తూ వెనక్కు పడబోయేంతలో మెరుపులా వాడి వీపు కింది నుంచి చరున జారి తన చుట్టూ వున్న శత్రువలయాన్ని ఛేదించి బయట పడగలిగాడు.

పూజారి అనుచరులు శిలీముఖి పారిపోయే యత్నం చేస్తున్నాడని తెలిసి కూడా, కత్తులు వుపయోగించలేకపోయారు. కత్తి పొరబాటున తమ వాళ్ళకే తగులుతుందేమో అన్న భయం వాళ్ళకు కలిగింది. శిలీముఖి శత్రువునే తన కవచంగా వాడుకో గలిగాడు, కాని, ఒకసారి అతడు వాళ్ళ నుంచి కొంచెం దూరం పరిగెత్తగానే పూజారి అనుచరులంతా ఒక్కసారిగా, "చంపండి, పారిపోనీకండి," అని అరుస్తూ అతడి వెంట బడి చుట్టుముట్టేందుకు ప్రయత్నం చేశారు.

ఆ సమయంలో దూరం నుంచి ఈల వినబడింది. అది శిథిలాలయ పూజారి తన బంట్లకిచ్చే హెచ్చరిక. ఆ హెచ్చరిక వింటూనే అతడి అనుచరుల్లో ఒకడు, "పూజారిదొర పిలుస్తున్నారు, వినపడలేదా, పరిగెత్తండి," అన్నాడు.







"ఈ పారిపోతున్న శబరపిశాచంగాడి మాటేమిటి? వీణ్ణి పట్టుకు పోవద్దా పూజారి దొర దగ్గిరికి?" అని ప్రశ్నించాడొకడు.

ఆ ప్రశ్నకు మొదట మాట్లాడినవాడు జవాబు చెప్పబోయేంతలో, ఎర్రగండు పెద్దగా మొరగటం వినబడింది. ఆ వెంటనే శబరుల కేకలూ, విక్రమకేసరి, "శిలిముఖీ! శిలిముఖీ!" అని పిలుస్తూ అటుగా పరిగెత్తుకు రావటం దొంగల కంటబడింది.

పూజారి యీసారి మరింత దగ్గరగా ఈల వేశాడు. వాడి అనుచరులంతా ఒకళ్ళొకడు ఎలాంటి హెచ్చరికా చేసుకోకుండానే, గాయపడిన దొంగలను భుజాన వేసుకుని గిరున వెనుదిరిగి, అరణ్యం కేసి పరిగెత్తసాగారు.

శిలిముఖి ఎర్రగండును గట్టిగా కేక వేశాడు. ఆ కేక వింటూనే కుక్క అతడున్న చోటుకు పరిగెత్తు కొచ్చింది. కొంచెం వెనగ్గా విక్రమకేసరీ, నలుగురైదుగురు శబరులూ అక్కడి కొచ్చి చేరారు.

"నువ్వేదో ప్రమాదంలో చిక్కుకున్నావని, నేను భయపడ్డాను, శిలిముఖీ!" అన్నాడు విక్రమకేసరి.

"చాలా పెద్ద ప్రమాదంలోనే చిక్కుకున్నాను. అదృష్టం కొద్దీ బయటపడ్డాను. ఆ దుర్మార్గులీప్రాంతాన మాటుపెట్టి నన్ను తల కిందులుగా వేలాడ దీసి చంపాలని చూశారు...అదంతా తరవాత మాట్లాడుకో వచ్చు. ముందు ఆ పూజారి బంట్లు దాగి వుండే స్థలం ఏదో మనం తెలుసుకోవాలి. ఒకళ్ళిద్దరం అయినా, వాళ్ళను వెన్నంటి పోగలిగితే, సూర్యోదయం కాగానే ఆ ముఠా నంతా అడవిజంతువుల్ని వేటాడినట్టు వేటాడవచ్చు," అన్నాడు శిలిముఖి.

"వాళ్ళు అరణ్యంలో ఎక్కడ దాగి వుండేదీ కనుక్కోవటానికి మన ఇద్దరం చాలు. ఎర్రగండు పసికట్టి మనకు దారి చూపగలదు. తెల్లవారగానే పల్లెవాసులంతా మనకు సహాయం వస్తారు," అంటూ విక్రమ







కేసరి తన వెంటవున్న శబరుల కేసి తిరిగి, "ఇక మీరు పల్లెకు పొండి. మరొకసారి పూజారి అనుచరులు పల్లెకు నిప్పు పెట్ట కుండా చూసుకోండి. మా ఇద్దర్లో ఎవరో ఒకరు ఆ క్రూరులు అరణ్యంలో ఎక్కడ దాగి వున్నారో చూసి, పల్లెకు వార్త తెస్తాం," అని చెప్పారు.

శబరులు వెళ్ళిపోయారు. ఆ తరవాత శిఖిముఖి, విక్రమకేసరి అరణ్యం కేసి బయలుదేరారు. ముందు ఎర్రగండు నేలను పసిగడుతూ నడవసాగింది. అది దొంగలు పోయిన మార్గాన్ని సరిగానే గుర్తించిందన్న నమ్మకం శిఖిముఖికి కలిగింది. క్రమంగా ఎర్రగండు వాళ్ళను అరణ్యంలోని ఒకానొక కొండ ప్రాంతానికి తీసుకుపోయి, అక్కడ ఒక మహా వృక్షం కింద నిలబడి కొంచెం సేపు భూమిని మూచూసి, చెట్టు చుట్టూ గిర్రుగిర్రున తిరుగుతూ, తల ఎత్తి పైకి చూడసాగింది.

విక్రమకేసరికి కుక్క ప్రవర్తన వింతగా కనబడింది. అతడేమో మాట్లాడబోయేంతలో శిఖిముఖి అతణ్ణి వారించి, తల ఎత్తి చెట్టు కొమ్మల్లోకి పరీక్షగా చూశాడు. గుబురు కొమ్మల్లో అతడికో మానవాకారం కన బడింది. బాగా పరీక్షించి చూసిన మీదట శిఖిముఖికి, వాడు పూజారి అనుచరుడని తెలిసిపోయింది. వాడు, చెట్టు కొమ్మ నొక దాన్ని రెండు చేతులతో గట్టిగా కావిలించు కుని, కొమ్మ మీద బోర్లాపడుకుని నిద్ర పోతున్నాడు. ఒర నుంచి కత్తి కిందికి వేళ్ళాడుతున్నది.

శిఖిముఖి వాణ్ణి విక్రమకేసరికి చూపుతూ, చిన్న గొంతుతో, "కేసరి, వాడు శిథిలాలయ పూజారి కాపలావాడన్నమాట. చెట్టు పైన దాగి, యీ ప్రాంతాలకు వచ్చేవాళ్ళను కనిపెట్టివుండి, కబురందించమని ఆ వికృతా కారుడు వీణ్ణి యిక్కడ కాపలా పెట్టి వుంటాడు. కాని, యీ వెధవ రాత్రంతా





అరణ్యంలో చెడ తిరిగి సూర్యోదయం వేళకు హాయిగా చెట్లకొమ్మల్లో నిద్ర పోతున్నారు," అన్నారు.

"వీణ్ణి మనం ప్రాణాలతో పట్టుకుని పూజారిని గురించిన రహస్యాలు లాగాలి," అన్నారు విక్రమ కేసరి.

"ప్రాణాలతో పట్టుకోవటమే కాదు, నిద్ర మేలుకొని అరవకుండా చూడాలి. వీడు అరిచాడో పూజారికి మనం యీ ప్రాంతాల కొచ్చినట్టు తెలిసిపోతుంది. అదుగో సూర్యోదయం కూడా అవుతున్నది. నువ్వు చెట్టు కిందనే వుండు. నేను నిశ్శబ్దంగా చెట్టెక్కి వాణ్ణి కిందికి లాక్కొస్తాను," అని చెప్పి శిఖిముఖి దాపులనున్న చెట్ల మీది కొన్ని అడవి తీగలను తెంచి, అరచేతి వెడల్పూ, ఒక గజం పొడవూ వుండేట్టుగా వాటిని అల్లి, మెల్లిగా చెట్టు మీదికి పాకిపోయి, పూజారి అనుచరుడి మెడను గట్టిగా ఒక చేత్తో పట్టుకుంటూనే, రెండో చేత్తో యీటెను అతడి కళ్ళ ముందు ఆడించాడు.

పూజారి అనుచరుడు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. ఎదురుగా వాడికి ఉదయసూర్య కిరణాల్లో తళతళా మెరుస్తున్న ఈటె అలుగు కనిపించింది. వాడు భయ కంపితుడై అరవబోయేంతలో, శిఖిముఖి



చేతి పట్టును మెడమీంచి గొంతు మీదికి మార్చి, "నోరెత్తావో, ఈటె గుండెల్లో దించు తాను. కొద్ది రోజులపాటైనా బతక దలిస్తే, కిక్కురు మనకుండా నాతోపాటు చెట్టు దిగు," అని చెప్పి, వాడి ఒర నుంచి కత్తి లాక్కుని చెట్టు దిగాడు. పూజారి అనుచరుడు గడగడ వణికిపోతూ అతడి వెనకగా చెట్టు దిగి వచ్చాడు.

శిఖిముఖి, పూజారి అనుచరుణ్ణి చెట్టు బోదెకు ఆనుకు కూర్చోమని ఆజ్ఞాపించి, "నువ్వు ప్రేతాకారంగాడి బంటువేగదా? నిజం చెప్పకపోయావో నిన్ను ప్రాణాలతోనే ఎర్రగండుకు ఆహారంగా వేస్తాను. వాడి







కొండ ప్రాంతాల ఏ గుహలో వుంటున్నారు?"
అని ప్రశ్నించాడు.

పూజారి అనుచరుడు ప్రాణభయంతో కంపించిపోతూ, "అయ్యా, నన్ను చంపకండి, నిజం చెపుతాను. పూజారి దొర యీ కొండ ప్రాంతాల వూట కొకచోటు మారుతుంటాడు. నిన్న సాయంకాలం ఆ దొర వున్న చోటు—ఒంగున్న రాక్షసిలా కనబడే ఆ గండశిల వెనక వున్న చీకటి గుహ. ఇప్పటింకా అక్కడే వున్నాడో లేదో నాకు తెలీదు," అన్నాడు.

"నువ్వు నిజమే చెపుతున్నావా?" అని గద్దించి అడిగాడు శిఖిముఖి.



"పూజారి పెద్ద అబద్ధాలకోరు. వాడి బంటు మరొక విధంగా ఎందుకుంటాడు? ఎర్రగండును ఉసికొలుపు, శిఖిముఖి," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఊఁ అనగానే ఎర్రగండు పూజారి అనుచరుడి మీదికి ఎగిరి దూకి, వాడి గొంతు పట్టుకోబోయినదల్లా ఆగి, తల తిప్పి యజమాని కేసి చూసింది. "ఆహా, యిది కుక్కకాదు, ఇంగితం ఎరిగిన మనిషి," అన్నాడు విక్రమకేసరి.

పూజారి అనుచరుడు ప్రాణభీతితో అరవబోయే సరికి శిఖిముఖి అతడి మీదికి ఈటె గురి చేసి, "అరవకు. ఇప్పటికైనా అబద్ధాలాడక, నిజం చెప్పు. ఎర్రగండు నిన్నేమీ చేయదు," అన్నాడు.

"నేను నిజమే చెప్పాను, రక్షించు దొరా!" అంటూ పూజారి అనుచరుడు కళ్ళ నీళ్ళు పెట్టాడు.

దొంగవాడి కళ్ళ నీళ్ళు చూడగానే విక్రమకేసరికి అతడి మీద జాలి కలిగింది. అతడు శిఖిముఖి భుజం పట్టుకుని, "శిఖీ! పాపం, వాణ్ణి చంపకు. నిజమే చెప్పాడు, తెలియటం లేదా? మనం వీడు చెప్పే ప్రాంతానికెళ్ళి చూద్దాం. పూజారి పెద్ద మచ్చువెధవ. వాడు తనను నమ్మి సేవ







చేసే వాళ్ళతో అయినా మనసిచ్చి మాట్లాడతాడని నేననుకోను," అన్నాడు.

శిఖిముఖి ఎర్రగండును యివతలికి పిలిచి, దొంగతో, "ఒరే, నిన్ను కొంత సేపయినా కాళ్లూ చేతులూ కట్టి, నోరు బిగించి, ఆ పొదల్లో దాచి పోక తప్పదు. మీ యజమాని ఎక్కడున్నాడో చూసి తిరిగొచ్చేప్పుడు నీ కట్లు విప్పుతాను," అంటూ వాడి కాళ్ళూ చేతులూ కట్టి, నోటికి అడ్డంగా అడవి తీగలతో అల్లిన వల నొకదాన్ని బిగించి, మూటలా ఎత్తుకుపోయి గుబురుగా వున్న పొదల్లో పడవేశాడు.

తరవాత శిఖిముఖి, విక్రమకేసరి, ఎర్రగండూ దొంగ చెప్పిన కొండ ప్రాంతాని కేసి బయలుదేరారు. వాళ్ళ కా ప్రాంతాల్లో మనుషులు సంచరించిన గుర్తులు కనిపించినై. వాటిని చూస్తూ వాళ్ళు మరికొంత ముందుకు పోయేసరికి, నలుగురైదుగురు మనుషులు పక్కపక్కన నడవటానికి వీలుగా వున్న ఒక కొండదారి మీద— అంత ఎత్తున ఒక కొయ్యబొమ్మ కనిపించింది. దాని చేతుల్లో రక్తంలో తడిసి వున్న ఒక త్రిశూలం వున్నది.

విక్రమకేసరి ఆ భయంకర విగ్రహాన్ని చూసి ఆశ్చర్యపడుతూ ముందుకు నడవబోయేంతలో, శిఖిముఖి అతడి భుజం పట్టుకుని వెనక్కులాగి, "కేసరీ, ఆగు. మనం ఆ దారి వెంట పోవాలంటే, ఆ కొయ్య బొమ్మ కాళ్ళ కిందుగా నడవాలి. దాని చేతిలో రక్తం ఓడుతున్న త్రిశూలాన్ని చూశావా?" అని ప్రశ్నించాడు.

వాళ్ళిద్దరూ ఇలా మాట్లాడుతున్నంతలో ఎర్రగండు కొయ్యబొమ్మను సమీపించి, దాని కాళ్ళ కిందుగా ముందుకు పోబోయింది. అంతలో బొమ్మ జపజప మంటూ వణికింది. దాని చేతిలో వున్న త్రిశూలం మెరుపులా నేల మీదికి ఝుమ్ అంటూ దిగసాగింది.

—(ఇంకా వుంది)





# శిథిలాలయం

## 5

[పూజారి అనుచరులు పెట్టిన మాటులో నుంచి బయటపడిన శిఖిముఖి దగ్గిరకు విక్రమకేసరి వచ్చాడు. అప్పుడు ఆ ఇద్దరూ కలిసి దొంగలను వెతుకుతూ కొండప్రాంతాలకు వెళ్ళారు. అక్కడ త్రిశూలం పట్టుకునివున్న ఒక పెద్ద కొయ్యబొమ్మ కనిపించింది. దాని కిందుగా ఎర్రగండు పరిగెత్తేంతలో త్రిశూలం వేగంగా కిందికి దిగసాగింది. తరవాత—]

కొయ్యబొమ్మ చేతులు కదిలినప్పుడు కలిగిన అతి స్వల్పమైన ధ్వనిని ఎర్రగండు వినగలిగింది. వెంటనే అది ఒక్క దూకున బాణంలా ముందుకు దూసుకు పోయింది. మరుక్షణం బొమ్మ చేతిలోని త్రిశూలం బలంగా నేలను తాకింది. శిఖిముఖీ, విక్రమకేసరి నివ్వెరపోయారు.

"ఇది కొయ్యబొమ్మ కాదు, రాక్షసి బొమ్మ! ఎర్రగండు ప్రాణాలు దక్కించుకున్నది. అదృష్టం కొద్దీ మనం కూడా దావు తప్పించుకున్నాం," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి కొయ్యబొమ్మను సమీపించి, దాన్ని జాగ్రత్తగా పరీక్షించి చూస్తూ, "ఇది శిథిలాలయ పూజారి మన కోసం పెట్టిన మాటు. కాని, మన కంటె ముందుగా ఎవడో నిర్భాగ్యుడు యీ దారి వెంట ముందుకు పోయి, దీని చేతిలోని త్రిశూలం వల్ల గాయపడటమో, మరణించటమో జరి







గింది. త్రిశూలాన్ని అంటి వున్న నెత్తురు సూర్యకాంతిలో ఎలా మెరుస్తున్నదో, చూశావా!" అన్నాడు.

విక్రమకేసరి ఆ రాక్షసిబొమ్మ కాళ్ళలో ఒకదాన్ని ఈటెతో పొడిచి చూశాడు. బొమ్మ కొంచెంగా కదుల్లాడింది. అతడు శిఖిముఖి కేసి తిరిగి, "శిఖీ! మనం దీన్ని తేలిగ్గా పడకొట్టగలం అని నాకు తోస్తున్నది. దీన్ని యిలాగే వుండనివ్వటం ప్రమాదకరం. మన వాళ్ళు అజాగ్రత్తగా దీని కిందుగా నడవటం జరిగితే చావు తప్పదు," అన్నాడు.

శిఖిముఖి ఆ మాటలకు అవునన్నట్టు తల వూపి, అక్కడికి సమీపంగా వున్న ఒక



పెద్ద రాతిని విక్రమకేసరికి చూపుతూ, "మనం యిద్దరం దాన్ని కదిలించగలం అనుకుంటాను. పట్టు పట్టి ఆ రాయిని కొయ్యబొమ్మ కాళ్ళ మీదికి నెట్టగలిగామంటే, అది కుప్పలాగా కూలటం ఖాయం," అన్నాడు.

ఆ వెంటనే శిఖిముఖి, విక్రమకేసరి బండరాయిని బలంగా పట్టుకుని వున్న చోటు నుంచి కదిలించి, విసురుగా దాన్ని కొయ్యబొమ్మ కాళ్ళ కేసి నెట్టారు. రాయి దొల్లుకుంటూ పోయి బొమ్మ కాళ్ళల్లో ఒక దాన్ని ఢీ కొట్టింది. మరుక్షణం కొయ్య బొమ్మ కిర్రుమంటూ కదిలి దభీమంటూ కింద పడిపోయింది. దాని చేతిలో వున్న త్రిశూలం ఎగిరి అంత దూరాన పడింది.

"ఆహా, మనం మహా ఘనకార్యం చేశాం. కాని, యీ రాక్షసి బొమ్మ కుప్ప కూలుతూ చేసిన ధ్వని పూజారికీ, వాడి అనుచరులకూ వినబడే వుంటుంది," అన్నాడు శిఖిముఖి.

"అందుకు సందేహం లేదు. నన్నడిగితే ఆ దుర్మార్గులు మనం యీ బొమ్మను సమీపిస్తూండటం ఏ రాళ్ళ చాటు నుంచో ముందే చూసి వుంటారంటాను. దాని చేతి లోని త్రిశూలం మన గుండెల్లో ఎప్పుడు











గుచ్చుకుంటుందా అని వాళ్ళు ఉవ్విళ్లూరి వుంటారు కూడా. కాని వాళ్ళ ఎత్తుపార లేదు," అన్నాడు విక్రమకేసరి.

"నిజమే. యిప్పుడు నాకో అనుమానం కలుగుతున్నది. మనం అమాయకంగా ఆ దుష్టులు పెట్టిన బోనులోకి నడవటం లేదు కదా! ఇంతకు ముందు మనం పల్లెవాసుల్ని గూడేనికి తిరిగి పొమ్మని చెప్పటంలో పెద్ద పొరపాటు చేశాం. అంత పెద్ద శత్రుమూకను మన యిద్దరం ఎదిరించి ఎలా నిలవగలం? వాళ్ళు యీ దాపుల నున్న ఏ కొండ గుహలోనే వుంటారు. సందేహం లేదు," అన్నాడు శిఖిముఖి.

వాళ్ళిద్దరూ యిలా మాట్లాడుతున్నంతలో కొండ గుహల కేసి పోయిన ఎర్రగండు మొరుగుతూ వాళ్ళ దగ్గిరకు పరిగెత్తు కొచ్చింది. కుక్కను చూస్తూనే శిఖిముఖికి పూజారి ముఠా ఆ దాపులనే ఎక్కడో దాగి వున్నారన్న అనుమానం కలిగింది. బహుశా వాళ్ళు తమ మీదికి దాడి రాబోతున్నారేమో!

శిఖిముఖి, ఎర్రగండు తల నిమురుతూ, "కేసరీ! మనం యిలా నిలబడి ముందుకు పోవటం ప్రమాదం. పూజారి అనుచరులు ఒక్క బాణం దెబ్బతో మనిద్దర్నీ హత మార్చగలరు. రాళ్ళ చాటుగా పాకుతూ ముందుకు పోదాం. ఎర్రగండు మనకు దారి చూపగలదు," అన్నాడు.

ఎర్రగండు వశికట్టి ముందుకు పోవటానికి మారుగా, వెనక కాళ్ళ మీద లేచి నిలబడి పెద్దగా మొరగసాగింది. దాని ప్రవర్తన బాగా తెలిసిన శిఖిముఖి రాళ్ళ చాటున పాకుతూ పోతున్నవాడల్లా లేచి నిలబడ్డాడు. అతడి దృష్టి తమ కేసి పరిగెత్తు కొస్తున్న ఒక శబరుడి పైన బడింది. అతడు విల్లంబులు ధరించి వున్నాడు. మారాన్నుంచి పరిగెత్తు కొస్తున్న వాడిలా కనబడ్డాడు.

శబరుడు తనను సమీపించగానే శిఖిముఖి, "అలా పరిగెత్తు కొస్తున్నావేం?









ఏం జరిగింది? నువ్వే గూడెం వాడివి?'' అని ప్రశ్నించారు.

శబరుడు రొప్పుతూ, ''మాది తిమ్మ గూడెం. మా గూడెంలో వున్న ధాన్యమంతా ఎక్కడి నుంచో వచ్చిన సవరజాతి ముఠా వాళ్ళు దోచుకుంటున్నారు. సాయం కోసం మీ పల్లెకు వస్తున్నాను. పల్లె పెద్ద శివాలుడి కొడుకు శిలిముఖివి కాదా నువ్వు? నీ కుక్కను చూసి, యీ ప్రాంతాల మీ వాళ్ళుంటారని, కుక్క వెనగ్గా పరిగెత్తు కుంటూ వచ్చాను,'' అన్నాడు.

శబరుడు దోపిడిదొంగలని చెప్పే సవర జాతి వాళ్ళు శిథిలాలయ పూజారి అనుచరులై వుంటారని శిలిముఖి, విక్రమకేసరి కూడా భావించారు. శిలిముఖి కొండ పాదంలో వున్న తిమ్మగూడెం దిక్కు కేసి చూస్తూ, ఆ గూడెంవాణ్ణి, ''ఆ ధాన్యం దోపిడిగాళ్ళ వెంట అంత పొడుగ్గా శవాకారంలో వున్న వాడెవడైనా వున్నాడా?'' అని అడిగాడు.

''అలాంటి వాడెవడూ లేడు. సవరల నాయకుడి పేరు గండుపోతు. ఇంత మీసాలవాడూ-అడివి దున్నలా వున్నాడు,'' అని చెప్పాడు తిమ్మగూడెం వాడు.

''సరే, నువ్వు మా పల్లెకు పోయి సంగతి చెప్పి మనుషుల్ని సహాయం తీసుకురా. మేం యిద్దరం ముందుగా మీ గూడేనికి పోయి ఆ గండుపోతు దోచుకున్న ధాన్యంతో పారిపోకుండా చూస్తాం. మీ గూడేనికి దారి నే నెరుగుదును,'' అన్నాడు శిలిముఖి.

తిమ్మగూడెం వాడు, కుంభారమిట్ట పల్లె కేసి పరిగెత్తాడు. శిలిముఖి, విక్రమకేసరి కొండదారుల వెంట తిమ్మగూడెం కేసి బయలుదేరారు. పావు గంట తరవాత వాళ్ళు ఆ గూడేన్ని చేరేసరికి, గూడానికి ఓ పక్కగా వున్న చెట్ల కింద చాలామంది శబరులు మందగా నిలబడి వున్నారు. వాళ్ళను అదిలిస్తూ పది పన్నెండుమంది





నవరజాతి వాళ్ళు కాపలా కాస్తున్నారు. ఆ కాపలా వాళ్ళను చూస్తూనే, శిఖిముఖి, విక్రమకేసరి ఆ దొంగలు శిథిలాలయ పూజారి అనుచరులని గ్రహించారు.

శిఖిముఖికి ఆ క్షణంలో ఓ ఉపాయం తోచి, ఆ కాపలా వాళ్ళను సమీపించి, "మీ యజమాని ఆ శిథిలాలయ పూజారి ఎక్కడున్నాడు? చాలా అవసరం అయిన పనుంది," అన్నాడు.

ఆ ప్రశ్నకు కాపలా వాళ్ళల్లో ఒకడు పొట్ట రెండు చేతులతో పట్టుకుని పెద్దగా నవ్వి, "పూజారి దొరను చూసేంత ఘనుడివా నువ్వు. శబరకుంకా! ఆ దొర కావాలనుకుంటే ప్రత్యక్షమవుతారు, వద్దనుకుంటే మాయమై పోతారు," అన్నాడు.

ఇంతలో కాపలావాళ్ళల్లో మరొకడు ఎర్ర గండు కేసీ, శిఖిముఖి కేసీ గుచ్చిగుచ్చి చూసి, "అరే! వీడు రాత్రి మనం పెట్టిన మాటు నుంచి తప్పించుకు పోయిన శబర పిశాచంగాడు. మన వాళ్ళ ఇద్దర్ని గాయపరిచాడు. ఆ కుక్కను పట్టుకోబోయి మనలో నలుగురం కాట్లు తిన్నాం. ఆ పక్కన వున్న వాడి మొఖం ఎక్కడో చూసినట్టుందే!" అంటూ యీటె ఎత్తి శిఖిముఖి వాళ్ళను సమీపించబోయాడు.



శిఖిముఖి, విక్రమకేసరి వాడి మీదికి యీటె గురిచేశారు. "మీ కాపలా వాళ్ళతో మాకు విరోధం లేదు. మీది మీదికి వచ్చారో మీకు చావు తప్పదు. యీలోపల మీరు మంచవేసి కాపలా కాసే శబరులంతా పారిపోతారు. ఆ సంగతి తెలిసిందంటే పూజారి మిమ్మల్ని నిలువునా భస్మం చేసేస్తాడు," అన్నాడు శిఖిముఖి.

శిఖిముఖి యిలా అనేసరికి, అతడి మీదికి రాబోయిన సవరుడు ఈటె దించి, తిరిగి తన అనుచరుల దగ్గిరకు పోయి, "మనకు కుల పెద్ద గండుపోతు చెప్పిన పని వుండనే వున్నది. ఈ కుర్ర వెధవల్తో ఏం పని,"







అని చెప్పి, శశిముఖి కేసి తిరిగి, "పూజారి దొర ఎక్కడున్నాడో మాకు తెలీదు. ఆ దొరకు కుడిభుజంలాంటి సవరగండుపోతు గ్రామంలో ధాన్యం మూటలు కట్టిస్తున్నాడు. చావ దలుచుకుంటే అక్కడికి పోయి పూజారి దొర సంగతి అతన్నడగండి," అన్నాడు.

శశిముఖి, విక్రమకేసరి అక్కణ్ణించి కదిలి గ్రామంలోకి కొంతదూరం నడిచి, ఇప్పుడేం చేయటమా అని ఆలోచించారు. కనీసం ఓ అరగంట కాలంలో తమ పల్లె నుంచి సహాయం తప్పక వస్తుందని వాళ్ళకు నమ్మకం కలిగింది.

"ఆ గండుపోతుతో మాటలు పెంచి, వాడు ధాన్యం ఎత్తుకు పారిపోకుండా కొంత సేపు ఆపగలిగామంటే, మా అయ్యతో వచ్చే మన పల్లెవాళ్ళు, ఈ సవర బందిపోట్లందరినీ పట్టేస్తారు. ఆ తరవాత ఒంటరిగాడై పోయిన పూజారిగాణ్ణి దొరక పుచ్చుకోవటం ఏమంత కష్ట కార్యం కాదు. ఏమంటావ్, కేసరీ?" అని ప్రశ్నించాడు శశిముఖి.

"భలే, ఆలోచన! ఊఁ పద," అన్నాడు విక్రమకేసరి. ఆ ఇద్దరూ గ్రామం మధ్యకు వెళ్ళేసరికి, అక్కడ ఒక పెద్ద పాతర నుంచి ధాన్యం బయటికి తీసి, కొందరు సవరలు మూటలు కడుతూండటం వాళ్ళ కంట బడింది. పాతరకు ఒక పక్కగా ఒక ఆజానుబాహుడు, కోరమీసాలు సవరించుకుంటూ నిలబడి వున్నాడు.

శశిముఖి అతణ్ణి చూస్తూనే ఆగి పెద్ద గొంతుతో, "గండుపోతూ! నువు చేస్తున్నది అన్యాయ కార్యం. గ్రామవాసులంతా కలిసి దాచుకున్న ధాన్యాన్ని బలం వున్నది గదా అని దోచుకు పోవటం ధర్మం అనిపించుకోదు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే గండుపోతు చర్రున వెనుదిరిగి, శశిముఖి కేసి అక్క

ర్యంగా చూసి, "ఎవర్రా నువ్వు! శబర శవాలుడి కొడుకువా? నీ గురించి చాలా విన్నాను, ఒకసారి చూశాను కూడా. నవర కుల పెద్ద గండుపోతుకు న్యాయం, ధర్మం బోధ చేయటానికి వచ్చావా? అదేదో చెప్పటం కూడా నీకు చేత కాలేదు!" అంటూ పక్కన వున్న తన భృత్యుల కేసి తిరిగి, "అలా చూస్తారేం? వాణ్ణీ, వాడి మిత్రుణ్ణీ చెట్టుకు పెడరెక్కలు విరిచి కట్టండి," అన్నాడు.

గండుపోతు యిలా అనగానే, అతడి అనుచరులు నలుగురు ముందుకు వచ్చి, శిఖిముఖీ, విక్రమకేసరులను పట్టుకునేం దుకు, వాళ్ళ కేసి నడిచారు. కాని, శిఖి ముఖి తన మిత్రుణ్ణి హెచ్చరించి ఒక్కొక్క అడుగే వెనక్కు వేయసాగాడు. అతడి ఉద్దేశం, తమను పట్టుకో వస్తున్న వాళ్లను, ఆ ప్రదేశం నుంచి కొంత దూరంగా తీసుకు పోయి హతమార్చాలని. అలా కాకపోతే, గండుపోతు వెంట వున్న తతిమ్మా శత్రు వులు తమను చుట్టుముట్టి పట్టుకోగలరు.

శిఖిముఖి వెనకడుగు వేయటం చూసి, గండుపోతు హేళనగా నవ్వుతూ, "శబర పెద్ద శవాలుడి కొడుకు యింత పిరికి పంద అనుకోలేదు!" అన్నాడు.

ఆ మాట వింటూనే శిఖిముఖి ముందుకు రెండడుగులు వేసి, "గండుపోతూ! వయ సులో, ఎత్తులో, బలంలో కూడా నా కన్న రెండింతలున్నావు. నన్ను పట్టుకునేందుకు నీ భృత్యుల్ని పంపటం ఎందుకు? నువ్వే, ఆ పని చేయకూడదా?" అన్నాడు.

గండుపోతు కళ్ళు నిప్పులు చెరిగినై. అతడు ఒకసారి హుంకరించి, ఎడం చేత్తో మీసం మెలివేస్తూ, యీటె పైకెత్తి, "నీవు దాపుకోరి యిక్కడి కొచ్చినట్టుంది. ఇదిగో వస్తున్నాను, కాచుకో!" అంటూ, ఈటెను శిఖిముఖి గుండెల కేసి గురిచేసి, ఊపించి ముందుకు దూకాడు. —(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 6

[రాకాసిబొమ్మ ప్రమాదం నుంచి బయటపడి, శిఖిముఖి, విక్రమకేసరి కొండగుహల కేసి పోయేంతలో, తిమ్మగూడెం పల్లెలో నవరగండుపోతు ధాన్యం దోచుకుంటున్నట్టు, ఆ పల్లెవాడి ద్వారా వాళ్ళకు తెలిసింది. వాళ్ళిద్దరూ ఆ పల్లె చేరారు. నవరగండుపోతు, శిఖిముఖిని చూసి మండిపడి, ఈటె తీసుకుని అతడి మీదికి దూకాడు. తరవాత—]

కొండప్రాంతాన శిఖిముఖి, విక్రమకేసరులకు ఎదురైన తిమ్మగూడెంవాడు, శరవేగంతో కుంభారమిట్ట పల్లెకు పోయాడు. అతడక్కడికి చేరేసరికి, పల్లెవాసులు కాలిపోయిన తమ గుడిసెలను బాగుచేసుకుంటున్నారు. వాళ్ళల్లో ప్రతిఒక్కడి ముఖంలోనూ కోపం, దైన్యం కనబడుతున్నది.

తిమ్మగూడెంవాడు, కొత్తగా కట్టబడుతున్న ఒక గుడిసెముందాగి, "శబరమాతకూ, జై! నేను తిమ్మగూడెం శబరుణ్ణి. పల్లెపెద్ద శివాలుడి ఇల్లెక్కడ? నవరగండుపోతు మా గూడెం మీదపడి ధాన్యం దోచుకుపోతున్నాడు. మీ పల్లె నుంచి సహాయం కావాలి," అన్నాడు.

అతడి మాటలు వింటూనే, గుడిసెపని చేస్తున్న ఒక మధ్యవయసువాడు, చేతిలో వున్న తాళ్ళనూ, కర్రలనూ కింద పడేసి, "చావుకబురు చల్లగా చెపుతున్నావా, ఏం?







తొందరగా పద. రాత్రి ఆ నవరగండుపోతు ముఠావాళ్ళే మా గుడిశెలు తగలబెట్టారు. వాళ్ళ కోసం పల్లెపెద్దకొడుకు శిలిముఖి అరణ్యమంతా గాలిస్తున్నాడు. గండుపోతు మీ పల్లెలోవున్న సంగతి పల్లెపెద్ద శివాలుడికి వెంటనే తెలియపరచటం మంచిది," అంటూ, గబగబా శివాలుడి ఇంటి కేసి దారితీశాడు. అతడి వెనకగా తిమ్మగూడెం వాడు బయలుదేరాడు.

ఆ ఇద్దరూ శివాలుడి ఇంటిని సమీపించే సరికి, ఇంటిముందున్న పెద్ద మామిడి చెట్టు కింద శివాలుడు కొందరు పల్లె పెద్దలతో మాట్లాడుతున్నాడు. తిమ్మగూడెంవాడు అతడికి దణ్ణంపెట్టి నాలుగైదు మాటల్లో తను వచ్చినపని చెప్పి, తమ గూడెం కేసి శిలిముఖీ, మరొకయువకుడూ వెళ్ళినట్టు కూడా చెప్పాడు.

అంతావిన్న శివాలుడు చప్పున లేచి నిలబడి, "శిలీ, విక్రమకేసరీ తిమ్మగూడె నికి వెళ్ళారన్నమాట. ఇది దుస్సాహసం. ఆ నవరగండుపోతును నే నెరుగుదును. వాడసలే దుష్టుడు. ఇప్పుడు పరమ దుష్టుడైన శిధిలాలయ పూజారితో వాడు నేస్తం కట్టాడు. సరే, వాళ్ళిద్దర్నీ మనం సర్వ నాశనం చేసితీరాలి. పల్లెయువకుల్లో ఓ పాతికమంది మెరికల్లాంటి వాళ్ళను ఏల వండి," అన్నాడు.

ఆ వెంటనే పల్లెపెద్దల్లో ఒకరు పక్కనున్న గుడిశెలోకి పరిగెత్తిపోయి, ఒక డప్పు తీసుకుని బయటికి వచ్చి దాన్ని బలంగా మోగించసాగాడు. ఒకటి రెండు నిమిషాలు గడవకముందే, పల్లెలోని యువకులు చాలా మంది యీటెలు పట్టుకుని అక్కడికి పరిగెత్తుకొచ్చారు. శివాలుడు వాళ్ళల్లో ఓ పాతికమందిని వేరుచేసి పక్కగా నిలబెట్టి, "ఇదిగో, యీ తిమ్మగూడెం అతడితో మీరు వెంటనే బయలుదేరిపొండి. దారిలో నవర గండుపోతు ముఠావాళ్ళు ఎదురైనా సరే,





వాళ్ళతో అట్టే జగడం పెట్టుకోక, మీరు నూటిగా తిమ్మగూడెనికి పోవాలి. నేను వెనకగా బయలుదేరివస్తాను," అన్నాడు.

తిమ్మగూడెంవాడు ముందుండి దారి తీయగా శబరయువకులు అతడి వెంట అరణ్యం కేసి పరిగెత్తారు. తరవాత శివాలుడు ఇంట్లోకిపోయి శబరనాయకుడైన వాడు శత్రువుల మీదికి దాడి బయలుదేరేప్పుడు ధరించవలసిన ఉడుపులూ, అడవి పక్షుల యీకలతోవున్న శిరస్త్రాణం ధరించి బయిటికివచ్చాడు.



ఆసరికి ఇంటి ముందు చాలామంది పల్లెవాసులు చేరారు. శివాలుడు వాళ్ళతో, "నేను తిరిగి వచ్చేవరకూ మీరంతా తగు జాగ్రత్తలో వుండండి. సవరగండుపోతుకు కావలసింది తిండిధాన్యం. శిధిలాలయ పూజారికి అవసరం అయినది నా ఇంట్లో వున్న తాళపత్ర గ్రంథం. నే లేనిసమయంలో వాడు నా ఇంటి మీదికి దాడి రావచ్చు. జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

"వాడు అద్భుతశక్తులున్నవాడు. మూడో కన్ను తెరిచి సర్వం భస్మంచేయగలడు," అన్నాడొకడు జనంలోనుంచి.

ఆ మాట్లాడినవాడు జనంలో ఎక్కడున్నాడో తెలుసుకునేందుకు శివాలుడు తలతిప్పి పరికించాచూసి, వాడు కనబడక పోయేసరికి, పెద్దగా గొంతెత్తి, "మన పల్లెవాసుల్లో కనీసం ఒకళ్ళిద్దరికైనా ఆ పూజారి అద్భుత శక్తుల్లో నమ్మకం కలగటం నా కాశ్చర్యంగా వుంది. పూజారీ, వాడి డబ్బు తిన్న అధములూ లేపే పుకార్లు నమ్మకండి," అన్నాడు.

తరవాత అతడు కొందరు పల్లెవాసుల్ని వెంటబెట్టుకుని తిమ్మగూడెం కేసి బయలు దేరాడు. అరణ్యంలో కొంత నడిచి కొండ ప్రాంతాన్ని చేరగానే, అక్కడ వారికి విరిగి నేలపడివున్న రాకాసిబొమ్మ కనిపించింది. శివాలుడి వెంట వున్నవాళ్ళందరూ దాన్ని







చూసి చాలా ఆశ్చర్యపడ్డారు, కొందరికి భయంకూడా కలిగింది.

శబరుల్లో ఒకడు కిందపడివున్న త్రిశూలాన్ని చేతికి తీసుకుని, దాని కంటివున్న రక్తాన్ని పరీక్షగా చూసి, శివాలుడి దగ్గిరకు వచ్చి, "ఈ త్రిశూలం నూటికి నూరుపాళ్లు కంచుది. మన ప్రాంతాల ఎవరూ యీ లోహాన్ని యిందుకు వాడరు. దీన్ని అంటి వున్న నెత్తురు మనిషిదికాదు, ఏదో అడవి జంతువుది," అన్నాడు.

శివాలుడు త్రిశూలాన్ని అందుకుని అటూ యిటూ తిప్పి చూసి, "నువ్వన్నది నిజం. వయసులో వుండగా విక్రమకేసరిదొర వెంట



హిమాలయ పర్వతప్రాంతాలకు వెళ్ళినప్పుడు, యీ కంచులోహాన్ని అక్కడి వాళ్ళు రకరకాల వస్తువులు చేయటానికి ఉపయోగించటం నేను చూశాను," అని, ఓ క్షణకాలం ఏదో ఆలోచిస్తూ వూరుకుని, తరవాత, "సరే, పదండి, కాలయాపన ఎందుకు," అంటూ ముందుకు నడిచాడు.

"ఈ త్రిశూలం శిథిలాలయ పూజారిదే నంటావా, శివాలుడొరా! వాడు హిమాలయ ప్రాంతాల నించి వచ్చినవాడేగదా?" అని ప్రశ్నించాడు, త్రిశూలాన్ని శివాలుడి కిచ్చిన శబరుడు.

"వాడి మాట లెలా నమ్మటం? వెయ్యేళ్ళుగా శిథిలాలయ పూజారిత్వం, మూడో కన్ను, కావాలన్నప్పుడు అదృశ్యమై పోవటం...ఇందులో ఏదో మోసం వుంది. వాణ్ణి చేజిక్కించుకుంటేనేగాని నిజం బయటపడదు. ముందు మనం త్వరగా తిమ్మగూడెం చేరాలి. మనకంటె ముందు పోయినవాళ్ళు, యీపరికి గూడెం చేరి వుంటారనుకుంటాను," అన్నాడు శివాలుడు.

శివాలుడి ఊహ సరైనదే. తమ పల్లె పెద్దకొడుకు ప్రమాదంలో చిక్కుకుని వుండొచ్చని భావించిన శబరయువకులు, తిమ్మగూడెంవాడి వెంట ఆగమేఘాల మీద











ఆ గూడేనికి పరిగెత్తారు. గూడెం పరిసరాలను చేరుతూనే, సహాయం కోసం వచ్చిన ఆ గూడెంవాడు శబరయువకులను సరాసరి గండుపోతు వున్న చోటుకు తీసుకుపోతుండా, పక్కదారుల వెంట వాళ్ళను నడిపి, గండుపోతు ధాన్యం దోచుకుంటున్న ప్రదేశానికి చేర్చాడు.

వాళ్ళు అక్కడికి చేరేంతలో గండుపోతు రంకెలువేస్తూ, శిఖిముఖి మీదికి దూకాడు. శిఖిముఖి యీటె పైకెత్తి ముందు కడుగు వేయబోయేంతలో, గండుపోతు దృష్టి, అప్పుడే అక్కడి కొచ్చిన శబరయువకుల మీద పడింది. వాళ్ళంతా శిఖిముఖి వెనక వైపు నుంచి ఆయుధాలెత్తి ముందుకు ఉరకబోతున్నారు.

గండుపోతు వాళ్ళను చూస్తూనే తక్కున ఆగిపోయి పెద్ద గొంతుతో, "మోసం! కపటం! పోటాపోటీకి రమ్మని పిలిచి, నీ వాళ్ళను నా మీదికి దొంగదాడికి ఉసి కొల్పుతున్నావా?" అంటూ చూపుడు వేలును శబరయువకుల కేసి ఎత్తాడు.

శిఖిముఖీ, అతడికి అంతదూరంలో నిలబడివున్న విక్రమకేసరి ఆశ్చర్యంగా వెనక్కుతిరిగి చూశారు. వాళ్ళకు కొండల దగ్గిర తమకు కనిపించిన తిమ్మగూడెం వాడి వెంట వచ్చిన శబరయువకులు ఈటెలు పట్టుకుని ముందుకు వస్తూండటం కనిపించింది. శిఖిముఖి వెంటనే చేయెత్తి వాళ్ళకు ముందుకు రావద్దని సౌంజ్ఞచేసి, "మీరంతా వున్నచోటునే ఆగండి. ఈ సవర గండుపోతూ, నేనూ మా బలాబలాలు తేల్చుకొపోతున్నాం," అన్నాడు.

శబరయువకులు ఆ మాట వింటూనే ఎక్కడివాళ్ళక్కడ నిలబడిపోయారు. శిఖిముఖి, గండుపోతు కేసి తిరిగి, "ఊఁ, దెబ్బ కాచుకో, గండుపోతూ!" అని అరిచి ముందుకు అడుగు వేయబోయాడు. కాని, అంతలో గండుపోతు ఒకడుగు వెనక్కు







వేసి, "నువ్వు నీవాళ్ళ నందర్నీ వీపు వెనక వత్తాసు పెట్టుకుని నా మీదికి దెబ్బలాడ వస్తున్నావు.. ఒకవేళ... ఒకవేళ ఏమిటి? నువ్వు నా చేతిలో తప్పక చచ్చితీరుతావు— కాని, ఆ సమయంలో నీ శబరమంద అంతా ఒంటరిగావున్న నా మీదికి వచ్చి పడతారు," అన్నాడు.

"ఎవరిచేతిలో ఎవరు చచ్చేది యిప్పుడే తేలిపోతుంది, గప్పాలు కొట్టకు. కావాలంటే నీవాళ్ళను కూడా నువ్వు నీ వెనక రక్షణ కోసం తెచ్చుకో," అన్నాడు శిఖిముఖి.

ఆ వెంటనే గండుపోతు చప్పట్లుచరిచి కేకలుపెట్టాడు. గూడెంలో ఎక్కడెక్కడ వున్న అతడి అనుచరులంతా తమ నాయకుడి దగ్గరకు పరిగెత్తుకు వచ్చారు. గండుపోతు వాళ్ళందర్నీ వడ్లపాతరకు ఆవతలి వైపున ఆయుధాలతో సర్వసన్నద్ధంగా వుండమనీ, శిఖిముఖి ముఠావాళ్ళు వున్నచోటు నుంచి కాలు కదిపితేచాలు, వాళ్ళ మీదికి ఉరకమనీ ఆజ్ఞలు యిచ్చాడు.

ఆ తరవాత శిఖిముఖీ, గండుపోతూ ఈటెలను ఝళిపిస్తూ కలియబడ్డారు. గండుపోతు ఈటె విసుర్లను శిఖిముఖి తన ఈటెను అడ్డంగాపెట్టి ఆపుతూ, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, ధాన్యం పాతర చుట్టూ గిరికీలు తిరగసాగాడు. అతడి ఎత్తుగడ ఏమిటంటే, గండుపోతు మీద తను ఆఖరి దెబ్బ తీసేముందు అతణ్ణి బాగా అలిసిపోయేట్టు చేయాలని.

గండుపోతుకు, శిఖిముఖి తనను పాతర చుట్టూ తిప్పటం చిరెత్తిస్తున్నది. ఈ కుర్ర కుంకను క్షణాలమీద యీటెతో నాలుగు పోట్లు పొడిచి పాతర్లో పడవేసి యింత మట్టి కప్పించగలనని, అతడనుకున్నాడు. కాని, ఆ కుంక చిరతగండులా తన యీటె దెబ్బకు అందకుండా తప్పుకుంటూ, తనతో దాగుడుమూతలాట లాటి దేదో ఆడుతున్నాడు....





"ఒరే, పిరికిముక్కా! అంత భయపడి పారిపోదలిచిన వాడివి నాతో ఎందుకు పంతానికి దిగావు?" అంటూ పళ్ళుకొరికి, ఆయాసపడసాగాడు గండుపోతు.

"పోతూ! నేను పారిపోవటంలేదు, నీ ప్రాణం తీయబోతున్నాను!" అంటూ శిఖిముఖి ఒక్క కేకపెట్టి, తన యీటెను రెండు గుప్పెళ్ళలోనూ గట్టిగా బిగించి పట్టుకుని, గండుపోతు చేతిలోని ఈటెను బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు గండుపోతు పట్టుకున్న ఈటె పట్టుదప్పి ఎగిరి అంత దూరాన పడిపోయింది. అతడు దాని కోసం పక్కకు తిరిగి పరిగెత్తబోయేంతలో శిఖిముఖి అతడి భుజంమీద తన ఈటె అలుగును బలంగా ఆనించి, "పోతూ! శరణను, ఓడిపోయానను, నిన్ను ప్రాణాలతో వదులుతాను," అన్నాడు.

"గండుపోతు శబరకుక్కను శరణడగటమా?" అంటూ గండుపోతు భీకరంగా అరిచి ఎడంచేత్తో, భుజంమీద ఆనించివున్న శిఖిముఖి యీటెను పక్కకు కొట్టి, కుడిచేత్తో మొలనున్న పొట్టి కత్తిని చర్రున లాగి మీదికి దూకాడు. శిఖిముఖి చప్పున ఒక అడుగు వెనక్కువేసి, అతడి కత్తి దెబ్బను తప్పుకుని, తిరిగి గండుపోతు మీదికి రాబోయేంతలో ఈటెతో అతడి కుడి చేతిని



బలంగా ఒక పోటు పొడిచి, అదే సమయంలో కాలితో అతడి ఎడమ మోకాలి మీద గట్టిగా ఒక తన్ను తన్నాడు.

గండుపోతు బాధతో ఒక అరుపు అరిచాడు. అతడి చేతిలోని కత్తి జారి కింద పడింది. మోకాలి మీద తగిలిన తాపుకు కాలిపట్టు తప్పి అతడు పక్కనున్న పల్ల పాతల్లో దభీమంటూ పడిపోయాడు.

అది చూస్తూనే అతడి అనుచరుల్లో హాహాకారాలు బయలుదేరినై. వాళ్ళల్లో కొందరు పారిపోయేందుకు వెనుదిరగబోయేంతలో, ఒక సవరుడు ఎడమచేత్తో ఈటె పైకెత్తి, కుడిచేత్తో జబ్బచరుస్తూ, "గండుపోతుదొర తరవాత నేనూ, యిక్కడ నాయకుణ్ణి! ఈ శిఖిముఖినీ, వాడి కులం వాళ్ళనూ కన్నుమూసి తెరిచేంతలో నరికి పోగులుపెడతాను. మీరు నా వెన్ను కాచి వుండండి, చాలు, రండి," అంటూ శిఖిముఖి కేసి బయలుదేరాడు.

శిఖిముఖికి ప్రమాదం రానున్నదని గ్రహించిన విక్రమకేసరి, శబరయువకులందర్నీ హెచ్చరించి శత్రువులను ఎదుర్కొనేందుకు బయలుదేరాడు. అటు సవరలు కొత్త నాయకుడి వెంట ముందుకు రాసాగారు. భయంకరమైన పోరూ, రక్తపాతం తప్పని పరిస్థితి ఏర్పడిన ఆ దశలో సవరల వెనక నుంచి శివాలుడు ఎలుగెత్తి కేక పెట్టాడు: "అనవసర రక్తపాతం ఎందుకు? గండుపోతు ముఠావాళ్ళంతా లొంగిపొండి! ఆయుధాలు కింద పడవేయుండి."

ఆ కేక వింటూనే గండుపోతు అనుచరులు వెనక్కు తిరిగి చూశారు. శివాలుడూ మరి కొందరు శబరులూ ఈటెలు ఎత్తి తమ కేసి రావటం వాళ్ళ కంటబడింది. ముందువైపు నుంచి విక్రమకేసరి శబర యువకుల్తో మీదికి వస్తున్నారు. ఇప్పుడేం చేయటం? లొంగిపోవటమా? లేక నిలబడి ఎదిరించటమా? —(ఇంకా వుంది)








# శిథిలాలయం

## 7

[శిఖిముఖి, విక్రమకేసరి తిమ్మగూడెం వెళ్ళారని కబురందగానే, శివాలుడు కొందరు అనుచరులతో ఆ గూడెనికి వెళ్ళాడు. అతడు చేరేసరికి శిఖిముఖి, సవరగండుపోతును ఉలితో పొడిచి వడ్లపాతర్లో పడవేశాడు. గండుపోతు అనుచరులు, శిఖిముఖి మీదికి వచ్చేంతలో శివాలుడు వాళ్ళను ఆయుధాలు కిందపడవేయమని హెచ్చరించాడు. తరవాత—]

సవరగండుపోతు గాయపడి వడ్లపాతర్లో పడిపోగానే, అతడి అనుచరులకు నాయకత్వం వహించిన సవరుడు, శివాలుడి హెచ్చరిక విని తాను పెద్ద చిక్కులో తల దూర్చానని గ్రహించాడు. అప్పటి పరిస్థితుల్లో పోరుకు దిగటం అంటే సర్వనాశం కావటమే; అలా అని శివాలుడికి లొంగిపోతే—యిక సవరపల్లెల్లో తనకూ, తమ నాయకుడికీ మానమర్యాదలు దక్కవు....

సవరుడు యిలా ఆలోచించి, శివాలుడి కేసి తిరిగి పెద్ద గొంతుతో, "మీరు మమ్మల్ని అన్ని వైపుల నుంచి చుట్టుముట్టారు. మా కన్న మీరు రెండు మూడింతలు అధిక సంఖ్యలో వున్నారు. ఇది న్యాయం కాదు. మీరు చేసేది ధర్మయుద్ధం అనిపించుకోదు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే శిఖిముఖి సవరుడి కేసి తీవ్రంగా చూసి, "ప్రతిదానికి







న్యాయం, ధర్మం అంటూ వెకిలిగా మాట్లా
డటం, మీరు ఆ శిథిలాలయ పూజారి దగ్గి
ర్నుంచి నేర్చుకున్నట్టుంది. డబ్బు కాశపడి,
పరాయి చోటు నుంచి వచ్చిన మంత్రాల
పోతు పూజారికి సహాయపడటం న్యాయం,
ధర్మం అవుతుందా? ఈ తిమ్మగూడెం
మీద వచ్చిపడి ధాన్యం దోచుకుంటున్నారే,
యిదేరకం ధర్మం? ఇక అట్టే మాట్లాడక
ఆయుధాలు కింద పడెయ్యండి," అన్నాడు.

"ఒకసారి మేం నిరాయుధులం అయిం
తరవాత, మమ్మల్నందర్నీ మీరు ఈటెల్తో
పొడిచి చంపరని హామీ ఏమిటి?" అన్నాడు
సవరుడు.



"అదంతా మా దయాదాక్షిణ్యాల మీద
ఆధారపడి వుంటుంది. ఇంతకూ మీరు
చెప్పిన ఆయుధాలు అవతల పారేస్తారా?
లేక...." అంటూ శిఖిముఖి, విక్రమకేసరి
వెంట వున్న శబరయువకుల కేసి చూశాడు.

శిఖిముఖి మాటల ధోరణిని అలాగే సాగ
నిస్తే, అనవసర రక్తపాతం జరుగుతుందని
భయపడి, శివాలుడు తన చేతిలో వున్న
యీటెను దూరంగా విసిరివేస్తూ, "మీ సవ
రల్లో ఏ ఒక్కరికీ హాని జరగదని నేను
మాట యిస్తున్నాను. కావాలంటే ఆయు
ధాలు దగ్గిరే వుంచుకోండి, నా అభ్యం
తరం లేదు. నా క్కావలసిన వాడు శిథిలా
లయ పూజారి. వాడే నాకు ప్రబల విరోధి.
ఇంతకూ మీ నాయకుడు గండుపోతెక్కడ?"
అని అడిగాడు, సవరల నాయకుడుగా
మాట్లాడిన వాణ్ణి.

"ఇక్కడ! ఇక్కడ! వడ్లపాతర అడు
గున పడున్నాను. గాయం నుంచి నెత్తురు
వరదలై పారుతున్నది. కళ్ళు బైర్లు తిరుగు
తున్నై," అంటూ అరిచాడు సవరగండు
పోతు పాతర్లో నుంచి.

శివాలుడు ఆశ్చర్యంగా ఆ మాటలు
వినిపించిన వైపుకు చూసి, గబగబా వడ్ల
పాతర దగ్గిరకు పోయి, లోపలికి తొంగి











చూశాడు. గండుపోతు పాతర మధ్య కూర్చుని తలఎత్తి శివాలుడి కేసి చూశాడు.

"గండుపోతూ! ఏమిటిది? గాయపడ్డావా? త్వరగా పైకి రా. ఆ శిథిలాలయ పూజారిని పట్టుకునేందుకు నీ సహాయం కావాలి," అన్నాడు శివాలుడు.

"పైకి రాగలిగితే, ఎప్పుడో వచ్చి వుండేవాణ్ణి. ఈటె పోటు తిని కుడిచేయి చచ్చుపడి పోయింది. ఎడమకాలి కీళ్ళిరిగినట్టు అనుమానం. ఇంత చేసిన వాడెవడో తెలుసా? నీ కొడుకు శిఖిముఖి! వాడు ధైర్యసాహసాల్లో, కత్తి, యీటె సాముల్లో నా అంతటివాడు. వాడికి యీడొచ్చిన నా కూతురు నాగమల్లిని ఎందుకు చేసుకోగూడదు? ఏమంటావ్, శివాలా?" అన్నాడు గండుపోతు పకపకనవ్వుతూ.

ఈ అసందర్భపు మాటలు వినగానే, ఎత్తు నుంచి పడటంవల్లా, గాయం నుంచి రక్తస్రావం జరగటంవల్లా గండుపోతుకు మతిచలించి వుంటుందనుకున్నాడు, శివాలుడు. ఆ వెంటనే అతడు తన అనుచరుల్ని హెచ్చరించి ఒక కొయ్యపలక తెప్పించి, దాని చివర్లకు తాళ్ళు కట్టించి, ఇద్దర్ని పాతర్లోకి దింపాడు. వాళ్ళిద్దరూ గండుపోతును కూర్చున్న చోటు నుంచి ఎత్తి కొయ్యపలక మీద పడుకోబెట్టారు. పాతర పైనున్న వాళ్ళు, గండుపోతును మాటులోపడ్డ అడవి జంతువును పైకి లాగినట్టు తాళ్ళ సాయంతో పైకి లాగారు.

గండుపోతు తన అనుచరుల కేసి చూసి ఆశ్చర్యపడుతూ, "మన వాళ్ళందరి దగ్గిరా ఆయుధాలున్నయ్యే! ఇంతకీ యిక్కడ గెలిచిందెవరు? మన వాళ్ళెందరు చచ్చారు?" అని ప్రశ్నించాడు.

సవరలకు నాయకత్వం వహించిన వాడు గండుపోతు ముందుకు వచ్చి, "దొరా! శబర శివాలుదొర యిక్కడ రక్తపాతం జరక్కుండా ఆపారు," అన్నాడు.









అనుచరు లలా చెప్పగానే గండుపోతు, శబాలుడి కేసి తిరిగి, "నేను మీ జాతివాళ్ళకు చాలా అన్యాయం చేశాను. పూజారికుక్క నాకు బంగారం ఆశ చూపి, నా చేత పాడు పనులు చేయించాడు. నన్ను క్షమించు," అన్నాడు వణుకుతున్న గొంతుతో.

"జరిగిందేదో జరిగింది; యిద్దరం మరిచిపోదాం. ముందు నీ కాలికీ, చేతికీ కట్లుకట్టనీ. తరవాత ఆ పూజారి వేట అందరం కలిసి ప్రారంభిద్దాం," అని చెప్పి, శబాలుడు అంత దూరాన నిలబడి చూస్తున్న వృద్ధుడొకణ్ణి దగ్గిరకు పిలిచి, "ఈ సవరజాతి పెద్దకు వెంటనే చికిత్సచెయ్యి," అన్నాడు.

ఆ వృద్ధుడు గ్రామవైద్యుడు. అతను తన వైద్యపరికరా లెప్పుడూ సంచిలో పెట్టుకుని భుజానికి వేలాడవేసుకుని తిరుగుతూంటాడు. అతడు గండుపోతు చేతిగాయం మీద ఏదో ఆకుపసరు పిండి, ఆవే ఆకుల్ని కట్టుగా కట్టాడు. తరవాత గండుపోతు ఎడమకాలిని వేళ్ళతో పట్టి చూసి, యిద్దరు సవరుల్ని గండుపోతు చేతులు పక్కలకు లాగి పట్టుకోమని చెప్పి, రెండు వెదురు బద్దల్ని అతడి మోకాలుకు పైనా కిందా పెట్టి, తాడుతో గట్టిగా బిగించి ముడివేశాడు. వైద్యుడిది చేసేప్పుడు గండుపోతు బాధతో



గిలగిల్లాడిపోతూ, "ఇంత బాధకూ కారకుడు ఆ పూజారికుక్క! వాడిచ్చిన బంగారు ఇటుకల్ని మహానదిలో పారెయ్యాలి. వాణ్ణి ఈ బెగ్గుచ్చి, ఊకుమాను చిటారుకొమ్మన ఎంతగట్టండి!" అంటూ అరిచాడు.

కట్లు కట్టడం అయిపోగానే గ్రామవైద్యుడు లేచి నిలబడి, గండుపోతు ముఖంలోకి తీక్షణంగా చూస్తూ, "గండుపోతూ, వైద్యుడుగా నా ధర్మమేదో నేను చేశాను. ఇప్పుడు చెప్పు, మా గ్రామం నుంచి దోచుకుపోయిన ధాన్యం మాకు తిరిగి యివ్వదలిచావా, లేదా?" అని ప్రశ్నించాడు.









"మా వాళ్ళు ఎత్తుకుపోయింది బహు కొద్ది ధాన్యమే. అంతా ఎత్తుకుపోకుండా శిఖిముఖి పులిగండులా వచ్చి పడ్డాడు. మా వాళ్ళు ఎత్తుకుపోయిన ప్రతి బస్తా ధాన్యానికి రెండు బస్తాల మా సొంత ధాన్యం చేర్చి, మీ గ్రామ పాతర్లో పోయిస్తాను," అని చెప్పి, గండుపోతు తన అనుచరులతో, "బస్తాలుగా కట్టివున్న ధాన్యమంతా పాతర్లో పోయండి. మనవాళ్ళు గూడెం దాటించిన ప్రతి బస్తాతోనూ, మరి రెండుబస్తాల ధాన్యం మన పల్లె నుంచి యిక్కడికి తీసుకురండి," అని చెప్పాడు. తమ నాయకుడు అలా ఆజ్ఞాపించగానే, సవరులు కొందరు తమ పల్లె కేసి బయలుదేరబోయారు. గండుపోతు వాళ్ళను ఆపి, "పూజారికుక్క, తన గుహ వదిలి అరణ్యంలో తిరుగుతూండొచ్చు. ఒకవేళ మీ కెదురుపడి అడిగితే, ఇక్కడ మన సవరులందరూ, శబరశివాలుడికి ఖైదీలుగా చిక్కిపోయారని చెప్పండి," అన్నాడు.

తరవాత గండుపోతును, శివాలుడు యిద్దరి చేత గ్రామచావడిలోకి మోయించుకు పోయాడు.

గ్రామచావడిలో శివాలుడూ, శిఖిముఖి, విక్రమకేసరీ ఒక పక్కగా కూర్చున్నారు. గండుపోతు తన అనుచరులు పరిచిన జంతుచర్మాల మీద గోడకు చేరగిలబడి కూర్చున్నాడు. శివాలుడు ప్రశ్నించిన మీదట అతడు, శిథిలాలయ పూజారి వారం రోజుల క్రితం తమ పల్లెకు రావటం, లంచంగా చాలా బంగారం యిచ్చి, విక్రమకేసరి నుంచి తాళపత్ర గ్రంథం సంపాయించి తన కివ్వమని అడగటం గురించి చెప్పాడు.

"శివాలా, కేవలం వాడిచ్చిన వెధవ బంగారం కోసమే, నేనిన్ని పాడుపనులు చేశాననుకోకు. వాడు నాకు మహత్తరమైన మంత్రాలు నేర్పి, నన్ను ఈ అరణ్య రాజ్యానికి మహరాజును చేస్తానన్నాడు.









వాడింతకీ కావాలనే ఆ తాళపత్ర గ్రంథం రహస్యం ఏమిటి?" అని ప్రశ్నించాడు, గండుపోతు.

"అది నువ్వడగవలసిన ప్రశ్న కాదు, గండుపోతూ. ఒక విధంగా నాకూ ఆ తాళ పత్రాల్లో వున్న రహస్య విషయా లేమిటో పూర్తిగా తెలియవు. అదలా వుంచుదాం. ఈ శిథిలాలయ పూజారి, ఈ ప్రాంతాల నుంచి స్వేచ్ఛగా తిరిగి బ్రహ్మపుత్రానది లోయలకు పోవటం, ముందు ముందు కొన్ని చిక్కులకు దారితీస్తుంది. వాణ్ణిక్కడే పట్టుకుని హతమార్చాలి. ప్రస్తుతం వాడు దాగివున్న కొండగుహ ఎక్కడ?" అని అడిగాడు శివాలుడు.

గండుపోతు, శిఖిముఖి కేసి తలతిప్పి, "మీ శిఖికి యీ చుట్టుపక్కల వున్న అరణ్యం, కొండలూ క్షుణ్ణంగా తెలిసినవే కదా. శిఖీ! నందికొండ దిగువున వున్న తాటితోపు నీ వెరిగే వుంటావు. ఆ తోపుకు దక్షిణపు అంచున ఒక ఐయిదుతలల తాటిచెట్టున్నది. ఆ తాటిచెట్టెక్కి అన్నిటి కన్న ఎత్తుగావున్న తల మించి చూస్తే, ఆ పూజారిగాడు వుంటున్న గుహ సూటిగా కనబడుతుంది. ఆ గుహ పక్కన మరి కొన్ని గుహలున్నవి గనక, ఆ దుర్మార్గు డున్న గుహను గుర్తించటానికి యిదొక్కటే మార్గం," అన్నాడు.

"ఆ గుహ ముందు కావలి వాళ్ళెవరైనా వున్నారా?" అన్నాడు శిఖిముఖి.

"గుహ ముందు లేరు, తాటితోపులో మా వాళ్ళు యిద్దరు ముగ్గురున్నారు. నీకు సహాయం చేయమని వాళ్ళకు యిప్పుడే కబురు పంపుతాను," అన్నాడు గండుపోతు.

శివాలుడి అనుమతి పొంది, శిఖిముఖి, విక్రమకేసరి నలుగురు అనుచరులను వెంట బెట్టుకుని నందికొండ కేసి బయలు దేరారు. అవసరం రావచ్చునన్న నమ్మకంతో శిఖిముఖి విల్లంబులు వెంట పెట్టుకు







పోయాడు. వాళ్ళు నందికొండను చేరేసరికి సూర్యుడు బాగా పడమటికి వాలాడు. తాటి తోపులో వున్న గండుపోతు అనుచరులు తమ నాయకుడి నుంచి ముందే వార్త అంది వుండటంతో, శిఖిముఖిని, విక్రమకేసరినీ అయిదుతలల తాటి చెట్టున్న చోటుకు తీసుకుపోయి, "మీరు తాటి చెట్టెక్కి చూడండి. పూజారి గుహలోనే వున్నాడు. రెండు మూడు గంటల సేపు నుంచీ ఎందుకనో గుహంతా కలయ తిరుగుతున్నారు. గుహలో అంతగా వెలుగు లేక పోవటంతో, వాడేం చేస్తున్నదీ స్పష్టంగా తెలియటం లేదు," అని చెప్పారు.

శిఖిముఖి, విక్రమకేసరీ సంప్రతించుకున్నారు. విక్రమకేసరి కొందరు అనుచరులతో గుహ దగ్గిరకు పోయేట్టూ, ఒకవేళ పూజారి వాళ్ళు రావటం చూసి పారిపోయేందుకు ప్రయత్నిస్తే, శిఖిముఖి చెట్టు మీది నుంచి బాణం వదిలి వాణ్ణి చంపటమో, గాయపరచటమో చేసేట్టూ నిర్ణయించుకున్నారు.

పావుగంట తరవాత విక్రమకేసరి కొండ ఎక్కి గుహను సమీపించేంతలో, అప్పటి వరకూ గుహలో నీడలా అటూ యిటూ తిరుగుతున్న పూజారి ఆకారం, ఒక్కసారిగా ఎగిరి గంతేసినట్టు, చెట్టు మీదున్న శిఖిముఖికి తోచింది. పూజారి పారిపోయే ప్రయత్నం చేస్తున్నాడని భావించి, శిఖిముఖి గురి చూసి బాణం వదిలాడు. బాణం దెబ్బ తగలగానే, గుహలో వున్న ఆకారం బాధతో ఎలుగుబంటిలా ఒక్కసారి గాండ్రించింది.

ఆ గాండ్రింపు వింటూనే విక్రమకేసరీ, అతడి వెంట వున్నవాళ్ళూ, గుహ కేసి వేగంగా పరిగెత్తారు. "పూజారి ఎలుగ్గొడ్డుగా మారాడు!" అనుకుంటూ శిఖిముఖి చెట్టు మీంచి దిగి, గుహ కేసి పరుగుతీయ సాగాడు. —(ఇంకా వుంది)








## 8

[నవరగండుపోతు, శివాలుడికి శిథిలాలయ పూజారి దాగి వున్న కొండగుహ సంగతి తెలియజేశాడు. శిఖిముఖి, విక్రమకేసరి కొండ ప్రాంతాలకు వెళ్ళారు. శిఖిముఖి గుహలో కదులుతున్న ఆకారాని కేసి గురి చూసి బాణం వదిలాడు. బాణందెబ్బ తింటూనే గుహలోని ఆకారం ఎలుగుబంటులా పెద్దగా గాండ్రించి బయిటికిదూకింది. తరవాత—]

శిఖిముఖి చెట్టు మీది నుంచి దిగి గుహను చేరేసరికి, విక్రమకేసరి అతడి వెంట వున్న వాళ్ళూ, పెద్దగా కేకలు పెడుతూ ఎలుగు బంటును వెంటపడి తరుముతున్నారు. బాణం దెబ్బ తింటూనే ఎలుగుబంటు గుహ నుంచి బయటికి వచ్చి, కొండ దిగి పారిపోయేందుకు ప్రయత్నించింది.

"కేసరీ! ఆ ఎలుగ్గొడ్డును పట్టుకునేందుకు ఎందు కింత శ్రమపడుతున్నావ్? ముందు గుహలో ఆ పూజారిగాడున్నాడేమో చూడటం అవసరం," అన్నాడు శిఖిముఖి, విక్రమకేసరిని సమీపిస్తూ.

ఆ మాటలు వింటూనే గండుపోతు అనుచరులైన నవరలు, "ఇంకెక్కడి పూజారి! మనను మోసగించేందుకు వాడే యిలా ఎలుగుబంటుగా మారిపోయాడు. వాణ్ణి యీ ఆకారంలోనే పట్టుకుని విలువునా కాల్చి భస్మం చేసేద్దాం," అన్నారు.









శిథిలాలయ పూజారి కున్నవని చెప్పబడే అపూర్వశక్తుల్లో శిఖిముఖికి రవంత నమ్మకం వున్నది. తాటిచెట్టు పై నుంచి దిగి వచ్చేప్పుడు అతడూ, గుహలో వున్నది ఎలుగ్గొడ్డుగా మారిపోయిన పూజారి అయి వుండొచ్చుననుకున్నాడు. అలాంటప్పుడు, యీ అమాయకులైన సవరలు ఎలుగుబంటును పూజారి అని భ్రమ పడటంలో ఆశ్చర్యపడవలసిం దేమీ లేదు.

శిఖిముఖి యిలా ఆలోచించి, ఎర్ర గండును ఎలుగుబంటు మీదికి ఉసికొలుపుతూ, "శవరీ, మీరు ఎలుగును పట్టుకొండి గండుపోతు ముఠావాళ్ళు అన్నట్టు అది పూజారి అయినా కావచ్చు. అయినా కాకపోయినా వాళ్ళకు మనం కోపం తెప్పించటం ఎందుకు? నేను యీ లోపల గుహలోకి పోయి, ఆ దుర్మార్గుడు చీకట్లో ఎక్కడైనా నక్కి వున్నాడేమో చూస్తాను," అని చెప్పి గుహలోకి వెళ్ళాడు.

గుహలో జాగ్రత్తగా పరీక్షించిన మీదట శిఖిముఖికి, శిథిలాలయ పూజారి అందులో కొన్నాళ్ళపాటు వున్న గుర్తులు కనిపించినై. గుహలో ఒక మూలగా పులిచర్మం ఒకటి పరిచి వున్నది. మరో మూల వంట చేసుకునేందుకు పొయ్యీ, కొన్ని పాత్రలూ కనిపించినై. పొయ్యి పక్కనే చమురుతో బాగా తడిపి వున్న రెండు దివిటీలు రాళ్ళకు ఆనించబడి వున్నవి.

పూజారి గుహ నుంచి పారిపోయేందుకు మరే రహస్య ద్వారం వున్న సూచనలూ శిఖిముఖికి కనిపించలేదు. అతడు యిప్పటికి చాలా గంటల క్రితమే గుహ వదిలి పోయాడు. ఎలుగ్గొడ్డును మహా తెలివిగా యిందుకు ఉపయోగించుకున్నాడు.

శిథిలాలయ పూజారి జిత్తులమారి తనానికి శిఖిముఖి ఆశ్చర్య పడుతూండగా గుహ బయటి నుంచి విక్రమకేసరి పిలుపు వినిపించింది. శిఖిముఖి వెంటనే బయటికి











...చ్చారు. ఎలుగ్గొడ్డును ఎత్తయిన రాళ్ళ మధ్యకు తరిమి సవరలు దాని మెడకు తాడు తగిలించేందుకు ప్రయత్నిస్తున్నారు. ఎ:రగంటు రాళ్ళ మధ్య వున్న ఒకే ఒక యిరుకు దారి నుంచి అది బయిటికి పారి పోకుండా, అక్కడ నిలబడి పెద్దగా మొరుగుతున్నది.

విక్రమకేసరి, శిలిముఖి దగ్గిర కొచ్చి చిన్న గొంతుతో, "శిలీ! యీ వల్లమొద్దు శిధిలాలయ పూజారి కాదని నాకూ తెలుసు. కాని, సవరల మూఢ విశ్వాసాన్ని ధృవీకరిస్తే కొన్ని అనవసర చిక్కులు ఎదురయ్యే ప్రమాదం వున్నది. వీళ్ళు తమ నాయకుడైన గండుపోతుతో, ఎలుగుబంటుగా మారిన పూజారిని చేజేతులా జారవిడిచామని చెప్పి తీరుతారు. అతడికి పూజారి మంత్రశక్తుల్లో పూర్తి విశ్వాసం వున్నట్టు కనబడుతుంది," అన్నాడు.

"ఆ దుర్మార్గుడి వల్ల చిక్కుల్లో పడిం తరవాత గండుపోతుకు అతడి మీద నమ్మకం పోయి, ద్వేషభావం కలిగిందని నే ననుకుంటున్నాను. ఏమైనా, కొండ కింద వుండి పూజారి గుహను కాపలా కాస్తున్న వాళ్ళకు, వాడు బయటికి పోయిన సంగతి గాని, యీ ఎలుగుబంటు లోపల వున్న విషయం గాని తెలియదు. అందువల్ల మనం దీన్ని పట్టుకుపోయి, మా అయ్యకూ, గండుపోతుకూ చూపటం మంచిది. ఆ తరవాత అరణ్యంలో పూజారిగాడి వేట ప్రారంభిద్దాం," అన్నాడు శిలిముఖి.

శిలిముఖి ఎలుగుబంటు వున్న చోటుకు పోయి, రాళ్ళ మీది నుంచి దాని కేసి చూశాడు. అది పెద్దగా గాండ్రిస్తూ పారిపోయేందుకు ప్రయత్నిస్తున్నది.

శిలిముఖి చుట్టూ కలియచూసి, అల్లంత దూరంలో వున్న పొదల మీది అడవితీగల్ని కోసుకువచ్చి, వాటిని తాడుగా పేని, ఉచ్చువేసి దానిని ఎలుగుబంటి మెడ









మీదికి గురిగా విసిరాడు. అది ఎలుగుబంటి మెడకు తగులుకోగానే ఉచ్చు గొంతుకు బిగిసేలా బలంగా లాగాడు.

ఎలుగుబంటు గోండ్రిస్తూ చేతులతో తాడును తెంచేందుకు ప్రయత్నించింది. శిలిముఖి హెచ్చరించగానే, విక్రమకేసరితో పాటు, ఇద్దరు ముగ్గురు సవరులు ఆతడి చేతిలో వున్న తాడును బలంగా పైకి గుంజారు. ఎలుగుబంటు ఒకటి రెండడుగులు నేల మీది నుంచి పైకి లేచింది. శిలిముఖి అదే అదనుగా దాని మూతికి ఒక అడవితీగను గట్టిగా రెండు చుట్లు చుట్టి ముడివేసేశాడు.



శిలిముఖి, విక్రమకేసరి కలిసి ఎలుగుబంటును రాళ్ళ మధ్య నుంచి బయటికి లాగి, దాని మెడకు బిగిసివున్న తాడును సవరలకు యిచ్చి, "ఇక తిమ్మగూడేనికి పదండి. ఇది అడవిగొడ్డో, లేక శిథిలాలయ పూజారో మీ నాయకుడు సవరగండే తేలుస్తాడు," అనిచెప్పారు.

వాళ్ళు ఎలుగుబంటుతో గూడేన్ని చేరే సరికి, అక్కడ స్త్రీలూ, పిల్లలూ గుంపులుగా పోగై, "పూజారి ఎలుగు! పూజారి ఎలుగు!" అని కేకలు పెడుతూ, వాళ్ళతో పాటు శివాలుడూ, సవర గండుపోతూ వున్న గ్రామచావడికి వచ్చారు.

శివాలుడు యీ గందరగోళం ఏమిటా అని చావడిలోంచి బయటికి వచ్చి, తన కొడుకునూ, ఎలుగుబంటునూ చూస్తూనే, "ఏమిటిది? ఆ దుర్మార్గుడు పూజారి గుహలో లేడా?" అని ప్రశ్నించాడు.

"పూజారి గుహలో నుంచి ఎప్పుడో పారిపోయాడు. ఆ సంగతి కాపలావాళ్ళకు తెలియకుండా వుండేందుకు ఈ ఎలుగుబంటును గుహలో కట్టివేశాడు," అని శిలిముఖి అక్కడ జరిగినదంతా తండ్రికి చెప్పి, "గండుపోతు కులంవాళ్ళకు యీ ఎలుగే శిథిలాలయ పూజారి అన్న నమ్మకం







వున్నది. అందుకనే దీన్ని యిక్కడికి పట్టు కొచ్చాం. గండుపోతు కూడా దీన్నోసారి చూడటం బావుంటుంది. అతడు చెప్పితే తప్ప, అతడి మనుషులకు నమ్మకం కల గదు," అన్నారు.

ఈ లోపల గండుపోతును అతడి అను చరు లిద్దరు భుజాలు పట్టుకుని దావిడి బయటకు తీసుకు వచ్చారు. అతడు తన అనుచరులు చెప్పినదంతా విని, ఎలుగు బంటు కేసి గుచ్చి గుచ్చి చూస్తూ, "ఆ పూజారి కుక్క ఎంతకైనా సమర్థుడే! ఎందుకైనా మంచిది, యీ మెకాన్ని యింటికి తీసుకుపోయి, నా కూతురు నాగు మల్లికి ఒప్పచెపుతాను. మల్లి ఈటె, కత్తి తీసుకున్నదంటే, యిది నిజం చెప్పితీరు తుంది!" అని తన అనుచరుల కేసి తిరిగి, "మన జాగ్రత్తలో మనం వుండాలి. ఒక వేళ ఆ పూజారికుక్క అరణ్యంలోనే తిరుగుతూండొచ్చు. మన గూడేలన్నిటికి కబురందించి, ఆ దుష్టుణ్ణి పట్టుకునే ప్రయత్నం చెయ్యండి," అన్నాడు.

గండుపోతు అనుచరులు ఎలుగు బంటును వెంట తీసుకుని అక్కణ్ణించి వెళ్ళిపోగానే శివాలుడు స్నేహపూర్వకంగా నవరగండుపోతు భుజం తట్టి, "గండు పోతూ! ఇక మేం మా పల్లెకు వెళతాం.







పూజారి మనకూ మనకూ అనవసర విరోధం తెచ్చిపెట్టాడు. అదంతా మరిచిపోదాం. నీ గాయాలు మాని త్వరలో ఆరోగ్యం కలుగుతుందని నమ్ముతున్నాను. నా కొడుకు తొందరపాటుకు విచారిస్తున్నాను," అన్నాడు.

ఆ మాటలకు గండుపోతు బిగ్గరగా నవ్వి, "తొందరపాటా! ఆ వయసుకు ఆ మాత్రం తొందరపాటు లేకపోతే, పెరిగి పెద్దయిం తరవాత ఎందుకు పనికొచ్చేట్టు? నేనూ వయసులో వుండగా కాబొయ్యే మామ మీద యిలాంటి కాస్త మోటు సరసమే ఆడాను. నా కూతురు నాగమల్లితో పోలిస్తే, నీ కొడుకు శిఖిముఖి ఎంతో మేధావిగా కనిపిస్తాడు. మీరంతా మా గూడేనికి వచ్చి రాత్రికి నే నిచ్చే విందుభోజనం తినాలి. ఈ లోపల ఆ పూజారికుక్క ఎక్కడ వున్నదీ తెలిసినా తెలియొచ్చు," అన్నాడు.

ఈ ఆహ్వానం అంగీకరించటమా, మానటమా అన్నట్టు శివాలుడు, తన కొడుకు కేసీ, విక్రమకేసరి కేసీ చూశాడు. వాళ్లిద్దరూ ఏ భావం కనబరచలేదు. కాని, ఆ ఇద్దరి కళ్ళూ గండుపోతు మీదే వున్నవి. అతడు మరేదైనా కుతంత్రం పన్నుతున్నాడేమో అన్న అనుమానం వాళ్ళను పీడిస్తున్నది.

శివాలుడి ఆలోచన గ్రహించిన వాడిలా నవరగండుపోతు తలాడిస్తూ, "ఒక కుల పెద్ద విందుకు ఆహ్వానిస్తే, మరొక కుల పెద్ద రాననటం నే నింతవరకూ చూడలేదు, వినలేదు," అన్నాడు.

"సరే, గండుపోతూ అలాగే వస్తాం. కాని, యిక్కడ వున్న మా పల్లెవాళ్ళందరూ మాత్రం మీ గూడేనికి వచ్చే అవకాశం లేదు. నేనూ, శిఖిముఖి, విక్రమకేసరి, మరి నలుగురైదుగురు మా వాళ్ళూ మీ గూడేనికి వస్తాం. మిగిలిన వాళ్ళంతా చీకటి పడేలోపల మా పల్లెకు పోవటం అవసరం. ఆ శిధిలాలయ పూజారి పల్లె మీద మరెలాంటి



ఘోరానికి పూనుకుంటాడో ఊహించలేం
గదా," అన్నారు.

"అది నిజమే. ఆ కాట్లకుక్కను పట్టుకుని చిత్రవధ చేసేవరకూ నాకు మనశ్శాంతి వుండదు. ఊఁ, బయలుదేరదామా?" అన్నాడు గండుపోతు.

శివాలుడు తన అనుచరుల్లో నలుగురైదుగురిని మాత్రం తన వెంట వుంచుకుని తతిమ్మా వాళ్ళను కుంభారమిట్ట పల్లెకు పోయి, రాత్రల్లా తగు జాగ్రత్తలో వుండమని హెచ్చరించాడు. ఆ తరవాత గండుపోతు అనుచరులు తమ నాయకుడికి డోలీ ఒకటి తయారు చేసి, అందులో అతణ్ణి కూర్చోపెట్టి, దాన్ని అటిద్దరూ యిటిద్దరూ భుజాలకు ఎత్తుకుని తమ గూడెం కేసి బయలుదేరారు. శివాలుడూ, శిఖిముఖీ, విక్రమకేసరీ దాన్ని అనుసరించి ప్రయాణమయ్యారు.

దాదాపు ఓ గంట ప్రయాణం తరవాత అందరూ నవరపల్లెకు చేరేసరికి, పల్లె మధ్యలో వున్న గండుపోతు ఇంటి ముందు పల్లెవాసులంతా గుమిగూడి నవ్వుతూ, కేరింతలు కొడుతూ గంతులు వేయటం వాళ్ళక్కనిపించింది. శివాలుడు పల్లెవాసుల ఉత్సాహం చూసి, శిథిలాలయ పూజారిని



వాళ్ళు పట్టుకొచ్చారేమో అనుకున్నాడు. కాని, తీరా దగ్గిరకు పోయి చూస్తే, గండుపోతు కూతురు నాగమల్లి గుహ దగ్గిర దొరికిన ఎలుగుబంటు చేత రకరకాల ఆటలు ఆడిస్తున్నది.

"ఇప్పటికిప్పుడు పట్టుకున్న ఆ క్రూర మృగాన్ని యింతలోనే నీ కూతురు ఎలా మచ్చిక చేయగలిగింది, గండుపోతూ?" అంటూ శివాలుడు ఆశ్చర్యపోయాడు.

"సాహసమే నవరమహాలక్ష్మి, అన్నారు పెద్దలు. నా కూతురు సాహసంలో, ధైర్యంలో నాకు సమానురాలు, మీ శిఖిముఖి దానికి ఈడీ అవునా కాదా అన్న సంశయం నన్ను

బాధిస్తూనే వున్నది. ఇలా అన్నానని ఏమీ అనుకోకు, శివాలూ!" అన్నాడు గండు పోతు, కూతురు కేసి ఆప్యాయంగా చూస్తూ.

నాగుమల్లి, తండ్రిని చూస్తూనే ఎలుగు బంటు మెడకు కట్టి వున్న తాడును వదిలి, "అయ్యా, నడవలేనంతగా గాయపడ్డావా? ఏదో చిన్న దెబ్బ తగిలిందని చెప్పారే, మన వాళ్ళు," అంటూ తండ్రిని కావిలించుకుని కన్నీళ్ళు పెట్టుకున్నది.

"తగిలిన గాయం చిన్నదేనమ్మా, కాని ఎడం కాలి కీలేదో కాస్త..." అని గండు పోతు నవ్వుతూ శిఖిముఖి కేసి చేయి చూపి, "అంత నవరగండుపోతును డోలీ ఎక్కించిందెవరో తెలుసా? ఆ కోడెకాపు శిఖిముఖి. అలా కనబడుతున్నాడు గాని—ఎంత తెగువ! ఎంత గుండె బలం!" అన్నాడు.

నాగుమల్లి చప్పున తల తిప్పి, శిఖిముఖి కేసి చూసింది. క్షణంలో ఆమె కన్నీళ్ళు మాయమయినై. కోపంతో ఆమె కళ్లు ఎర్రబడినై, ముక్కుపుటాలు అదిరినై. ఏదో అనబోయిన దల్లా ఆగి చప్పున తల పక్కకు తిప్పుకున్నది.

ఇదంతా గమనిస్తున్న విక్రమకేసరి, శిఖిముఖితో రహస్యంగా, "శిఖీ! మనకు విందు చేయటంలో గండుపోతు ఎత్తుగడ ఏమిటా అనే యింతవరకూ మనం ఆలోచిస్తున్నాం. అతడు మహ చేయగలిగితే ఆహారంలో విషం కలిపించగలడు. కాని—కూతురు నాగుమల్లి నీ మీద పగ పట్టినట్టున్నది, జాగ్రత్త!" అన్నాడు.

శిఖిముఖి ఏదో అనబోయేంతలో ఎలుగు బంటు గాండ్రిస్తూ, అక్కడ చేరిన గుంపు మీద పడి, పంజాలతో అందిన వాణ్ణి అందినట్టు కొట్టి రక్కసాగింది. గుంపులో హాహాకారాలు బయలుదేరినై. నాగుమల్లి, శిఖిముఖి "తప్పుకోండి, తప్పుకోండి," అని పెద్దగా కేకలు పెడుతూ ఎలుగ్గొడ్డు కేసి పరిగెత్తారు. —(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 9

[కొండగుహలో శిఖిముఖి, విక్రమకేసరులకు శిథిలాలయ పూజారి కనిపించలేదు. అక్కడ దొరికిన ఎలుగుబంటును వాళ్ళు సవరగండుపాటు మూకవాళ్ళకు ఒప్ప చెప్పారు. నాగుమల్లి దాన్ని కొంతసేపు ఆడించి, యువతలికి రాగానే, అది చుట్టూ చేరిన గుంపు మీద విరుచుకు పడింది. దాన్ని పట్టుకునేందుకు శిఖిముఖి, నాగుమల్లి పరిగెత్తారు. తరవాత—]

ఎలుగుబంటు చేత గాయపడిన వాళ్ళల్లో ఎక్కువమంది సవర స్త్రీలూ, పిల్లలూ. మగవాళ్ళు దాన్ని చంపేందుకు యీటెలూ, కర్రలూ అందుకునేలోపలే ఎలుగుబంటు చేయవలసిన ఘోరం అంతా చేసి, పారి పోయే ప్రయత్నంలో వున్నది. ఆ దశలో దాన్ని పట్టుకునేందుకు నాగుమల్లీ, శిఖి ముఖీ ముందుకురికారు. వాళ్ళు ఎలుగు కేసి పరిగెత్తటం చూసిన సవరలు ఈటెల్ని దానికేసి విసరకుండా ఆగారు. అవి గురి తప్పి తమ నాయకుడి కూతుర్నిగాని, శిఖి ముఖిగ్గాని తగలవచ్చని వాళ్ళు భయపడ్డారు.

ఎలుగుబంటు ఒకసారి రెండు కాళ్ళ మీదా నిలబడి తనను సమీపిస్తున్న నాగు మల్లి మీదికి దూకబోయింది. నాగుమల్లి ఏమీ చలించక పిడికిళ్ళు బిగించి వున్న చోటునే నిలబడింది. అసరికి ఎలుగును సమీపించిన శిఖిముఖి కాలితో బలంగా







దాని నడుం మీద ఓ తన్ను తన్నారు. ఎలుగుబంటు గాండ్రిస్తూ కిందపడి చప్పున లేచి అరణ్యం కేసి పరిగెత్తసాగింది.

పీడ విరగడయిందన్నట్టు చూసి, శిఖిముఖి వెనుదిరగబోయారు. కాని అంతలో అతడి దృష్టి మెరుపులా ఎలుగుబంటు కేసి పరిగెత్తుతున్న నాగుమల్లి మీద పడింది. యిప్పుడామె చేతిలో ఒక యీటె వున్నది. వెనక నుంచి తండ్రి గండుపోతూ మరి కొందరూ ఆగమని కేకలు పెడుతున్నా ఆమె లక్ష్యపెట్టకుండా ముందుకు పరిగెత్తసాగింది.

నాగుమల్లి సాహసం చూసి శిఖిముఖి మనసులోనే మెచ్చుకున్నారు. కాని, ఆమె చేస్తున్నది దుస్సాహసమని, ప్రమాదం తెచ్చిపెట్టేదని అతడికి తోచింది. ఆ వెంటనే అతడు, "మల్లి!" అంటూ కేకపెట్టి ఆమె కేసి పరిగెత్తారు. ముందు ఎలుగుబంటూ, దానికి కొంచెం వెనకగా నాగుమల్లీ, ఆమెకు కాస్త దూరంలో శిఖిముఖీ పరిగెత్తుతూ, చూస్తూండగానే అరణ్యవృక్షాల వెనక మాయమయారు.

"ఆ ఎలుగుబంటు రూపంలో వున్నవాడు పూజారే! సందేహంలేదు. ఆ పూజారి దుష్ట మంత్ర తంత్ర విద్యల్లో సాటిలేనివాడు. శివాలయా! వాడు నా కూతుర్నీ, నీ కొడుకునూ చంపటానికో లేక ఎత్తుకుపోవటానికో, యీ మాయారూపంలో వచ్చాడు. ఇద్దర్నీ సమ్మోహపరిచి వెంట తీసుకుపోయాడు. ఇప్పుడేంచేయటం?" అంటూ గండుపోతు అరవసాగాడు.

శివాలుడికి, పూజారి శక్తిసామర్థ్యాల్లో గండుపోతుకున్నంత గుడ్డినమ్మకం లేదు. ఎలుగుబంటును తరుముకుంటూ తన కొడుకూ, గండుపోతు కూతురూ పరిగెత్తటంలో అతడికి పూజారి సమ్మోహన విద్య ఏమీ వున్నట్టు అనుమానం కలగలేదు. కాని, వాళ్ళిద్దరూ ఒకసారి కీకారణ్యంలో జొరపడిం తరవాత, ఆ దుర్మార్గుణ్ణించి





ఎలాంటి ప్రమాదమైనా సంభవించవచ్చుని అతడికి కొంచెంగా భయం కలిగింది.

శివాలుడు ఏమి చేయటమా అని ఆలో చించేంతలో విక్రమకేసరి ముగ్గురు శబరుల్తో అతణ్ణి సమీపించి, "శివాలా! నేను శబి ముఖికి సాయం వెళతాను. అతడికి ఎలుగు బంటు నుంచి ప్రమాదం వస్తుందని కాదు, నా భయం. ఆ శిధిలాలయ పూజారి యీ చుట్టుపక్కల అరణ్యంలో ఎక్కడో మాటేసి వుంటాడని నానమ్మకం," అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నాను, కేసరీ! వాణ్ణి, నాగుమల్లిని కనపడిన వాళ్ళను కనపడినట్టు యిక్కడికి లాక్కురండి," అన్నాడు శివాలుడు.

"నేను వద్దని కేకలు పెడుతున్నా పరి గెత్తింది, నాగు. నేను వెంటనే తిరిగి రమ్మన్నానని చెప్పండి," అని గండుపోతు విక్రమకేసరితో చెప్పి, అతడు బయలుదేరి పోబోతూండగా భుజంపట్టుకు ఆపి, "ఆ ఎలుగ్గొడ్డుందే—అది పూజారి అనే నా అను మానం. దాన్ని దొరికితే ప్రాణాలతో యిక్క డికి పట్టుకురాకండి, చంపి చర్మం వలు చుకువస్తే సరిపోతుంది. ఆ చర్మాన్ని ఎండ గట్టి నా ఇంటి గడప దగ్గిర కాళ్ళుతుడుచు కునేందుకు ఉపయోగిస్తాను," అన్నాడు.



విక్రమకేసరి అతడి మాటలకు సరే అని తలూపి, అనుచరులతో అరణ్యం కేసి పరుగు తీశాడు. వాళ్ళు అరణ్యం చేరగానే, "శబిముఖీ! శబిముఖీ!" అంటూ కేకలు ప్రారంభించారు. కాని, జవాబు రాలేదు. వాళ్ళల్లో కొందరు అడుగు జాడల కోసం నేలమీద వెతకటం ప్రారంభించారు. ఆ ప్రాంతాల అడవిజంతువులూ, మనుషులూ నడిచిన కాలి గుర్తులు అనేకం కంటబడినై. నాగుమల్లి, శబిముఖుల కాలిగుర్తులు వాటిల్లో ఏవో తెలుసుకోవటం ఎలా?

"ఎలుగుబంటు వాళ్ళిద్దర్నీ అరణ్యంలో చాలా లోపలికి తీసుకుపోయినట్టుంది.









బంటును కొండగుహ దగ్గిర పట్టుకుని ఏవర పల్లెకు చేర్చింది తను....

శిఖిముఖి యిలా ఆలోచిస్తూ ఎలుగుబంటూ, నాగుమల్లిల వెనక కొండలోయలో వున్న అరణ్యంలోకి చాలాదూరం పరిగెత్తారు. చివరకు ఎలుగుబంటు బాగా అలిసిపోయినట్టుంది. అది ఒక ఏకుమాను పక్కన నిలబడి కోరలు చాస్తూ, చిన్నగా గాండ్రించసాగింది. నాగుమల్లి దాన్ని సమీపించి చేతిలోని యీటెతో దాని గుండెల మీద పొడవబోయింది. కాని, ఎలుగు ఆ దెబ్బ తప్పుకుని మాను వెనకకుపోయి గాండ్రిస్తూ నిలబడింది.

ఆ సమయంలో శిఖిముఖి, నాగుమల్లిని సమీపించాడు. నాగుమల్లి అతడి రాకను చూసి, చూడనట్టు తల పక్కకు తిప్పుకుని ఎలుగుబంటి మీద యీసారి యీటెతో కలియబడేందుకు, దానికేసి ఒక్కొక అడుగే వేయసాగింది.

"మల్లీ, దానికి మరీ దాపులకు వెళ్ళకు. పారిపోయే ఆశలేనప్పుడు క్రూరమృగం ఎంత సాహసం చేయగలదో, నీకు తెలీదా?" అన్నాడు, శిఖిముఖి.

"ఆహా, తెలీదు! శబరకుర్రాడొచ్చి చెపితే తప్ప, ఏది ఎలుగుబంటో, ఏది ఎలక

మనం రెండు ముఖాలుగా చీలి వెతకటం వల్ల ప్రయోజనం వుండొచ్చు," అన్నారు కేసరి. ఆ వెంటనే ఇద్దరిద్దరు ఒక జట్టుగా బయలుదేరి అరణ్యంలో కేకలు పెడుతూ శిఖిముఖి, నాగుమల్లి కోసం వెతకసాగారు. కాని, నాగుమల్లి, శిఖిముఖులు ఆ ప్రాంతం ఎక్కడా లేరు. తన కులంవాళ్ళను గాయపరిచింది గనక, ఎలుగును చీల్చి చెండాడాలన్న కోపంతో నాగుమల్లి దాన్ని వెంటబడి తరమసాగింది. తమ కాతిథ్యం యిస్తున్న గండుపోతు కూతురు ప్రమాదంలో చిక్కుకుంటుందేమో అని శిఖిముఖి ఆమెను వెన్నంటి పరిగెత్తసాగారు. పైగా, ఆ ఎలుగు







ఏళ్లో కూడా నాకు తెలీదు," అని వెటకారంగా అంటూ నాగమల్లి తల తిప్పి శిఖిముఖి కేసి చూడబోయేంతలో, అదే అవకాశంగా తీసుకుని ఎలుగుబంటు ఆమె మీదికి దూకింది. కాని, అది మీదికి దూకబోయేముందు పెట్టిన గుర్రుధ్వని వింటూనే నాగమల్లి ఈటెను రెండు చేతులతో దాని గుండెల కేసి బలంగా పూపింది. ఈటె ఎలుగు గుండెల్లో గట్టిగా పాదుకున్నది. కాని, అది ఎగిరి మీదబడ్డ వేగానికి నాగమల్లి కాలు నిలదొక్కుకోలేక వెనక్కు పడిపోయింది. ఎలుగుబంటు ఆమె తలను గావు పట్టు పట్టేందుకు పెద్దగా నోరు తెరిచింది.

శిఖిముఖి నడుం నుంచి వేలాడుతున్న చురకత్తిని చర్రున లాగి, మెరుపులా ఎలుగుబంటి మీదికి దూకి, ఎడంచేత్తో దాని కంఠాన్ని వెనక్కు లాగుతూ, కుడి చేతిలో వున్న చురకత్తిని బలంగా దాని మెడమీద గుచ్చి నరాలు తెగేట్టుగా మెలి తిప్పాడు. ఎలుగుబంటు నాగమల్లిని వదిలి పెద్దగా గాండ్రిస్తూ, శిఖిముఖి మీద విరుచుకు పడింది. శిఖిముఖి ఒక చేత్తో ఎలుగుబంటి మెడను గట్టిగా పట్టుకుని, దాని వాడి కోరలకు తన తల దొరక్కుండా చూసుకుంటూ, చురకత్తితో దాని శరీరం మీద అందిన చోటనల్లా బలంగా పొడవసాగాడు.





ఈలోపల నాగుమల్లి లేచి నిలబడింది. ఆమెకు శిఖిముఖి మీద తన తండ్రిని కొట్టి గాయపరిచాడన్న పగా, కోపం వున్నా, యీ సమయంలో అతడు తనను రక్షించేందుకు ప్రయత్నించి ఎలుగు వల్ల ప్రమాదం తెచ్చుకున్నాడన్న గ్రహింపు కలిగింది. వెంటనే ఆమె ఎలుగుబంటు శరీరంలో దిగి వున్న తన యీటెను ఒక్క గుంజు గుంజి బయటికిలాగి, దానితో ఎలుగు డొక్కలో యిటు నుంచి అటు దూసుకుపోయేట్టుగా ఒక్క పోటు పొడిచింది. ఎలుగుబంటు ఒకసారి పెద్దగా గాండ్రించి, వెల్లికిలా పడి గిలగిల తన్నుకోసాగింది.



శిఖిముఖి లేచి నిలబడ్డాడు. అతడి శరీరం మీద అక్కడక్కడా ఎలుగుబంటి వాడి గోళ్ళవల్ల చిన్నచిన్న గాయాలై కొద్దిగా నెత్తురు కారుతున్నది. అతడి కుడి చేతిలోని చురకత్తి రక్తం ఓడుతున్నది.

నాగుమల్లి అతణ్ణి నఖశిఖ పర్యంతం ఓసారి పరీక్షగా చూసి చిరునవ్వు నవ్వబోయి అంతలోనే ముఖం మీద చిరుకోపం కనబరుస్తూ, "అంత చిన్న కత్తితో ఎవరైనా ఎలుగుబంటు మీద కలియబడతారా? మీ శబరకులం వాళ్ళల్లో ధైర్యసాహసాలున్నయ్యేమోగాని, యుక్తి నేర్పుల్లాంటివి కనబడవు. నీకేమైనా ప్రమాదం జరిగివున్నట్టయితే, అందుక్కారణం నేనని, మీ తండ్రి మామీద దొమ్మీ చేసివుండేవాడు," అన్నది.

"యుక్తులూ, కుయుక్తులూ మనుషుల మీద పారినంత తేలిగ్గా, క్రూరమృగాల మీద పారవు. నన్ను చంపబోతున్న ఎలుగును ఏ యుక్తి నేర్పూ వుపయోగించి నేను విడిపించగలిగేవాణ్ణి? ఆ క్షణంలో నా దగ్గిర యీ చిన్న కత్తి కూడా లేకపోతే, వట్టి చేతులతోనే దానిమీద కలియబడి వుండేవాణ్ణి," అన్నాడు శిఖిముఖి.

నాగుమల్లి ఆ మాటలకు కొంచెంగా ఆశ్చర్యపోయి, "నీ శత్రువు కూతురు







ప్రాణాలు కాపాడేందుకు అంత సాహసం చేసేవాడివా?" అని అడిగింది.

"గండుపోతు నాకు శత్రువు కాదు. ఏ పరిస్థితుల్లో మేం యిద్దరం యీటెలు తీసుకుని పోట్లాడుకోవలసి వచ్చిందో, ఆ సంగతి మీవాళ్ళకూ మావాళ్ళకూ కూడా బాగా తెలుసు. జరిగిపోయిందాన్ని గురించి యిప్పుడు వాదోపవాదాలెందుకు? ఈ గాయాలకు ముందు ఆకుపసరు పూయాలి. నీవు బాగా గాయపడ్డావు. వాటి నుంచి తీపూ సలపరం మొదలవక ముందే ఆకు రసం తెచ్చి పూసుకో. నెత్తురు కట్టించి గాయాన్ని మాన్పే ఓషధి పత్రాలేవో గుర్తించి తెచ్చుకోగలవా? లేక నేను కోసుకొచ్చిపెట్టనా?" అంటూ శిలిముఖి చుట్టూ ఓమారు కలయ చూసి, మహావృక్షాలకు దిగువున అల్లిబిల్లిగా పెరిగిన పొదల కేసి బయలుదేరాడు.

నాగుమల్లి అతణ్ణి ఆగమని హెచ్చరించి, "నేనూ అరణ్యంలో పుట్టి పెరిగినదాన్నే. మందుకు పనికొచ్చే ఆకులేవో నాకు తెలియనివి కావు. వాటిని నీకూ కూడా నేనే తెచ్చి యిస్తాను. మావాళ్ళు అన్నట్టు ఈ చచ్చిన ఎలుగుబంటు ఆ దొంగ పూజారేనేమో! లేచి పారిపోకుండా చూస్తూండు," అంటూ చిరునవ్వునవ్వి చెట్లల్లోకి పోయి, నాలుగైదు



నిమిషాల్లో యిన్ని ఆకులు గుప్పెళ్ళతో పట్టుకు వచ్చింది.

నాగుమల్లి తిరిగి వచ్చేసరికి, శిలిముఖి ఒక ఎండుమోడు మీద కూర్చుని ఆమెను గురించే దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. నాగుమల్లి కనబరిచిన ధైర్యసాహసాలేకాక, ఆమె అందచందాలు కూడా అతడి హృదయాన్ని బాగా ఆకర్షించినై.

"ఏమిటాలోచన? ఇదుగో ఆకురసం!" అంటూ నాగుమల్లి, శిలిముఖిని సమీపించింది. అతడు ఉలిక్కిపడి నిద్ర లేచినట్టు ఆమె కేసి చూసి, చేయి చాపాడు. కాని నాగుమల్లి ఆకుల్ని అతడి కివ్వక, "నీవు





మీదా, భుజాలమీదా కూడా ఎలుగు గోళ్ళతో బాగా రక్కింది. అక్కడ పసరు రాసుకోవటం నీవల్ల నేమవుతుంది? నేరాస్తాను," అంటూ శిఖిముఖి గాయాల మీద ఆకు నలిపి దాని పసరు పూయసాగింది.

శిఖిముఖి పసరు తగిలినప్పుడల్లా భగ్గుమని మండే గాయాల బాధ మరిచిపోయి, ఆమె ముఖం కేసి చూస్తూ వుండిపోయాడు. పసరు రాయటం పూర్తవగానే నాగుమల్లి అతణ్ణించి కొంచెం ఎడంగా పోయి తన శరీరం మీది గాయాలకు పసరు రాసుకోబోయింది. కాని, శిఖిముఖి చప్పున లేచి ఆమె దగ్గరకుపోయి, చేతిలో వున్న ఆకుల్ని లాక్కునేందుకు ఆమె గుప్పెళ్ళను బలంగా పట్టుకుని, "నాకు నువ్వు చెప్పిందే, నీకూ చెల్లుతుంది. ఇప్పుడు వంతు నాది," అంటూ ఆమె యిచ్చిన ఆకుల్ని మరి కాస్త రసం వచ్చేలా అరచేతుల్తో నలిపి, ఆమె శరీరం మీద దెబ్బలు తగిలినచోటనల్లా రాయసాగాడు. నాగుమల్లి లేని బాధను కనబరుస్తూ చిన్నగా మూలుగులు ప్రారంభించింది.

ఈ స్థితిలో లోయపైనున్న కొండభాగం మీది గుబురు చెట్లల్లోంచి, "నా బిడ్డల్లారా! అహ్హహ్హా!" అన్న వికృత కంఠ ధ్వని వినిపించింది. శిఖిముఖి, నాగుమల్లి తలలు ఎత్తి పైకి చూశారు.

"మిమ్మల్నిద్దర్నీ హిమాలయాలకు అటూ యిటూ నూరు యోజనాల వరకూ మహారాజూ, మహారాణిలను చేయబోతున్నాను. అడుగో, నా దూత మీ దగ్గిరకే వస్తున్నాడు. వాడిద్వారా నా సందేశం సర్వం తెలుసుకోండి," అంటూ ఆ వికృత కంఠం మరోసారి పలికింది. తలలు ఎత్తి నిశ్చేష్టులై చూస్తున్న శిఖిముఖి, నాగుమల్లుల కేసి చెట్ల కొమ్మల మీదుగా ఒక మానవాకారం, ఎగురుతున్న పక్షిలా చేతులు చాచి కిందికి దిగసాగింది. —(ఇంకా వుంది)








# 10

[ నవరజాతి వాళ్ళను గాయపరిచి ఎలుగుబంటు అరణ్యంలోకి పారిపోసాగింది. కాని శిఖిముఖి, నాగమల్లి దాన్ని కొంత పోరు జరిగాక, చంపారు. ఆ సమయంలో కొండ మీది నుంచి పూజారి కంఠం వినిపించింది. మరుక్షణంలో ఒక మానవాకారం ఎగురుతున్న పక్షిలా చేతులు చాచి చెట్లకొమ్మల మీదుగా కిందికి రాసాగింది. తరవాత—]

చెట్ల కొమ్మల్లోంచి తమ కేసి వస్తున్న వింత ఆకారాన్ని చూసి, శిఖిముఖి, నాగమల్లులు చాలా ఆశ్చర్యం పొందారు. ఆ ఆకారం చూడటానికి మామూలు మనిషిలాగే వుంది. కాని, పక్షిలా గాల్లో తేలియాడుతూ కిందకు దిగి రావటం వాళ్ళిద్దరికీ కొంత భయాన్ని కూడా కలిగించింది. అది, శిథిలాలయ పూజారి తన మంత్ర ప్రభావంతో కల్పించిన పక్షి మనిషేమో అనుకున్నారు, శిఖిముఖి. కాని, అంతలోనే అతడి అనుమానం పటాపంచలైంది. ఆ వింత మనిషి కాళ్లూ చేతులూ ఊపుతూ భూమికి పదీ పన్నెం డడుగుల ఎత్తులోకి వచ్చేసరికి, అతడి నడుముకు ఒక బలమైన మోకు కట్టివున్నట్టు శిఖిముఖి చూశాడు. అంటే, పూజారి కొండ మీద వుండి, యీ మనిషి నడుముకు తాడు కట్టి చెట్లల్లోంచి తమ ముందుకు జారుస్తున్నాడన్నమాట!







ఈ సంశయం కలగ్గానే శిలిముఖి పెద్దగా నవ్వి, నాగుమల్లితో, "చూశావా, ఆ శిథిలాలయ పూజారి మంత్రశక్తులు ఎంత మహత్తరమయినవో? మీ అయ్య అమాయకంగా అతడి దొంగమాటలు నమ్మి, మాతో విరోధం తెచ్చుకున్నాడు," అన్నాడు.

ఆ మాటలకు నాగుమల్లి కోపం తెచ్చుకుని, "మీ శబరవాళ్ళు తెలివిమంతులూ, మా నవరలు అమాయకులూ అనా నీవు అనేది? అందరూ మందబుద్ధులే! అసలు కావాలని మాతో విరోధం పెట్టుకున్నది, మీ జాతివాళ్ళు. మా అయ్య సంగతి..." అంటూ ఏమో చెప్పబోయేంతలో పక్షి మనిషి దభీమంటూ కింద పడ్డాడు. వాడి నడుముకు కట్టివున్న తాడు తెగిపోయింది.

విలువునా నేల మీద పడిపోయిన పక్షి మనిషిని శిలిముఖి, నాగుమల్లి పట్టుకుని కదిలించి చూశారు. కాని, వాడు శవంలా కొంచెం సేపు బిర్రబిగుసుకు పోయి, హఠాత్తుగా ప్రాణం వచ్చినవాడల్లే ఎగిరి గంతేసి నిలబడుతూ, "జై, పూజారి దేవా!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

"ఆ పూజారి, దేవుడు కాదురా, దయ్యం! అంతకీ నీ వెవడివి? ఆ దుర్మార్గుడి బంటువా? చెప్పు," అంటూ శిలిముఖి వాడి మెడ పట్టుకుని ఊపాడు.

"నేను గండభేరుండ పక్షి జాతివాణ్ణి. చుక్కలకంటా ఎగరగలను, ఈ భూప్రపంచాన్ని క్షణకాలంలో చుట్టి రాగలను," అంటూ వాడు గణాచారిలా ఊగిపోసాగాడు.

"ఏదేదో పూంచి తాగిన మైకంలో ఉన్నాడు. వీడి నుంచి మనం పూజారి సందేశం వినటం ఎలా సాధ్యం?" అంటూ శిలిముఖి వాణ్ణి భుజాలు పట్టుకుని ఒక్క తోపు తోశాడు. ఆ తోపుకు వాడు పోయి ఒక చెట్టు బోదెకు కరుచుకుని, మెల్లిగా కూనిరాగాలు తీయసాగాడు.







అప్పటివరకూ జరుగుతున్నదంతా పరీక్షగా చూస్తున్న నాగుమల్లి చప్పున పక్షి మనిషి దగ్గిరకు పోయి, ఈటె తిప్పి వాడి భుజాన పొడుస్తూ, "నీవు సవరజాతి వాడివి కాదా? నీది తిమ్మగూడెమే కదా? గండుపోతు తెలుసా?" అని ప్రశ్నించింది.

గండుపోతు అన్న పేరు వింటూనే వాడు అదిరిపడి, "సవరగండుపోతా? అతడికి చావు తప్పదు. పూజారి దేవుడికి కోపం తెప్పించాడు. చూస్తూండు, రెండుమూడు రోజుల్లో పూజారి దేవుడు పంపే గండభేరుండం అతణ్ణి కోడిపిల్ల కింద తన్నుకు పోయి, ఏ కొండశిఖరానో పెట్టుకుని పొడుచుకు తినేస్తుంది," అన్నాడు.

"ఈ తిక్క తిక్క మాటలు కట్టిపెట్టు. నీవు తిమ్మగూడెం వాడివి, నాకు తెలుసు. నేను సవరపెద్ద గండుపోతు కూతుర్ని, నాగుమల్లిని. నీ పేరేమిటి?" అంటూ నాగుమల్లి ఈటె కర్రతో వాడి వెన్నుమీద బలంగా కొట్టింది.

ఆ దెబ్బతో వాడికి తిక్క సగం దిగి పోయింది. వాడు చప్పున తలతిప్పి నాగు మల్లి కేసి చూస్తూ, "నాగుమల్లివా? చెప్ప వేం? నిన్ను పూజారి దేవుడు మహారాణివి చేస్తానంటున్నాడు—నా పేరా? పాతపేరు



ఏదో గుర్తు లేదు. పూజారి దేవుడు పిలిచే పేరు, సవర భేరుండం," అన్నాడు.

"నువ్వు సవర భేరుండానివి కాదు, చవట భేరుండానివి. ఆ దుర్మార్గు డేదో మందుమాకులు ప్రయోగించి నీ మతి చెడ కొట్టి నట్టుంది. లేకపోతే విప్పసారా అతిగా తాగి వుంటావు. అందుకే యింత సేపటి నుంచీ పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నావు. నీ కైపు దించి నిన్నిప్పుడే మామూలు మని షిగా చేస్తాను," అంటూ శశిముఖి, భేరుం డాన్ని నడుం పట్టుకు ఎత్తి భుజాన వేసు కుని, దాపులనున్న సెలయేటి దగ్గిరకు పరుగు పరుగున పోయి, విసిరి పడవేశాడు.









నీళ్ళల్లో పడుతూనే భేరుండం పెద్దగా ఓ చావుకేక పెట్టాడు. అతడికి తాను నీటి ప్రవాహన పడి కొట్టుకు పోయి ఏ రాతికో తల తగిలి చస్తానన్న భయం కలిగింది. శిఖిముఖి అతణ్ణి నీటివాలు వెంట కొట్టుకు పోకుండా పట్టుకుని, తలను నీటిలో ముంచుతూ, "ఈ దెబ్బతో నీ మత్తు వదులుతుంది, తిరిగి మనిషివవుతావు," అన్నాడు పళ్ళు కొరుకుతూ.

శిఖిముఖి వాణ్ణి ఆ విధంగా నాలుగైదు సార్లు నీటిలో ముంచి ఎత్తేసరికి భేరుండం ప్రాణభయంతో తల్లడిల్లి పోతూ, "చంపకు నన్ను, మహారాజా! పూజారి దేవుడు పంపిన సందేశం వినండి, ఆ పటం చూడండి. మహారాణి ఎక్కడ? కాపాడు, రక్షించు, మహారాణీ!" అంటూ అరిచాడు.

సెలయేటి ఒడ్డున నిలబడి యీ గొడవంతా చూస్తున్న నాగుమల్లి, భేరుండం మాటలకు విరగబడి నవ్వుతూ, "శిఖీ! వాణ్ణి చంపకు. నీ వైద్యంతో వాడికి ఉన్న కాస్త మతి కూడా పోయినట్టుంది. ఒడ్డున పడెయ్యి," అన్నది.

శిఖిముఖి ఆ మాటలతో కాస్త శాంతించి, గండభేరుండాన్ని నీటిలో నుంచి పైకెత్తి ఒడ్డుకు గిరవాటు వేశాడు. వాడు పడ్డ చోటునే అయాసపడుతూ లేచి కూర్చుని, "నన్ను దయ తలచండి. ఆకాశంలో ఎంతో దూరం నుంచి ఎగిరి వచ్చిన ఆయాసం, శ్రమా వల్ల ఏదేదో మాట్లాడాను," అన్నాడు వగర్చుతూ.

"ఏదో పటం అన్నావే, ఏమిటది?" అని ప్రశ్నించాడు శిఖిముఖి.

"ఆ మరిచాను, మహారాజా!" అంటూ గండభేరుండం దుస్తుల్లో నుంచి గుండ్రగా చుట్టివున్న చర్మాన్నొకదాన్ని బయిటికి తీసి, "ఇది మంచు జింక చర్మం. విప్పి చూడండి. మీరు పాలించబోయే రాజ్యపు సరిహద్దులూ, ఆ రాజ్యంలోని కొండలూ,





నదులూ, అరణ్యాలూ అన్నీ వుంటవి. మీరు వెంటనే బయలుదేరాలి. పూజారి దేవుడున్న చోటుకు తీసుకు పోతాను. తర వాత ఆయన మనందర్నీ ఆకాశమార్గాన బ్రహ్మపుత్రా నదిలోయలకు ఎత్తుకు పోతారు," అన్నాడు నవర భేరుండం.



శిఖిముఖి, నాగుమల్లి అతని మాటలేమీ పట్టించుకోలేదు. వాళ్ళు గుండ్రంగా చుట్టి వున్న జింకచర్మాన్ని విప్పి, దాని మీద రంగుల్లో చిత్రించివున్న అపూర్వ దృశ్యా లను చూస్తున్నారు. అందులో ఒక చోట శిథిలాలయం చిత్రించబడి వున్నది. దాని పక్కగా ఒక మహానది, కొండలూ, అర ణ్యాలూ చిత్రితమయాయి. దూరంగా మంచుతో కప్పబడిన హిమాలయ పర్వ తాలు కనిపిస్తున్నవి. శిఖిముఖి, నాగుమల్లి ఆ దృశ్యాలు చూస్తూ మైమరిచారు. వారి నేదో అదృశ్య శక్తి ఒకటి ఆ సుందర ప్రాంతాలకు ఆహ్వానిస్తున్నట్టుగా తోచింది.

"శిఖీ! మనం యీ బొమ్మలో వున్న హిమాలయ ప్రాంతాలకు వెళదామా? పూజారి చెప్పే రాజూ, రాణీ మాటలు నేను నమ్మను. కాని, ఊరికే ఒకసారి అతడి వెంట వెళ్ళి, అద్భుతంగా వున్న ఆ కొండలూ అవీ చూసివద్దాం," అన్నది నాగుమల్లి.

శిఖిముఖి, ఆమె కేసి తలతిప్పి చూశాడు. నాగుమల్లి కళ్ళింత చేసుకుని, జింకచర్మం మీద చిత్రించబడ్డ దృశ్యాల కేసి చూస్తూ ఆనందపారవశ్యంలో మునకలు వేస్తున్నది. శిఖిముఖి ఏదో ప్రమాదాన్ని శంకించిన వాడిలా కనుబొమలు పైకెత్తి, తలాడిస్తూ, నాగుమల్లి భుజం మీద చేయివేసి, "మల్లీ! నువ్వీ లోకంలోనే వున్నావా? లేక శిథిలా లయ పూజారి మంత్ర ప్రభావానికి కట్టుబడి పోయావా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నతో నాగుమల్లి ఉలిక్కిపడి, "భేరుండానికి లాగే నాకూ మతిపోయి నట్టుంది. ఆ దుర్మార్గుడైన పూజారి వెంట







ఆ బ్రహ్మపుత్రానది లోయల కేసి వెళ్ళటం ఏమిటి?" అన్నది, నొచ్చుకుంటున్నట్టు.

"నేనూ అదే అడగబోతున్నాను. వాడు మన శత్రువు .." అంటూ శిఖిముఖి ఆగి, సవర భేరుండం కేసి తల తిప్పి, "నువ్విక్కడే వుండు. నీ వెంట ఆ పూజారి దేవుడి దగ్గిరకొస్తాం," అని చెప్పి, నాగుమల్లిని కొంచెం దూరంగా తీసుకుపోయి, "ఆ శిథిలాలయ పూజారిని పట్టుకునేందుకు యిదొక అవకాశం. వాడు యీ ప్రాంతాల్లో చేసిన ఘోరాలు అన్నీ యిన్నీ కావు. గండభేరుండం మాటలు నమ్మినట్టు నటించి, వాడి వెంట పూజారి దగ్గిరకు వెళదామా?



ఒకసారి ఆ దుష్టుడు మన కంటబడితే, వాణ్ణి పట్టుకు బంధించటం ఏమంత కష్టం కాదు," అని చెప్పాడు.

నాగుమల్లి అందుకు సంతోషంగా అంగీకరించింది. ఆ వెంటనే శిఖిముఖి, గండభేరుండాన్ని సమీపించి, "ఇక పద, మీ పూజారి దేవుడి దగ్గిరకు దారితియ్యి," అన్నాడు.

గండభేరుండం ఆ మాటలు వింటూనే పరవశుడై పోయినట్టు గంతులు వేస్తూ, "రండి, రండి. కాబోయే మహారాజా, మహారాణిలను పూజారిదేవుడికి పరిచయం చేయటం కన్న నాక్కావలసిం దేమున్నది? రాజ్యం వచ్చిం తరవాత, యీ సవర భేరుండాన్ని మాత్రం మరవకండి," అని చెట్లల్లోంచి కొండ మీదికి దారితీశాడు.

ఆ కొండప్రదేశ మంతా పెద్దపెద్ద వృక్షాలతో కప్పుకుపోయి వున్నది. భేరుండం ఆ ప్రాంత మంతా కుణ్ణంగా తెలిసినవాడిలాగా గబగబా నడవసాగాడు. శిఖిముఖి, నాగుమల్లీ చుట్టూ పరికించి చూస్తూ, ఆయుధాలు జాగ్రత్తగా పట్టుకుని వాణ్ణి అనుసరించారు.

ఒక పావుగంట గడిచింది. ఆ సరికి వాళ్ళు కొండ మీదికి చాలాదూరం ఎక్కారు. అప్పుడు భేరుండం ఏవో గుర్తుల కోసం







చూస్తున్నవాడిలా తల అటూ యిటూ తిప్పుతూ మెల్లిగా నడుస్తున్నాడు. శిఖిముఖి, నాగుమల్లులు ఒక మహావృక్షం బోదెను చుట్టి ముందుకు పోయేంతలో, "నా బిడ్డ ల్లారా! వస్తున్నారా? అహ్హహ్హ!" అన్న శిథిలాలయ పూజారి వికృత కంఠధ్వని వినిపించింది.

ఇద్దరూ గతుక్కుమని తలలెత్తి పైకి చూశారు. వాళ్ళ కళ్ళకు భయంకొల్పే అద్భుత దృశ్యం ఒకటి కనిపించింది. వాళ్ళు కింద అరణ్యంలో చంపిన ఎలుగు బంటు చెట్లకొమ్మల మీదుగా—గాలిలో తేలుతూ పైకి పోతున్నది.

"శిఖీ! అది మనం చంపిన ఎలుగే! మెడ ఒక పక్కకు వేలాడవేసి వున్నది కనబడటం లేదా?" అన్నది నాగుమల్లి ఆశ్చర్యపడుతూ.

"తెలుస్తూనే వున్నది. దేవి సాయంతో శిథిలాలయ పూజారి దాన్ని పైకి లాగు తున్నాడో అర్థం కావటంలేదు. ఓహో, భేరుండాన్ని మన ముందు దించినట్టు .."

అని శిఖిముఖి ఏదో చెప్పబోయేంతలో, పై నుంచి పూజారి కంచుకంఠం గణగణ మంటూ మోగింది.

"అవి తాళ్ళనుకుంటున్నావా? కాదు, కర్మపాశాలు! వాటికి బద్ధుడయ్యే, భల్లూకేశ్వరుడు నా దగ్గిర కొస్తున్నాడు. మీరూ నా దగ్గిర కొస్తున్నారు."

ఆ మరుక్షణంలోనే జుయ్‌ మంటూ రెండుమూడు బాణాలు చెట్లకొమ్మల మీదుగా పైకి దూసుకుపోయినై. దానితోపాటే విక్రమకేసరి గొంతు కూడా వినిపించింది. "శిఖీ! మల్లీ! ఆ పూజారి వున్న గుహ తెలిసింది. చుట్టుముట్టుదాం. ఇదుగో వస్తున్నాను."

శిఖిముఖి, నాగుమల్లి ఆ కంఠధ్వని వినవచ్చిన వైపుకు తలలుతిప్పి చూశారు. విక్రమకేసరి వేగంగా వాళ్ళ కేసి పరిగెత్తుతు వస్తున్నాడు. —(ఇంకావుంది)





# శిథిలాలయం

## 11

[అరణ్యంలో ఎలుగుబంటును చంపిన తరవాత, శిఖిముఖి, నాగుమల్లులకు కనిపించిన వింతమనిషి, తన పేరు నవరభేరుండం అని చెప్పి, వాళ్ళిద్దర్నీ వెంట బెట్టుకుని పూజారి వద్దకు బయలుదేరాడు. వాళ్ళు కొండ ఎక్కుతూండగా, విక్రమకేసరి వాళ్ళ కేసి పరిగెత్తుకు వస్తూ, తనకు పూజారి దాగివున్న కొండగుహ తెలిసిందని కేకవేశాడు. తరవాత—]

విక్రమకేసరి వేగంగా తమ కేసి పరిగెత్తుకు రావటం చూస్తూనే, శిఖిముఖికి తాను శిథిలాలయ పూజారిని పట్టుకునేందుకు వేసిన పథకం దెబ్బతిని పోయిందని అర్థమైంది. ఇప్పుడు విక్రమకేసరి పెట్టిన కేకలు ఆ దుర్మార్గుడు వినే వుంటాడు; సందేహం లేదు. తననూ, నాగుమల్లిని కల్లబొల్లి మాటలతో మోసపుచ్చి వెంట తీసుకుపోవచ్చని భావించిన పూజారికి, విక్రమకేసరి రాకతో ఆ ఎత్తు పారదని తెలిసిపోయి వుంటుంది. ఇప్పుడు చేయవలసిందేమిటి? పూజారి బంటయిన నవరభేరుండాన్ని బంధిస్తే, పూజారి అతడికి సాయపడేందుకు రావచ్చు. అప్పుడు....

శిఖిముఖి యిలా ఆలోచించి విక్రమకేసరి కేసి చేయి వూపుతూ, నాగుమల్లితో, "మల్లీ! అనుగో, ఆ భేరుండాన్ని మంచి మాటలతో పారిపోకుండా చూడు. నేను,







కేసరితో ఒక మాట చెప్పి యిప్పుడే వస్తాను," అన్నాడు.

నాగమల్లి సరే నన్నట్టు తల వూపి, ముందుపోతున్న భేరుండం కేసి గబగబా పరిగెత్తింది. ఇంతలో కొండ మీది నుంచి శిథిలాలయ పూజారి పెద్ద గొంతుతో, "భేరుండం! నువ్వు పరాకు చిత్తగిస్తున్నట్టున్నది. జాగ్రత్త. అదుగో కర్మపాశం! దాన్ని పట్టుకుని వెంటనే ఆకాశంలోకి ఎగురు," అన్నాడు.

శిఖిముఖి ఆ మాటలు వింటూనే, భేరుండం కేసి తిరిగి అతణ్ణి పట్టుకునేందుకు పరిగెత్తేంతలో, కొండ పై నుంచి



నల్లని తాడొకటి విసురుగా వచ్చి భేరుండం ముందు పడింది. భేరుండం దాన్ని గబగబా నడుముకు చుట్టుకుని, "పూజారిదేవా! ఈ నవరభేరుండం ఆకాశంలోకి ఎగిరిపోటానికి సిద్ధంగా వున్నాడు. ఏమిటి, మీ ఆజ్ఞ?" అని కేక పెట్టాడు.

మరుక్షణంలో భేరుండం తాడు సాయంతో గాలిలోకి లే[illegible] అతణ్ణి పట్టుకునేందుకు శిఖిముఖి, నాగమల్లులతోపాటు విక్రమకేసరి కూడా పరిగెత్తారు. కాని, భేరుండం అప్పటికే గాలిలో అయిదారు నిలువుల ఎత్తుకు లేచిపోయాడు. విక్రమకేసరి పళ్లు కొరుకుతూ, "ఓరి, పూజారిబంటూ! నీకు చావు తప్పదు!" అని విల్లంబు పైకెత్తి, బాణం వదలబోయాడు.

శిఖిముఖి చప్పున ఏదో ఆలోచన వచ్చిన వాడిలా తల ఎగర వేసి, విక్రమకేసరి చేయి పట్టుకుని అతడు బాణం వదలకుండా ఆపి, "కేసరీ, తొందరపడకు. ఆ బంటును చంపినందువల్ల మనకు కలగబోయే మేలు కన్న కీడే అధికంగా వుంటుంది," అన్నాడు.

"వాడు దుష్టుడి సేవకుడు; దుష్టుడు!" అన్నాడు విక్రమకేసరి కోపంగా.

"వాడు దుష్టుడి సేవకుడే గాని, దుష్టుడు మాత్రం కాదు. కేవలం అల్పజీవి, ఒట్టి









బోళామనిషి. తాగిన మైకంలో వాడు నిజంగా తాను ఆకాశంలోకి ఎగరగల ననుకుంటు న్నాడు. అలాంటి మందమతిని ఎవరైనా తమ స్వప్రయోజనానికి ఉపయోగించుకో వచ్చు. వాడు బతికి వుండి, పూజారి సేవ లోనే వుంటే ముందు ముందు మనకు పనికి వస్తాడు," అన్నాడు శిఖిముఖి.



"ముందు ఏ నాటి సంగతో ఎందుకు? ఆ పూజారి వున్న గుహను ఒక కంట కని పెట్టి వుండేందుకు ఇద్దరు శబరుల్ని కావలి వుంచాను. మరొకడు చెట్ల మీదుగా ఎగిరి పోతున్న ఎలుగుబంటి రహస్యం ఏమిటో కనుక్కునేందుకు వెళ్ళాడు. మనం పూజారి వున్న గుహను చుట్టు ముట్టుదాం," అన్నాడు విక్రమకేసరి.

"నీ శకల్రో, గండభేరుండం తప్పిం చుకు పోవటంతో ఆ పూజారిగాడు మన ప్రయత్నం ఏమిటో గ్రహించే వుంటాడు," అని శిఖిముఖి తానూ, నాగుమల్లి అరణ్యంలో ప్రవేసించి-ఎలుగ్గొడ్డును చంపి నప్పటి నుంచీ జరిగిన సంఘటనలన్నీ చెప్పి, గండభేరుండం తన కిచ్చిన జింక చర్మాన్ని అతడికి చూపించాడు. దాని మీద చిత్రించబడిన దృశ్యాలు చూసి విక్రమ కేసరి సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయాడు.

"ఈ చర్మం మీది చిత్రాలు మనకు బ్రహ్మపుత్రా లోయల్లో ప్రవేసించినప్పుడు మార్గాన్వేషణలో సహాయపడతవి. దాన్ని నీ దగ్గిరే వుంచు," అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఆ జింకచర్మాన్ని ఎప్పటిలా గుండ్రంగా చుట్టి, తాడుతో నడుముకు బిగించుకున్నాడు. అంతలో శబరు డొకడు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "కేసరి దొరా! ఆ మంత్రాల మారిగాడూ, మరొ కడూ గుహలో చేరి ఏదో మాట్లాడుకుంటు న్నారు. లోపల వాళ్ళు వెలుగు కోసం మంట చేసినట్టున్నది. గుహ ద్వారం పొగతో మూసుకు పోయింది," అని చెప్పాడు.









పూజారి వున్న గుహ చూసిన వాడు కావటం చేత, దారికోసం వెతుక్కోవలసిన అవసరం లేకుండా పోయింది.

కొద్దిసేపటి తరవాత వాళ్ళు గుహను సమీపించేసరికి, గుహ ముఖాన్ని దట్టంగా పొగ కమ్మి వుండటం వాళ్ళ కంటబడింది. ఆ పొగ చూస్తూనే శిఖిముఖి, "ఆ దుష్టుడు లోపల లేడు. అంత పొగలో ఏ ప్రాణీ అట్టే కాలం బతకదు," అన్నాడు.

"అయితే వాడు తప్పించుకు పోయినట్టేనా?" అన్నాడు విక్రమకేసరి నిరుత్సాహపడిపోతూ.

శిఖిముఖి జవాబిచ్చేంతలో, వాళ్ళ వెంట వున్న శబరుడు ఒక ఎత్తయిన కొండరాతి మీద నిలబడి, "దొరా! పొగ యిక్కడ్నుంచే కాదు, గుహ వెనక మరి రెండు మూడు చోట్ల నించి కూడా వస్తున్నది," అని పెద్ద కేకపెట్టాడు.

"అంటే, ఆ దుర్మార్గుడు పారిపోయేందుకు గుహలో మరికొన్ని రహస్య మార్గాలున్నవన్నమాట. కేసరిదొర కావలి పెట్టిన ఇద్దరు శబరవాళ్ళూ ఏం చేస్తున్నారు? నిద్రపోతున్నారా లేకపోతే వాళ్ళను కూడా పూజారి భుజానేసుకు పోయాడా?" అన్నది నాగుమల్లి అవహేళన చేస్తున్నట్టు.

"గుహలో వాళ్ళు మంట వేసింది వెలుగు కోసం కాదు, మన కళ్ళల్లో అంత పొగా, దుమ్మూ కొట్టి అక్కణ్ణించి పారిపోయేందుకు. నాకు వాడు దొరుకుతాడన్న నమ్మకం లేదు. అయినా ప్రయత్నం చేసి చూద్దామంటావా, కేసరీ?" అన్నాడు శిఖిముఖి.

"దొరక్క మాయమైపోతాడా? వాడేమన్నా ఆకాశభూతమా?" అన్నది నాగుమల్లి విసురుగా.

"నాగుమల్లి బాగా చెప్పింది, శిఖీ! ఇక బయల్దేరుదాం," అంటూ విక్రమకేసరి ముందుండి దారి తీశాడు. అతడు లోగడే









అది గుర్తించిన శిఖిముఖి వచ్చే కోపాన్ని అపుకుంటూ, "ఆ దెయ్యాలపోతు శబరుల్నే కాదు, సవరవాళ్ళను కూడా గాడిదల్ని చేశాడు. ఇప్పుడు మనం కాస్త తెలివిగా ప్రవర్తించాలి. కేసరీ, నువ్వు కాపలి పెట్టిన వాళ్ళిద్దరూ ఆ పూజారిని అనుసరించి పోయారని నా అనుమానం," అని అక్కడున్న చెట్టు కొమ్మ ఒకటి విరిచి గుహ ముందుకు వెళ్ళి, దానితో గుహ ద్వారం ముందు గట్టిగా విసిరాడు. గాలికి పొగ కాస్తా చెల్లా చెదరైంది. అంతలో విక్రమకేసరి గుహ లోపలికి రెండు మూడు బాణాలు కొట్టాడు. లోపలి నుంచి ఎలాంటి శబ్దమూ రాలేదు.



ఇప్పుడేమి చేయటమా అని శిఖిముఖి ఆలోచించేంతలో, గుహ మీది నుంచి నాగమల్లి పెద్దగా చప్పట్లు చరిచి ఒక పెద్ద కేక పెట్టింది. ఆమెకు గుహ వెనక దిగువగా వున్న లోయ కేసి పోతున్న పూజారీ, సవర భేరుండం కనిపించారు. వాళ్ళకు కొంచెం వెనక రాళ్ళచాటున నక్కుతూ యిద్దరు వ్యక్తులు పోతున్నారు. వాళ్ళు విక్రమకేసరి చెప్పే శబర కాపలి వాళ్ళని ఆమె అనుకున్నది. ఆమె కేక పెట్టి పిలవగానే వాళ్ళల్లో ఒకడు వెనక్కు తిరిగి చూసి, రెండో వాడితో ఏమో చెప్పి గబగబా కొండ ఎక్కి గుహ కేసి రాసాగాడు.

నాగమల్లి తాను పూజారిని చూసిన సంగతి శిఖిముఖి వాళ్ళకు చెప్పబోయేంతలో, అతడూ, విక్రమకేసరీ, వెంట వున్న శబరుడూ గుహ మీదికి వచ్చి, దిగువనున్న లోయ కేసి చూశారు. వారికి తమ దగ్గిర కొస్తున్న శబరుడితో పాటు, లోయలోకి దిగిపోతున్న శిఖిలాలయ పూజారి కూడా కనిపించారు.

"శిఖీ! మనం ఆ పూజారిగాణ్ణి వెంట తగిలి పట్టుకోవటం ఏమంత కష్టం కాదు," అన్నాడు విక్రమకేసరి ఎంతో ఉత్సాహంగా.









"నాకూ అలాగే అనిపిస్తున్నది. మల్లి ఏమంటుందో?" అంటూ శిలిముఖి నాగుమల్లి కేసి చూశాడు.

"వాడు అందకపోతే బాణం కొట్టి చంపుతాం. ఒకవేళ అంది కూడా తిరగబడితే యీటెతో పొడిచి ప్రాణాలు తీస్తాం. ఊఁ పదండి," అంటూ నాగుమల్లి గుహ మీది నుంచి కిందికి దూకింది.

నాగుమల్లి ధైర్యసాహసాలు లోగడే రుజువు అయివుండకపోతే, శిలిముఖీ, విక్రమకేసరీ కూడా ఈ మాటల్ని కేవలం వాచాలతగానే, బడాయి చూపటంగానే జమకట్టి వుండేవాళ్ళు. కాని, వాళ్ళిద్దరికీ ఆమె శక్తిసామర్థ్యాలు తెలుసు. అయినా, ఆమె రక్షణబాధ్యత తమ మీద వున్నదని నమ్మివున్న ఆ ఇద్దరూ కూడబలుక్కొని, నాగుమల్లికి అటూ యిటూ తాముండి, ఆమెకు ఎలాటి ప్రమాదం జరక్కుండా చూడాలనుకున్నారు. శిథిలాలయ పూజారి ఏ క్షణంలో ఏ రకమైన దుష్టపన్నాగం పన్నబోతాడో అన్నది ఎవరికీ అంతు చిక్కని సంగతి....

శిలిముఖి ముందుండి దారితీస్తుండగా తతిమ్మా ముగ్గురూ అతణ్ణి అనుసరించి వేగంగా లోయలోకి దిగసాగారు. వాళ్ళ దృష్టి శిథిలాలయ పూజారి మీదనే వున్నది. వాడు తమ కనుగప్పి, ఏ రాళ్ళచాటు నుంచో పారిపోకుండా చూడాలని వాళ్ళను కున్నారు. కాని పూజారి నిర్భయంగా, తాపీగా లోయలోకి దిగిపోతున్నాడు. అతడు ఒకటి రెండు సార్లు తలతిప్పి శిలిముఖి వాళ్ళ కేసి చూసి, ఖేదుండంతో చేతు లూపుతూ ఏదో చెప్పాడు.

"ఆ దుష్టుడి ప్రవర్తన చూస్తూంటే నా కేదో అనుమానంగా వున్నది, కేసరి. వాడు మన నుంచి పారిపోయేందుకు ఎలాంటి ప్రయత్నమూ చేయకపోగా, మనను ముక్కుకు తాడుపోసి లోయలోకి





లాగుతున్నట్టు ప్రవర్తిస్తున్నాడు," అన్నాడు శిఖిముఖి.

"లోయలో వాడి బ్రహ్మరాక్షసి సేన కాపలా వుందేమో!" అన్నది నాగుమల్లి వెటకారంగా.

"ఉంటే...నవరగండపోతు కూతురు వాళ్ళను ఏకాకిగా ఎదుర్కొని జయించేస్తుంది! మన కెలాంటి భయమూ లేదు కేసరీ," అన్నాడు శిఖిముఖి.

ఆ మాటలకు విక్రమకేసరి పెద్దగా నవ్వాడు. అంతలో శబర కావలి వాళ్ళల్లో రెండవవాడు వాళ్ళ దగ్గరకు పరిగెత్తుకు వచ్చి, పూజారి గుహలో వున్న మరొక దారి కుండా ఎలా బయటపడిందీ, తాను వాణ్ణి దృష్టి నుంచి తప్పుకు పోనీయకుండా లోయలోకి ఎలా వెన్నంటి పోయిందీ— శిఖిముఖి వాళ్ళకు చెప్పాడు.

"నీ దగ్గిర వడిశెల వుంది కదా? ఇప్పట్లో నీ యీటె కన్న దాని ఉపయోగం ఎక్కువలా కనబడుతున్నది. చేతికి అందక పోతే ఆ పూజారిగాణ్ణి ఒక్క వడిశెల దెబ్బతో కింద పడగొట్టాలి," అన్నాడు విక్రమకేసరి, ఆ శబరుడితో.

శబరుడు ఈటెను భుజాన పెట్టుకుని, వడిశెలలో రాయిపెట్టి దాన్ని అటూ యిటూ ఊపుతూ నడవసాగాడు. అంతలో పూజారి కొండ దిగి ఎదురుగా వున్న మైదాన ప్రదేశంలో ప్రవేశించాడు. శిఖిముఖి వెంట వున్న వాళ్ళను వేగంగా కదలండని హెచ్చరించి, పరిగెత్తుకుంటూ పోయి కొండ దిగి మైదానం చేరుతూనే, "ఓహోయ్, దొంగ పూజారీ, ఆగు! పారిపోవాలని ప్రయత్నిస్తే చావు తప్పదు," అని కేక పెట్టాడు.

శిథిలాలయ పూజారి వెనక్కు తిరిగి, "అదుగో, ఆ అర్ధచంద్రాకారంగా కనబడే గండశిలలున్నవే, అక్కడికి పోయి ఆగుతాను. తాపీగా రండి, అంతా మాట్లాడుకుందాం," అన్నాడు. —(ఇంకా వుంది)






# శిథిలాలయం

## 12

[శిఖిముఖీ, విక్రమకేసరీ పూజారి దాగి వున్న గుహ దగ్గిరకు వెళ్ళారు. కాని, అతను అందులో లేడు. నవర భేరుండాన్ని వెంటబెట్టుకుని పూజారి కొండ దిగి లోయ కేసి పోతూండటం వాళ్ళకు కనిపించింది. శిఖిముఖీ వాళ్ళు అతణ్ణి వెంబడించారు. పూజారి లోయలో వున్న గండశిలలను శిఖిముఖికి చూపి, అక్కడికి రమ్మన్నాడు. తరవాత—]

శిథిలాలయ పూజారి మాటలు, శిఖిముఖీ వాళ్ళకు చాలా కోపాన్ని తెప్పించినై. వాళ్ళు వేగంగా లోయలోకి దిగి, రాళ్ళ ముందు నిలబడి వున్న పూజారీ, సవరభేరుండాల్నీ సమీపించేంతలో, రాళ్ళ వెనక నుంచి దాదాపు పదిమంది చెంచులు పెద్దగా కేకలు పెడుతూ ముందుకు దూకారు. వాళ్ళ నాయకుడు ఒక గుర్రం మీద రాతి చాటు నుంచి ముందుకు వచ్చి, "ఎవరు? శిఖిముఖీ, నాగుమల్లులా? శబర, సవర నాయకుల పిల్లలన్నమాట! మీరు నా బందీలు. మీ తండ్రులు ఏ పాటి ధనం యిచ్చి మిమ్మల్ని విడిపించుకు పోతారో చూస్తాను," అన్నాడు.

"భేష్, బావుంది! అది అసలు కథ! ఇందులో నే నెలాంటి జోక్యం కల్గించుకోను, అర్థమైందా, శిఖీ!" అంటూ పెద్దగా నవ్వాడు శిథిలాలయ పూజారి.







"వాడు చెంచు బందిపోట్ల నాయకుడు, బడేచెంచు, కేసరి!" అన్నాడు శిఖిముఖి ఈటె ఎత్తుతూ.

"ఇది పూజారి దుర్మార్గుడు మన కోసం పెట్టిన మాటు!" అన్నది నాగమల్లి ఈటె ఝళిపిస్తూ.

విక్రమకేసరి ఏమీ జవాబివ్వకుండా మెరుపులా ముందుకు దూకి, బడేచెంచు తల మీద ఈటెతో బలంగా ఒక దెబ్బకొట్టి, ఆ దెబ్బకు చెంచు గుర్రం మీది నుంచి కింద పడుతూండగానే, గుర్రం కళ్ళాన్ని గట్టిగా పట్టుకుని, "శిఖీ, మల్లీ! మాటల్తో కాలయాపన ప్రమాదం. మీ రిద్దరూ దీన్నెక్కి పారిపోండి. పూజారి మీ కోసమే యింత దుష్టతంత్రం పన్నాడు," అంటూ శిఖిముఖిని భుజం పట్టుకుని ముందుకు లాగి, బలవంతంగా గుర్రం ఎక్కించాడు. నాగమల్లి ఏదో అభ్యంతరం చెప్పబోయింది. కాని విక్రమకేసరి ఆమెకు అవకాశం యివ్వకుండా, ఒడిసి పట్టుకుని శిఖిముఖి వెనక గుర్రం మీద ఎక్కించి, గుర్రాన్ని డొక్కలో గట్టిగా ఒక్క తన్ను తన్నాడు.

ఇదంతా కన్నుమూసి తెరిచేంతలో జరిగి పోయింది. బడేచెంచు అనుచరులు తెప్పరిల్లి కేకలు పెడుతూ ముందుకు వచ్చే లోపలే శిఖిముఖి, నాగమల్లి ఎక్కిన గుర్రం లోయలో పరిగెత్తసాగింది. నేల మీద పడ్డ బడేచెంచు అబ్బా అంటూ లేచి నిలబడి, "మీరు ఆ గుర్రం మీద వెళ్ళే వాళ్ళను పట్టుకోండి. యీ చవటల సంగతి నేనూ, పూజారి ప్రభువూ చూస్తాం," అన్నాడు.

చెంచులు ఐదారుగురు అరుస్తూ గుర్రం వెనక పరిగెత్తారు. శిథిలాలయ పూజారి అక్కడ నిలబడి వున్న మిగతా చెంచులతో, "ఈ విక్రమకేసరిని ప్రాణాలతో పట్టుకోండి. శిథిలేశ్వరీదేవికి బలి పెట్టటానికి యింతకంటె అర్హుడు యీ భూప్రపంచంలో దొరకడు," అన్నాడు పళ్ళు కొరుకుతూ.







విక్రమకేసరి తన ముగ్గురు అనుచరులనూ హెచ్చరించి, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూ, కొండ కేసి కదలసాగాడు. చెంచులు భయంకరంగా కేకలు పెడుతూ వాళ్ళను చుట్టు ముట్టేందుకు ముందుకురికారు.

"బడేచెంచూ, నువ్వు పెద్ద పొరపాటు చేశావు. నీ వాళ్ళను మరో ఇరవై మందిని వెంట తెస్తే పని సానుకూల మయ్యేది. ఈ విక్రమకేసరి మహా పొగరుబోతు. గాయపరచకుండా అతణ్ణి పట్టుకోవటం సాధ్యం కాదు. శిలేశ్వరీదేవికి క్షతగాత్రుణ్ణి బలి పెట్టటం గొప్ప అపచారం. అందువల్ల మనం ప్రస్తుతానికి ఈ విక్రమకేసరిని వదిలి మన నివాసాలకు పోవటం ఉత్తమం," అన్నాడు పూజారి.

"పూజారి ప్రభూ! చూడండి, వాడు నా వాళ్ళను రాళ్ళ చుట్టూ ఎలా గిరికీలు తిప్పిస్తున్నాడో. తమరొక పని చేయకూడదా? మంత్రం ప్రయోగించి వాడి కాళ్ళూ చేతులూ ఆడకుండా బంధించండి," అన్నాడు బడేచెంచు.

ఆ మాటలకు పూజారి పెద్దగా నవ్వుతూ, "నా మహా మంత్రశక్తిని యీ హీనుణ్ణి పట్టుకునేందుకు ప్రయోగించటమా? ఎంత మాటన్నావు, చెంచూ! పొరబాటు, పొరబాటు. నే చెప్పినట్టు చెయ్యి. నీ వాళ్ళను తిరిగి రమ్మను. కావాలంటే వాళ్ళను కూడా ఆ శిఖిముఖి, నాగుమల్లులను పట్టుకునేందుకు పంపు," అన్నాడు.



"చిత్తం, పూజారి ప్రభూ, చిత్తం!" అంటూ బడేచెంచు తలవంచి పూజారికి నమస్కరించి, విక్రమకేసరితో పోరుతున్న తన అనుచరులను తిరిగి రావలసిందిగా పెద్ద కేక పెట్టాడు. ఆ కేక వింటూనే చెంచులు బతుకుజీవుడా అనుకుని, విక్రమకేసరి వల్ల గాయపడిన తమవాణ్ణొకణ్ణి భుజాన వేసుకుని, తమ నాయకుడి వద్దకు తిరిగి వచ్చారు.









"పూజారి ప్రభూ! ఇక మనం మన ఆకాశ గుహకు వెళదామా? నా వాళ్ళు ఆ శశిముఖిని, నాగుమల్లిని అక్కడికే పట్టుకు వస్తారు. నా తలదిమ్ము యింకా వదల్లేదు," అన్నాడు బడేచెంచు.

"అలాగే వెళదాం. కాని...నీ వాళ్ళు వాళ్ళిద్దర్నీ పట్టుకోగలరా అన్న సంశయం నాకు కలుగుతున్నది. నేనీ ప్రాంతాలకు వచ్చినప్పటి నుంచీ, ఎందుకనో అన్నీ విఘ్నాలే ఎదురవుతున్నవి. వింధ్యకు దక్షిణాన శిఖిలేశ్వరీదేవి ప్రభావం అంతగా చెల్లుబడి అవుతున్నట్టు కనబడదు," అన్నాడు పూజారి నిస్పృహగా.



"కావచ్చు, పూజారి దొరా! మనకి కోతి వెధవల్తో పనేం? చక్కా బ్రహ్మపుత్రా నదీ లోయలకు వెళ్ళిపోదాం. బయలుదేరండి. ఊఁ ఎగరమన్నారా, ఆకాశంలోకి?" అంటూ నవరభేరుండం చేతులు పైకీ కిందికీ ఆడించసాగాడు.

పూజారి, భేరుండం మెడ మీద ఒక్క చరుపు చరిచి, "ఎగరటానికి వేళాపాళా లేదా? ఇది వాయసవేళ; భేరుండాలు యీ వేళప్పుడు పైకెగరలేవు, నేల నంటి పెట్టుకుని వుండాల్సిందే, తెలిసిందా? ఇక నోరు మూసుకుని బుద్ధిగా వెంటరా," అంటూ బయలుదేరాడు.

చెంచు నాయకుడి వెంట పూజారీ తతిమ్మా చెంచులూ అతడి నివాసమైన ఆకాశ గుహకు బయలుదేరారు. అదే సమయంలో విక్రమకేసరి తన వెంటవున్న శబరులతో కలిసి, శశిముఖి, నాగుమల్లులు గుర్రం మీద పారిపోతున్న లోయప్రాంతం కేసి పరిగెత్తసాగాడు. అతడికి గుర్రం మీద వున్న వాళ్ళిద్దరూ, వాళ్ళను పట్టుకునేందుకు వెనకగా పరిగెత్తుతున్న చెంచులూ కనబడుతూనే వున్నారు. గుర్రం ఎగుడు దిగుడుగా వున్న ఆ ప్రాంతాల వేగంగా పరిగెత్తలేక పోతున్నది. అది అవకాశంగా తీసుకుని







చెంచులు దాన్ని చుట్టు ముట్టేందుకు ప్రయత్నిస్తున్నారు.

విక్రమకేసరి పెద్దగా, "శిఖి, మల్లీ! మేం వస్తున్నాం. పూజారీ, బడేచెంచూ పారి పోయారు," అని కేకలు వేస్తూ వారి కేసి పరిగెత్తసాగాడు. కాని, అతడు వాళ్ళను సమీపించే లోపలే యిద్దరు ముగ్గురు చెంచులు పొదలనుంచి విడివడి, అక్కడ వారిన వాళ్ళ మీదుగా దూకుతూపోయి, ముందు వైపునుంచి గుర్రం దారిని అటకాయించారు.

శిఖిముఖి కత్తితోనూ, నాగుమల్లి ఈటె తోనూ ఆ చెంచులు గుర్రాన్ని సమీపించ కుండా ఆప సాగారు. ఒకటి రెండు నిమిషాల తరవాత శిఖిముఖి గుర్రం కళ్ళాన్ని గట్టిగా పట్టుకుని పక్కకు లాగి, దాన్ని లోయలో నుంచి కొండ మీదికి ఎక్కించసాగాడు. అతడికి విక్రమకేసరి కేకలు వినిపించినై. కేసరి కొండ మీది నుంచి తన కేసి దిగి వస్తున్నాడని అతడు భావించాడు.

శిఖిముఖి గుర్రాన్ని కొండ మీదికి ఎక్కించే ప్రయత్నం గమనిస్తూనే, ఒక చెంచు అటుగా పరిగెత్తి గట్టిగా చప్పట్లు చరుస్తూ, దాన్ని బెదరకొట్ట సాగాడు. గుర్రం



కొంచెంగా బెదిరి వెనక కాళ్ళమీద లేచింది. ప్రమాదాన్ని గుర్తించిన నాగుమల్లి తన చేతిలోని ఈటెను చెంచువాడి కేసి విసిరింది. కాని, చెంచు ఆ దెబ్బ తప్పుకుని మరింత గట్టిగా చప్పట్లు చరుస్తూ, గావు కేకలు పెట్టసాగాడు.

శిఖిముఖి, నాగుమల్లిలకు రానున్న ప్రమాదాన్ని గుర్తించిన విక్రమకేసరి చప్పున పడికెల వున్న శబరుణ్ణి దగ్గిరకు పిలిచి, "బాగా గురిచూసి ఒక్క దెబ్బతో గుర్రం ముందున్న చెంచువాణ్ణి కింద పడ కొట్టాలి. ఆ వెనక పరిగెత్తు కొస్తున్నవాళ్ళ సంగతి తరవాత చూద్దాం," అన్నాడు.








శబరుడు వడిసెలలో రాయి పెట్టి, దాన్ని గిర్రున రెండుసార్లు తిప్పి, చెంచు మీదికి విసిరాడు. అది జుయ్ః మంటూ పోయి గుర్రాన్ని అడ్డగిస్తున్న చెంచు గుండెలను బలంగా తాకింది.

ఆ దెబ్బకు వాడు అరుస్తూ నేల మీది నుంచి అంతెత్తు ఎగిరి దభీమంటూ కిందపడి గుర్రం కేసి దొర్లుకుంటూ పోయాడు. గుర్రం బెదురుకుని గిర్రున వెనుదిరుగబోయి, వెనక కాళ్ళకింద వున్న గులకరాళ్ళు పట్టు తప్పి జారటంతో పక్కకు పడి, ఏటవాలుగా వున్న కొండమీది నుంచి దిగువకు దొర్లుకు పోసాగింది. గుర్రంతో పాటు కిందపడిన శిఖిముఖి, నాగుమల్లులు కూడా కిందికి దొర్లుకు పోయారు.

చెంచువాళ్ళు యీ దృశ్యం చూస్తూనే, సంతోషం పట్టలేక పెద్దగా చప్పట్లు చరిచి కేకలు పెడుతూ, "పట్టుకోండి, పట్టుకోండి," అంటూ శిఖిముఖి, నాగుమల్లుల కేసి పరిగెత్తారు. వాళ్ళు శిఖిముఖి వాళ్ళను సమీపించే లోపలే విక్రమకేసరి బాణం ఎక్కుపెట్టి గుంపు మధ్యకు వదిలాడు. బాణం ఒక చెంచును తాకింది. వాడు ఒక్క చావుకేక పెట్టి కిందపడి పోయాడు. అంతలో శిఖిముఖి లేచి నిలబడి తనను పట్టవచ్చే చెంచువాణ్ణి ఒక్క తన్ను తన్ని, అతడి చేతిలోని ఈటెను లాక్కున్నాడు.

కాని, యీ లోపల గుర్రం మీంచి కింద పడటంవల్ల గట్టి దెబ్బ తగిలి స్పృహ కోల్పోయిన నాగుమల్లిని, ఇద్దరు చెంచులు భుజాలమీద వేసుకుని లోయకు అడ్డంపడి పరిగెత్తసాగారు. తతిమ్మా చెంచులు ఓ క్షణకాలం శిఖిముఖిని ప్రతిఘటించి, దూరం నుంచి పరిగెత్తుకు వస్తున్న విక్రమకేసరినీ, శబరుణ్ణీ చూసి, యిక లాభం లేదనుకుని తాము కూడా లోయలోకి పారిపోయి, చూస్తూండగానే రాళ్ళ వెనక మాయమయారు.





శిఖిముఖి, విక్రమకేసరి కేసి చేయి చూపి రాళ్ళ వెనుకకు పారిపోయిన చెంచుల వెంట పడ్డాడు.

కాని, అతడు గుర్రం మీది నుంచి పడ్డ పాటుకు మోకాలు కొంచెం బెణకటంతో, వాళ్ళ ననుసరించి వేగంగా పరిగెత్తలేక పోయాడు. ఆ దశలో విక్రమకేసరి వచ్చి అతణ్ణి కలుసుకున్నాడు.

"కేసరి! పెద్ద ఘోరం జరిగిపోయింది. ఇంత మందిమి వుండి, నాగుమల్లిని రక్షించలేక పోయామంటే ఆమె తండ్రే కాదు, మా అయ్యా కూడా మనల్ని—ముఖ్యంగా నన్ను అసహ్యించుకుంటాడు. మనం చెంచు ముఠాతో యుద్ధం చేయకుండా నాగుమల్లిని రక్షించలేం. నువ్వు గూడేనికి పోయి మనవాళ్ళను పాతికా ముప్పై మందిని వెంటబెట్టుకు రా. ఈ లోపల నేను కాలిజాడలను బట్టి పోయి, ఈ చెంచులు మల్లిని ఎక్కడికి తీసుకు పోతున్నదీ గమనిస్తాను," అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఏదో అభ్యంతరం చెప్ప బోయాడు గాని, శిఖిముఖి వినిపించుకోక, అతణ్ణి వేగిర పెట్టాడు. విక్రమకేసరి చేసేది లేక ఒక శబరుణ్ణి శిఖిముఖి వెంట వదిలి, తతిమ్మా యిద్దరితో గూడేనికి బయులుదేరాడు.

శిఖిముఖి, చెంచులు పోయిన మార్గాన్ని కాలిజాడల వల్ల గుర్తిస్తూ, ఓ అరగంట తరవాత కొండపాదంలో వున్న ఒక అరణ్య ప్రాంతాన్ని చేరాడు. అతడికి చెట్లచాటు నుంచి ఏవో గొంతులు వినిపించినై. అతడు వెంటవున్న శబరుణ్ణి నిశ్శబ్దంగా వుండమని హెచ్చరించి, దాపుల నున్న ఒక చెట్టు ఎక్కి దిగువకు చూశాడు. చెట్లల్లో ఒక చోట పులిబోను ఒకటి వున్నది. చెంచులు నాగుమల్లిని దాని కేసి మోసుకు పోతున్నారు.

—(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 13

[పూజారి ప్రోత్సాహంతో చెంచునాయకుడూ, అతడి అనుచరులూ, శిఖిముఖీ వాళ్ళమీద హఠాత్తుగా దాడిచేశారు. విక్రమకేసరి, చెంచునాయకుణ్ణి గుర్రం మీది నుంచి పడగొట్టి, గుర్రాన్ని శిఖిముఖీ, నాగుమల్లులకు ఒప్పచెప్పాడు. చెంచులు గుర్రం మీదినుంచి జారి పడిన నాగుమల్లిని అరణ్యంలోని ఒక పులిబోను దగ్గిరకు తీసుకుపోసాగారు. తరవాత—]

చెంచులు నాగుమల్లిని పులిబోను దగ్గిరకు తీసుకుపోయి, దాని పక్కగా నేల మీద పడుకోబెట్టారు. నాగుమల్లికి యింకా స్పృహ రాలేదు. చెట్టు మీది నుంచి యిదంతా చూస్తున్న శిఖిముఖికి ఒక్క క్షణంపాటు, మల్లిని పులిబోనులో ఎరగా పెడతారేమో అన్న భయం కలిగింది. కాని, అంతలోనే అతడికి చెంచునాయకుడైన బడే చెంచు అన్న మాటలు గుర్తుకు వచ్చినై. వాడు ఆమెను బందీగా చేసి, ఆమె తండ్రి అయిన నవరగండుపోతు నుంచి ధనం గుంజాలని చూస్తున్నాడు. కాని, వాడి అనుచరులు మల్లిని పులిబోను దగ్గిర ఎందుకు దించారు?

శిఖిముఖి యిలా ఆలోచిస్తున్నంతలో, చెంచువాళ్ళల్లో ఒకడు చుట్టూ కలయచూసి, పెద్దగా గొంతెత్తి, "బూతాలదొరా!" అని కేక పెట్టాడు.







ఉత్తరక్షణంలో పులిబోనుకు వెనకవున్న గుబురు చెట్లల్లోంచి, "ఎవర్రావాడు? చారలమెకాన్ని బెదరకొడుతున్నావా? నిలువునా పాతేస్తాను! పో అక్కణ్ణించి," అన్న జవాబు వచ్చింది.

చెంచులు ఆ జవాబుకు బెదిరిపోయి అటు చూసేంతలో చెట్ల కొమ్మల్లోంచి ఊడల సాయంతో, నల్లగా, పొట్టిగా, బక్క చిక్కి వున్న వాడొకడు నేల మీదికి దిగాడు. వాడి మెడలో ఎముకల దండ ఒకటి వున్నది, చేతిలో వంకర టింకరగా వున్న పొడవాటి కర్ర ఒకటి పట్టుకుని వున్నాడు. వాడు చెంచు దయ్యాలపోతు.

దయ్యాలపోతు పులిబోనును సమీపిస్తూనే, నేల మీద పడి వున్న నాగమల్లి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, "ఎవర్రా యిదీ, దేవతా పిల్లలా వుంది? ఎందుకిక్కడికి తీసుకొచ్చారు? ఎవరు చంపారు?" అని ప్రశ్నించాడు.

చెంచుల్లో ఒకడు జరిగిందంతా అతడికి చెప్పి, "బడేదొర యీ పిల్లని ఆకాశగుహ దగ్గరకు తీసుకురమ్మన్నాడు. కాని, చాలా సేపుగా కదలా మెదలక పడున్నది. చచ్చి పోయిందేమో అని భయంగా వున్నది. దొర మా ప్రాణాలు తీసేస్తాడు," అన్నారు వణికిపోతూ.

ఘాతాలరాయుడు. నాగమల్లి ముక్కు పుటాల దగ్గిర వేలుపెట్టి చూసి, "చావ లేదు. ప్రాణం వున్నది. గుర్రం మీంచి పడ్డ పాటుకు ప్రాణం కడబట్టింది. మందు మంత్రం వేసి యిప్పుడు మెళకువ తెప్పించామో — మీ కందకుండా పారిపోతుంది. ఇదుగో, యీ భస్మం తీసుకోండి. ఆకాశ గుహ చేరిం తరవాత ముక్కు దగ్గిర పెట్టండి. నాలుగు తుమ్ములేచి కూచుంటుంది," అని నడుం నుంచి వేలాడుతున్న సంచిలోంచి, ఒక పొట్లం తీసి చెంచు వాడికి యిచ్చాడు.







చెంచువాడు ఆ పొట్లం తీసుకుని రొండిన దోపుకుని, రెండోవాణ్ణి హెచ్చరించాడు. ఇద్దరూ కలిసి నాగుమల్లిని తిరిగి భుజాన వేసుకుని బయలు దేరారు. ఇదంతా చూస్తున్న శిఖిముఖికి నాగుమల్లిని వాళ్ళ బారి నుంచి రక్షించటం చాలా తేలిక అన్న ధైర్యం కలిగింది. అతడు నాగుమల్లిని ఎత్తుకు పోతున్న చెంచులను మధ్య మార్గంలో అటకాయించా లనుకున్నాడు.

శిఖిముఖి తన వెంట వున్న శబరుడితో తాను తిరిగి వచ్చేవరకూ, చెంచు భూతాల రాయుణ్ణి ఓ కంట కనిపెట్టి వుండమని చెప్పి, చెట్ల కొమ్మల మీదుగా ముందుకు కొంత దూరం పోయేసరికి, గండశిలల దగ్గిర తమను ఎదుర్కొన్న చెంచుల కొందను, నాగుమల్లిని ఎత్తుకుపోతున్న వాళ్ళను సమీపిస్తూండటం అతడి కంటబడింది. ఆ దృశ్యం చూస్తూనే శిఖిముఖి నిరుత్సాహ పడిపోయాడు. ఇందర్ని ఎదిరించి నాగు మల్లిని రక్షించటం సాధ్యమయేది కాదని అతడు నిర్ణయించుకున్నాడు. విక్రమకేసరి వెంట తీసుకువచ్చే శబరుల సహాయంతో, తాను చెంచునాయకుడి ఆకాశగుహను ముట్టడించటం ఒక్కటే, నాగుమల్లిని రక్షించటానికి మిగిలిన మార్గం...



విక్రమకేసరి వచ్చేవరకూ తాను చేతులు ముడుచుకు కూర్చోవలసిందే అనుకున్నాడు, శిఖిముఖి. అంతలో అతడికి భూతాలరాయుడూ, పులిబోనూ గుర్తుకు వచ్చినై. ఆటవికుల్లో ఒకడుగా అతడికి, అలాంటి జాతివాళ్ళ మీద మంత్రతంత్రాలు ఎరిగిన వ్యక్తులు చలాయించే అధికారం గురించి బాగా తెలుసు. చెంచు భూతాల రాయుణ్ణి కాస్త హడలకొట్టి, వీలయితే అతడి ద్వారా కొంత సహాయం సంపాయించా లనుకున్నాడు, శిఖిముఖి. ఆ వెంటనే అతడు నిశ్శబ్దంగా చెట్ల కొమ్మల్లో కదిలి, పులి బోను వున్నచోటుకు వచ్చాడు.











కాలా? నిన్ను మారేడుకాయలో దట్టించి ముక్కుపొడుం కింద పీల్చేస్తాను," అన్నాడు రౌద్రంగా.

శిఖిముఖి ఏమీ మాట్లాడకుండా, ఎడమ చేత్తో అతడి చేతిలోంచి కర్ర లాక్కుని, కుడిచేత్తో అతడి జుట్టు పడిసి పట్టుకున్నాడు. భూతాలరాయుడు పట్టు విడిపించుకునేందుకు పెనుగులాడుతూ, "ఎవర్రా నువ్వు, వెర్రికుంకా! బతుకు మీద రోశావా, ఏం? నే నెవర్ననుకున్నావ్? బడేచెంచు ముఠావాణ్ణి, ఆ చెంచు తరవాత అంతవాణ్ణి, వదులు!" అన్నాడు.

శిఖిముఖి పెద్దగా నవ్వి, "నువ్వెవడివైతే నాకేం, దయ్యాలపోతూ? ఒక మాటచెప్పు; ఈ పక్కనే నీటిమడుగు చూశాను. పులి ఏ వేళప్పుడు దప్పిక తీర్చుకునేందు కక్కడికి వస్తుంది?" అని ప్రశ్నించాడు.

భూతాలరాయుడు ఆ ప్రశ్న వింటూనే కళ్ళెర్రచేసి, "ఎవర్రానువు, నన్ను ప్రశ్నలడగటానికి? జుట్టు వదులు ముందు!" అంటూ హుంకరించాడు.

"అయితే నిన్ను ఏం ప్రశ్నలడగను, అంతా ఆ పెద్దపులే చూసుకుంటుంది!" అంటూ శిఖిముఖి, దయ్యాలపోతును నడుం పట్టుకుని పైకెత్తి పులిబోను దగ్గిరకు తీసుకు

భూతాలరాయుడు ఒక చిన్న మేకను, మెడతాడు పట్టుకుని బోనుదగ్గిరకు లాక్కురా ప్రయత్నిస్తున్నాడు. కాని అది అరుస్తూ అటూయిటూ గెంతుతున్నది. శిఖిముఖి కొద్దిసేపు యిదంతా చూసి, పులిలా పెద్దగా ఒక్కసారి గాండ్రుపెట్టి, చెట్ల కొమ్మల్లోంచి వేగంగా భూతాలరాయుడి ముందు దూకాడు.

భూతాలరాయుడు అదురుకుని కేక పెట్టి పారిపోబోయినవాడల్లా, తన ముందు దూకినది పులి కాదనీ, శబరయువకుడనీ చూసి, వంకరకర్ర పైకెత్తుతూ, "ఎవర్రా నువ్వు? చెంచు దయ్యాలపోతుతోనే పరాచ







పోయి, "మేక బదులు నిన్ను పులికి ఎరగా పెడుతున్నాను, తెలిసిందా?" అంటూ బోనులోకి తోయబోయాడు.

భూతాలరాయుడు గడగడ వణికిపోతూ, "నువ్వెవరో తెలియక దూషించాను, క్షమించు! నన్ను పులికి ఆహారంగా వెయ్యకు. బతికున్నన్నాళ్ళూ నీకు సేవ చేస్తాను," అంటూ బావురుమన్నాడు.

శిఖిముఖి, అతణ్ణి వదిలి, "అలా అయితే నిన్ను పెద్దపులికి మేతగా వెయ్యను. బతికున్నన్నాళ్ళూ నాకు సేవచేయ నవసరం లేదు, ఒక్క ఇరవైనాలుగ్గంటలు నేచెప్పినట్టు చెయ్యి, చాలు," అన్నాడు.

"చిత్తం. ఆజ్ఞాపించు. నీ దాసుణ్ణి," అంటూ భూతాలరాయుడు, శిఖిముఖికి ప్రాణాచారం పడిపోయాడు.

శిఖిముఖి అతణ్ణి లేవమని చెప్పి, "నవరగండుపోతు కూతుర్ని మీవాళ్ళు బలవంతంగా ఎత్తుకుపోయారు; నువ్వు చూశావుగదా? ఆమెను యీ రాత్రే నేను కాపాడదలిచాను. ఎలా అని అడక్కు. కాని, నువ్వొకటి చేయాలి. మీ ఆకాశగుహ ముందుండే గుడిసెల చుట్టూ వున్న కంచె ద్వారాన్ని యీ రాత్రికి వాళ్ళతో లోపలి నుంచి బంధించకుండా అట్టే పెట్టాలి. గండుపోతు కూతుర్ని ఆ ద్వారానికి సాధ్య





మైనంత దగ్గిరగావున్న గుడిసెలో వుంచాలి. ఈ పనులు చేయగలవా?'' అన్నాడు.

''చిత్తం. నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. చెంచు ముఠాలో నా మాటకు తిరుగు లేదు,'' అన్నాడు భూతాలరాయుడు.

''అది నిజమే కావచ్చు. కాని, నువ్వు అన్నమాట నిలుపుకోపోతే? నన్ను మోసం చేస్తే?'' అని ప్రశ్నించాడు, శిఖిముఖి.

''ఆకాశదేవర మీద ఒట్టేస్తున్నాను, సరా?'' అంటూ భూతాలరాయుడు మెళ్ళో వున్న ఎముకల దండను కళ్ళకద్దుకున్నాడు.

''అలా అయితే ఆ దండను నా దగ్గిర యిచ్చిపో. నువ్వు చెప్పినట్టు చేస్తే, ఆ తరవాత దాన్ని నీకు తిరిగి యిచ్చేస్తాను,'' అన్నాడు శిఖిముఖి, ఎముకల దండను చేత్తో గట్టిగా పట్టుకుని.

భూతాలరాయుడు లబలబ లాడిపోతూ, ''ఈ మహత్తు గల దండలోనే వుంది, నా మంత్రశక్తంతా! అది మెళ్ళో లేకపోతే నేను పిల్లిగవ్వకు మారను. చెంచులంతా నన్ను కొండగవ్వలాని కన్న హీనంగా చూస్తారు,'' అన్నాడు.

''సరే, అడినమాట తప్పవుగదా? జాగ్రత్త. మోసం చేయాలని ప్రయత్నించావే, ఏన్నడో ఒకనాడు పట్టుకుని పెద్దపులికి ఆహారంగా వేస్తాను,'' అన్నాడు శిఖిముఖి.

''మూడు కోట్ల కొండదయ్యాలూ, ఆరు కోట్ల అరణ్యభూతాలూ సాక్షిగా చెపుతున్నాను, నేను అన్నమాట నిలబెట్టుకుంటాను,'' అన్నాడు భూతాలరాయుడు.

''అలా అయితే, నువ్వు మీ ఆకాశ గుహకు వెళ్ళిపో. నాగుమల్లికి ఎలాంటి హానీ జరక్కుండా చూడు. ఈ బోను సంగతి నే చూస్తాలే,'' అన్నాడు శిఖిముఖి.

''చిత్తం, అలాగే పోతాను. అసలు నేను ఎక్కువగా వుండేది యీ అరణ్యంలోనే. ఆ కనబడే మాను వెనకే నా గుడిసె వున్నది.







సెలవు," అంటూ భూతాలరాయుడు అక్కణ్ణించి బయలుదేరాడు.

శిఖిముఖి చెట్టెక్కి భూతాలరాయుడు ఎటు పోతున్నదీ పరీక్షగా చూసి, వాడు ఆకాశగుహ కేసే పోతున్నట్టు తెలుసుకుని, చెట్టుదిగి వచ్చాడు. తరవాత అతను మేకను బోనులో కట్టివేసి, అంతవరకూ రహస్యంగా చెట్టు మీదవున్న శబరుణ్ణి కేకవేశాడు. వాడు చెట్టుదిగి రాగానే, శిఖిముఖి వాణ్ణి వెంట బెట్టుకుని, భూతాలరాయుడు చెప్పిన గుడిసెలో ఏమున్నదో చూసేందుకు వెళ్ళాడు.

గుడిసెలో శిఖిముఖికి కొన్ని పులితోళ్ళూ, ఎలుగుచర్మాలూ గోడకు వేళ్ళాడుతూ కనిపించినై. నడిమింటి గుంజకు వున్న కొయ్య మేకులకు కొన్ని కపాలాలు తగిలించబడి వున్నయి. శిఖిముఖి వాటిని పరీక్షించి చూసి, ఒక పులితోలునూ, ఒక కపాలాన్నీ తీసుకున్నాడు. రాత్రికి చెంచుమఠా వుండే ప్రాంతానికి వెళ్ళినప్పుడు, వాటితో కొంత అవసరం కలగవచ్చునన్న ఆలోచన అతడికి కలిగింది.

సూర్యాస్తమయానికి కొంచెం ముందుగా విక్రమకేసరి యాభై అరవైమంది అనుచరులతో శిఖిముఖి వున్నచోటుకు వచ్చాడు. వాళ్ళల్లో సవరలూ, శబరులూ కూడా వున్నారు. శిఖిముఖి, విక్రమకేసరికి అతడు లేనిసమయంలో జరిగినదంతా చెప్పి, "ఆ దయ్యాలపోతు అన్నమాట నిలబెట్టుకుంటాడన్న పూర్తి నమ్మకం నాకున్నది. అందువల్ల మనం అయిదారుగురం రాత్రికి వాళ్ళ గుడిసెల్లో దూరబడి నాగుమల్లిని విడిపించుకు రావచ్చు. అలాకాక మనం గుంపుగా వెళ్ళి వాళ్ళ మీద దాడి చేస్తే, అనవసర రక్తపాతమే కాక, కోపంకొద్దీ చెంచులు నాగుమల్లి కేదైనా హాని కలిగించవచ్చు," అన్నాడు.

"ఈ ఆలోచన బాగుంది. ఒకటి మాత్రం మరిచిపోకు. మన ప్రధాన శత్రువు శిఖి





లాలయ పూజారి! వాడే యీ దుర్మార్గాల కన్నిటికీ కారకుడు. వాడి సంగతే నీవు మరిచినట్టున్నది," అన్నాడు విక్రమకేసరి.

"వాణ్ణి పట్టుకునే ప్రయత్నంలోనే గదా, మనం యీ చిక్కులో పడింది. వాణ్ణెలా మరుస్తాను? వాడీ రాత్రి కంటబడ్డాడో నూకలు చెల్లినవాడికిందే లెక్క!" అన్నాడు శిఖిముఖి పళ్ళుకొరుకుతూ.

ఆ తరవాత వాళ్ళిద్దరూ కొంతసేపు సంప్రతింపులు జరిపి, మొత్తం అనుచరుల్ని వెంటబెట్టుకుని ఆకాశగుహ ప్రాంతానికి వెళ్ళేట్టూ, అక్కడికి చేరిం తరవాత ఒక పదిమందితో మాత్రం ముందుగా చెంచుల గుడిశెల దగ్గిరకు పోయి, పరిస్థితుల్ని బట్టి అవసరం అయితే తతిమ్మావాళ్ళ సహాయం కూడా తీసుకునేట్టూ నిర్ణయించుకున్నారు.

సూర్యాస్తమయం అవగానే అందరూ అరణ్యమార్గాన చెంచుల నాయకుడుండే కొండప్రాంతానికి బయలుదేరారు. ఒక పావుగంట కాలం గడిచేసరికి వాళ్ళకు వెనక వైపునుంచి పులి పెద్దగా గాండ్రించిన ధ్వని వినబడింది. ఆ ధ్వని వింటూనే అందరికన్న ముందు నడుస్తున్న శిఖిముఖి ఆగి, "దయ్యాలపాదు పెట్టిన బోనులో పెద్దపులి పడినట్టుంది. మీలో అయిదారు గురు పోయి బోనుతో సహా దాన్ని లాక్కురండి. అవకాశం దొరికితే చెంచుల్ని కొండ మీది నుంచి కింది లోయల్లోకి గెంటిద్దాం," అని చెప్పాడు.

శిఖిముఖి యిలా చెప్పగానే, పదిపన్నెండు మంది శబరులు వెనుదిరిగి బోను దగ్గిరకు పరిగెత్తారు. అతడు వూహించినట్టు పెద్దపులి బోనులో చిక్కుకుని, బయటపడే మార్గం లేక పెద్దగా అరుస్తూ నానా హంగామా చేస్తున్నది. చిన్న కొయ్యచక్రాల మీద కట్టిన ఆ బోనును శబరులు తాళ్ళ సాయంతో, శిఖిముఖి వున్న చోటుకు యీడ్చుకుపోసాగారు. —(ఇంకా వుంది)






## 14

[పులిబోను దగ్గిర కాపలావేసి శిఖిముఖి, చెంచుదయ్యాలపోతును పట్టుకున్నాడు. యీ లోపల నాగుమల్లిని చెంచువాళ్ళు ఆకాశగుహకు తీసుకుపోయారు. దయ్యాలపోతు ప్రాణభయం కొద్దీ శిఖిముఖికి ఆకాశగుహ దగ్గిర సాయపడతానని మాటయిచ్చాడు. బోనులో పడిన పులిని కాళ్ళసాయంతో శబరులు యీడ్చుకు పోసాగారు. తరవాత—]

శిఖిముఖీ, విక్రమకేసరుల వెనకగా నడుస్తున్న శబరులూ, నవరలూ పులిబోను దగ్గిరకు రాగానే, దాని చుట్టూ మూగారు. వాళ్ళల్లో ఒకరిద్దరు ఈటెలతో దాన్ని బెదర కొట్టబోయేసరికి, పులి రెచ్చిపోయి పంజాలు బయటికి చాచి పెద్దగా గాండ్రించసాగింది. శిఖిముఖి వాళ్ళను వారించి పులిని ఓ సారి పరీక్షగా చూసి, తన భుజం మీద వున్న పులిచర్మాన్ని దాని కేసి వూపాడు. వెంటనే పులి బోనుమూలకు వెళ్ళి గుర్రుపెట్టుతూ వెనక కాళ్ళ మీద కూర్చున్నది.

"పులినే భయపెట్టే యీ పులిచర్మంతో మనం చాలా చాలా ఘనకార్యాలు చెయ్యొచ్చు. నా అనుమానం చెంచు దయ్యాలపోతు దీన్నేదో మంత్రించాడని," అన్నాడు శిఖిముఖి పెద్దగా నవ్వుతూ.

విక్రమకేసరి, శిఖిముఖి చేతిలో వున్న కపాలాన్నీ, పులిచర్మాన్నీ ఓ మారు తాకి







చూసి, ముఖంలో లేని బాధ కనబరుస్తూ, "వీటిని అంటుకుంటే నిప్పును అంటుకున్నట్టుగా చెయ్యి చుర్రుమన్నది. ఈ దయ్యాలపోతూ, శిథిలాలయ పూజారంత గొప్ప మంత్రవేత్తలా వున్నాడు," అన్నాడు. అతడి మాటలకు అనుచరులందరూ పొట్టలు చెక్కలయ్యేలా నవ్వారు.

తరవాత అందరూ అరణ్యమార్గాన కొంతదూరం పోయి, లోయలో నుంచి వున్న కాలిబాటల వెంట కొండ పైనున్న గుహ ప్రాంతానికి నడవసాగారు. పులిబోనును మిట్ట పైకి ఎక్కించటం శిఖిముఖి అనుచరులకు కొంత శ్రమగానే వున్నది. కాని, ఆ పులి ద్వారా తమ కులపెద్ద కొడుకు ఏదో సాహసకార్యం చేయబోతున్నాడని వూహించి వాళ్ళు ఉత్సాహంగా బోనును పైకి లాక్కుపోసాగారు. పులి చాలాసేపు గాండ్రించి, ఓపిక పోయి కొంతా, పరిసరాలకు అలవాటు పడి కొంతా — శాంతించి బోనులో ఒక మూల నక్కి కూర్చున్నది.

ఆకాశగుహ ప్రాంతం చేరగానే శిఖిముఖి, విక్రమకేసరులు తమ అనుచరుల్ని రెండు ముఠాలుగా విభజించారు. ఒక ముఠా వాళ్ళు తాము కొండ ఎక్కి వచ్చిన మార్గం నుంచి చెంచులు లోయలోకి పారిపోకుండా కాపలాకాయాలి. రెండవ ముఠా వాళ్ళు చెంచు గూడెం చుట్టూ వున్న కంచె దగ్గర వుండి, పరిస్థితుల్నిబట్టి లోపలికి దూకటమో లేక అక్కడే వుండి, బయటికి వచ్చే చెంచుల్ని బెదరకొట్టటమో చేయాలి. నాగుమల్లి తమ వశం అయేవరకూ, చెంచుల్తో ముఖాముఖి పోరు లేకుండా చూడాలని శిఖిముఖి అందర్నీ హెచ్చరించాడు. పులిబోను కంచె దగ్గిరగా వుంచబడింది.

చెంచు గూడెంలో అంతా కలిసి నలభై యాభై గుడిసెల కంటె ఎక్కువ వుండవు. వాటి చుట్టూ అయిదారడుగుల కంచె—బల









మైన కర్రలతో కట్టినది వున్నది. కంచె అవతల అక్కడక్కడా ఎత్తుగా పెరిగిన కొన్ని చెట్లున్నవి. వాటి కొమ్మలు కంచె మీదుగా వాలి, గూడెంలోకి దిగేందుకు అనువుగా వున్నవి. శిఖిముఖి, విక్రమకేసరి అలాంటి చెట్టు నొకదాన్ని ఎక్కి, కొమ్మ మీద కూర్చుని గూడెంలో రేగే కోలాహలానికి కారణం ఏమిటా అని చూడసాగారు.

బడేచెంచు నివసించేది, మామూలు గుడిసెలాంటిది కాదు. ఒక పెద్ద కొండ గుహను అతడూ, అతడి కుటుంబం ఇల్లుగా వాడుకుంటాడు. ఆ గుహ పక్కలనా, పైనా సున్నం పులిమి వాటి మీద రంగులతో రకరకాల బొమ్మలూ అవీ చిత్రించారు. ఆ గుహ ముందున్న ఖాళీ జాగాలో పెద్ద పెద్ద నెగళ్ళు మండుతున్నవి. వాటి చుట్టూ చెంచు స్త్రీలూ, పురుషులూ చేరి పాడుతూ, నాట్యాలు చేస్తున్నారు. ఒక ఎత్తయిన కొయ్యదుంగ మీద కూర్చుని శిథిలాలయ పూజారి యిదంతా చూస్తున్నాడు. బడేచెంచు కొంచెం దూరంలో నిలబడి దయ్యాలపోతుతో ఏదో మాట్లాడుతున్నాడు.

"శిఖీ, యిదా ఆకాశగుహ? పేరు గొప్పగానే వుంది! ఈ గొడవంతా ఏమిటి?" అని అడిగారు విక్రమకేసరి, శిఖిముఖిని.

"ఏదో జాతర! మనం యిక్కడికి చేరేసరికి గూడెం అంతా సద్దుమణిగి వుంటుందని నేననుకున్నాను. నా పథకం అంతా పాడయింది. చెంచు దయ్యాలపోతు నేను చెప్పిన చోట నాగుమల్లిని వుంచాడో లేదో చూసి వస్తాను," అంటూ శిఖిముఖి కొమ్మ మీంచి దిగి, కంచె ద్వారం కేసి వెళ్ళాడు.

కంచె ద్వారం మూసి వున్నది. కాని, శిఖిముఖి దాన్ని గట్టిగా రెండుచేతులతో పట్టి తోసేసరికి కొంచెంగా తెరుచుకున్నది. అతను ఆ ఖాళీలోంచి లోపలికి పోయాడు. అక్కడికి దాపులనే ఒక చిన్న గుడిసె లాంటి చుట్టిల్లు అతడి కంటబడింది. లోపల









వెలుగు లేదు. దాని ముందు కాపలా వాడెవడూ అతని కంటబడలేదు. చెంచు దయ్యాలపోతు అన్నమాట ప్రకారం అందు లోనే, నాగుమల్లిని వుంచివుంటాడని శిఖిముఖి జాగ్రత్తగా గుడిసె దగ్గిరకు పోయి ద్వారానికి అడ్డంగా వున్న వెదురుతడికను తీసి, ఓ క్షణకాలం లోపల ఏమయినా అలికిడి అవుతుందేమో అని విని, అలాంటి దేమీ లేకపోవటంతో లోపల ప్రవేశించాడు.

గుడిసెలో ఎవరూ వున్నట్టు లేదు. అంతా చీకటిమయంగా వున్నది. శిఖిముఖి తన దగ్గిరున్న చెకుముకిరాయి కొట్టి దూది అంటించి, ఆ వెలుగులో గుడిసె అంతా పరీక్షించి చూశాడు. గుడిసెలో ఒక మూల అతడికి రెండు మూడడుగుల పొడవున్న తాళ్ళు కనిపించినై. వాటిని పరీక్షించి చూసిన మీదట, అవి నాగుమల్లిని బంధించేందుకు చెంచువాళ్ళుపయోగించిన వని అతడికి అర్థమైపోయింది. అంటే—నాగుమల్లిని కొంత కాలం వాళ్ళు యీ గుడిసెలోనే వుంచారన్నమాట. అయితే ఇప్పుడామెను ఎక్కడికి తీసుకుపోయివుంటారు? తనకు వాగ్దానం చేసిన విధంగా మల్లిని కంచెద్వారం దగ్గిర గుడిసెలో దాచిన దయ్యాలపోతు, ఏ కారణం వల్ల ఆమెను మరో చోటుకు మార్చారు?

శిఖిముఖి యిలా ఆలోచిస్తూ కాలం వృథా చెయ్యటం ప్రమాదకారణం అవుతుందనుకుంటూ, తిరిగి విక్రమకేసరి వున్న చోటుకు వచ్చి, తాను చూసినది అతడికి చెప్పి, "మనల్ని చెంచుదయ్యాలపోతు మోసం చేయటమో లేక అతణ్ణి మరొకడు మోసం చేయటమో జరిగింది," అన్నాడు.

"అలా అయితే మనం అందరం ఒక్కసారిగా కంచె దూకిపోయి చెంచుల్ని హత మార్చి, నాగుమల్లిని వాళ్ళే గుడిసెలో దాచారో వెతికి పట్టుకుందాం," అన్నాడు విక్రమకేసరి.







శిఖిముఖి ఓ క్షణం ఆలోచించి, "కేసరీ, నువ్వు చెప్పింది బాగానే వుంది కాని, చెంచుల్ని అంత తేలిగ్గా లొంగదీయటం సాధ్యమని నాకు తోచటంలేదు. వాళ్ళు సంఖ్యలో మనకన్న కాస్త ఎక్కువే వుంటారు. పైగా, మనం వాళ్ళ మీద దాడి ప్రారంభించగానే, వాళ్ళలో కొందరు నాగమల్లిని మరెక్కడికైనా ఎత్తుకుపోయి దాచొచ్చు. నేను లోగడే ఒక పథకం వేసి వుంచాను గదా," అంటూ కేసరికి పులి చర్మం, కపాలం చూపించాడు.



"ఏం చెయ్యబోతున్నావు? ఏమిటా పథకం?" అన్నాడు విక్రమకేసరి.

"ముందుగా మనం ఈ కంచెలోంచి పులి లోపలికి పోగలిగినంత దారి ఒకటి ఏర్పరిచి, దాన్ని బోనులో నుంచి సరైన సమయంలో బయటికి వదిలేందుకు సిద్ధంగా వుండాలి. ఈలోపల నేను లోపలికి పోయి, నాగమల్లిని వాళ్ళు ఎక్కడ దాచారో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాను. ఒక చెంచును రహస్యంగా దొరకపుచ్చుకో గలిగితే, వాణ్ణించి ఆ రహస్యం లాగవచ్చు," అన్నాడు శిఖిముఖి.

"నువు ఒంటరిగా పోవటం ప్రమాదం అవుతుందేమో!" అన్నాడు విక్రమకేసరి.

"అలాంటి భయం ఏమీ లేదు. ఈ పులి తోలూ, కపాలం వున్నవి గదా? ఏం జరుగుతుందో నువ్వే చూద్దువుగాని. ఈ లోపల నువ్వు పులిబోను ముందు కంచె నరికించి, దాన్ని చెంచుల మీదికి వదిలేందుకు సిద్ధం చెయ్యి. నేను కపాలాన్ని చెంచుల మీదికి విసిరివెయ్యటమే అందుకు హెచ్చరిక," అని చెప్పాడు శిఖిముఖి.

విక్రమకేసరి సరేనని తన అనుచరుల దగ్గిరకు పోయి, పులిబోను ముందున్న కంచెకర్రలను కింది నుంచి మూడునాలుగడుగుల ఎత్తువరకూ నిశ్శబ్దంగా నరికి వెయ్యమన్నాడు. ఈ లోపల శిఖిముఖి









కొమ్మల మీది నుంచి లోపలికి దిగి, చీకటి ప్రాంతాల్లో నక్కుతూ గుడిసెల కేసి పోసాగాడు. హఠాత్తుగా అతడికి తా నింతకు ముందు చూసిన గుడిసె ముందుకు ఒక చెంచు చిన్న దివిటీ తీసుకుని రావటం కనిపించింది.

దివిటీతో వచ్చిన చెంచు గుడిసె ద్వారాని కడ్డంగా వున్న తడికను తోసి లోపలికి వెళ్ళాడు. అదే అదనుగా శిఖిముఖి గుడిసె ముందుకు పరిగెత్తి, ద్వారం పక్కనే నిలబడ్డాడు. చెంచువాడు దివిటీతో లోపల అంతా వెతికి ఆశ్చర్యపడుతున్నవాడిలా కళ్ళింత చేసి, ఏదో గొణుగసాగాడు. శిఖిముఖికి వాడు అక్కడికి రావటం నాగుమల్లి కోసమన్న అనుమానం కలిగింది. వెంటనే అతడు పిల్లిలా నిశ్శబ్దంగా గుడిసె లోపలికి పోయి, వెనక నుంచి చెంచువాడి మీదికి ఎగిరి, వాడి కంఠాన్ని ఎడమచేత్తో వెనక్కి విరిచిపట్టుకుని, కుడిచేత్తో నోరు మూసి, "బతకదలిస్తే అరవకు!" అన్నాడు బుసకొడుతున్నట్టు.

చెంచువాడి చేతిలోంచి దివిటీ కింద పడిపోయింది. విడిపించుకునేందుకు వాడే మాత్రం పెనుగులాడకుండా, శవంలా బిగదీసుకుపోయాడు. శిఖిముఖి వాడి మెడపట్టు వదిలి, చిన్న గొంతుతో, "నువ్విక్కడికెందుకు వచ్చావు?" అని ప్రశ్నించాడు.

చెంచువాడు కళ్ళింత చేసి, ఏదో భూతాన్ని చూసినట్టుగా శిఖిముఖి కేసి ఓమారు చూసి వణికిపోతూ, "సవర నాగుమల్లిని మా బడేదొర తీసుకురమ్మన్నాడు. అందుకోసం వచ్చాను," అన్నాడు.

"నాగుమల్లిని ఇక్కడ దాచినట్టు మీ దొరకు ఎవరు చెప్పారు?" అని ప్రశ్నించాడు శిఖిముఖి.

"భూతాలదొర!" అన్నాడు చెంచు.

"మరి నాగుమల్లి ఏమయింది? నిజం చెప్పు. అబద్ధమాడావో చంపేస్తాను,"





అంటూ శిలీముఖి నడుం నుంచి వేలాడుతున్న చురకత్తిని పైకెత్తాడు.

"నన్ను చంపకు, దొరా! నేను బడే చెంచు మనిషిని కాదు; భూతాలదొర సొంత నౌకర్ని. ఆయన నాచేతే ఆ మల్లిని ఇక్కడ రహస్యంగా దాయించి, కంచె ద్వారాన్ని ఊరికే దగ్గిరకి చేరవేసి ఉంచమన్నాడు. చెప్పినట్టే చేశాను," అన్నాడు చెంచు.

"భూతాల దొర యిలా ఎందుకు చేశాడో, తెలుసా?" అని అడిగాడు శిలీముఖి.

"బాగా తెలీదు. నవరమల్లిని, ఆకాశ దేవరకి పూజారిణ్ణి చేయబోతున్నానని అన్నాడు. ఆ మాట ఎవళ్ళతో అనొద్దన్నాడు. నే చెప్పేదంతా నిజం, నన్ను చంపకు, దొరా!" అంటూ చెంచు శిలీముఖి కాళ్ళ మీద పడబోయాడు.

శిలీముఖి వాణ్ణి వారించి, "అయితే పో. నన్ను చూసిన సంగతి మాత్రం ఎవరితోనూ అనకు, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

చెంచు వెళ్ళిపోయాడు. శిలీముఖి పులి తోలు మీద కప్పుకుని, కాళ్ళమీదా చేతుల మీదా నడుస్తూ, ఆకాశగుహకు దాపులనున్న గుడిసెల కేసి బయలుదేరాడు. అంతలో బడేచెంచు వాళ్ళున్న ప్రాంతాన పెద్ద గలభా లేచింది. శిలీముఖి చీకటి మాటున దాగుతూ అటు వెళ్ళేసరికి, చెంచు



దయ్యాలపోతూ, శిథిలాలయ పూజారి తగువులాడుతున్నట్టు మాట్లాడుకుంటున్నారు. వాళ్ళిద్దరి పక్కనా బడేచెంచు, "మోసం! మోసం!" అంటూ కేకలు పెడుతున్నారు.

అసలీ గొడవకంతకూ కారణం తెలుసుకుందామన్న ఆదుర్దాలో శిఖిముఖి మరి కాస్త ముందుకు పోయేసరికి, అతడి మీద నెగళ్ళవెలుగు పడింది. వెంటనే ఒకరిద్దరు చెంచులు "పులి! పులి!" అని అరిచారు.

బడేచెంచూ, దయ్యాలపోతూ, పూజారీ చప్పున కదిలి ఆకాశగుహ కేసి పరిగెత్తారు. వాళ్ళని ఈటెతో కొట్టాలనే ఉద్రేకంలో శిఖిముఖి లేచి నిలబడ్డాడు. పులిచర్మం జారి కిందపడింది. పారిపోయే చెంచులు అది చూసి, "పులి కాదు! మనిషి!" అంటూ వెనుదిరిగి శిఖిముఖి కేసి రాసాగారు.

శిఖిముఖి ఒక్కొక్కడుగే వెనక్కు వేస్తూ, ఈటె పైకెత్తి కంచె కేసి బయలుదేరాడు. చెంచుల కేకలు విన్న బడేచెంచూ వాళ్ళు తిరిగి నెగళ్ళ దగ్గరకు పరిగెత్తుకు వచ్చారు. శిథిలాలయ పూజారి పట్టరాని కోపంతో పళ్ళు కొరికి, "ఆ పులివేషగాడెవరో నాకు తెలుసు! ప్రాణాలతో పట్టుకోండి!" అంటూ హుంకరించాడు.

చెంచువాళ్ళు ఈటెలు తీసుకుని శిఖిముఖి కేసి రాసాగారు. ప్రమాదం రానున్నదని గుర్తించిన శిఖిముఖి కపాలాన్ని పూజారి మీద పడేలా విసిరి, పెద్దగా ఒక కేక పెట్టాడు. మరుక్షణంలో విక్రమకేసరి బోనులో నుంచి వదిలిన పులి పెద్దగా గాండ్రిస్తూ, శిథిలాలయపూజారి వాళ్ళున్న వైపుకు దూకింది.

"పారిపోకండి. మరొక పులివేషగాడు. చంపండి!" అంటూ శిథిలాలయ పూజారి కేకలు పెట్టాడు. పులి ఎదురైన యిద్దరు చెంచుల్ని పంజాతో కొట్టి బడేచెంచూ, పూజారి వున్న దిశకు దుప్పించి దూకుతూ పోసాగింది. —(ఇంకా వుంది)





# శిథిలాలయం

## 15

[శిఖిముఖి అతని అనుచరులూ ఆకాశగుహ ప్రాంతం చేరేసరికి, అక్కడ చెంచులు కోలాహలంగా నాట్యాలు చేస్తున్నారు. నాగుమల్లి బంధించబడిన గుడిసెలో శిఖిముఖికి చెంచు నాయకుడు పట్టుబడ్డాడు. శిఖిముఖి పులిచర్మం కప్పుకున్నాడు. శిథిలాలయ పూజారి అది గ్రహించగానే, విక్రమకేసరి పులిని బోను నుంచి వదిలాడు. తరవాత.—]

ఈసారి తమ మీదికి వస్తున్నది. నిజమైన పులి అని శిథిలాలయ పూజారికీ, బడే చెంచుకూ తెలిసిపోయింది. పులి ఆ సరికే నలుగు రైదుగురు చెంచుల్ని పంజా దెబ్బలతో పడగొట్టింది. ఇక అక్కడ వుండటం ప్రమాదం అని తెలుసుకుని శిథిలాలయ పూజారి, ఆకాశగుహ పక్కనున్న కొండ అంచు కేసి పరిగెత్తసాగాడు. బడేచెంచు తన గుహ కేసి పారిపోతూ, అనుచరుల నుద్దేశించి, "చచ్చు వెధవల్లారా! పులిని చూసి భయపడుతున్నారా? నెగళ్ళలో మండే కట్టెలు తీసుకుని ఎదుట తిరగండి!" అని కేకలు పెట్టాడు.

చెంచులు తమ నాయకుడు చెప్పినట్టే భగభగ మండే కట్టెపుల్లలు తీసుకుని పులి మీదికి పరిగెత్తారు. నిప్పంటే భయపడని అడవి మృగం వుండదు. పులి మంటలు చూస్తూనే బెదురుకుని వెనుదిరిగింది.



ఇంతలో శిథిలాలయ పూజారి పెద్ద గొంతుతో, "ఎక్కడ్రా, ఖేమండం! తొరగా వచ్చి చావు," అంటూ అరిచాడు.

పులి ప్రవేశంతో ఆకాశగుహ ముందు రేగిన గందరగోళంలో శిఖిముఖి, పూజారి ఎటు పరిగెత్తి పోతున్నదీ గమనించ లేదు. బడేచెంచు అందుబాటులో వున్నట్టు కనబడేసరికి, అతడు అటు కేసి పరిగెత్తాడు. శిఖిముఖి మీద ఒక కన్ను వేసి వుంచిన పూజారి, యిది చూస్తూనే తన నౌకర్ను గట్టిగా కేకపెట్టి పిలిచాడు.

"పూజారిదేవా, యిక్కడున్నాను, వచ్చే వచ్చే!" అంటూ సవరఖేమండం శిథిలాలయ పూజారి దగ్గిరకు పరుగు పరుగున వచ్చిచేరాడు.

"ఇక్కడ మనం వచ్చిన పని తీరిపోయింది. ఇక మన ప్రయాణం బ్రహ్మపుత్రా నదీ లోయలకే," అంటూ పూజారి కొండ అంచు కేసి కదిలాడు.

"అయితే, యీ ఖేమండాన్ని ఆకాశంలోకి ఎగరమని తమ సెలవా?" అన్నాడు సవరఖేమండం.

"ఈ కటిక చీకటిలో పైకెగరటం ప్రమాదం, ముందు లోయలోకే దిగిపోవాలి. చాప చుట్టి గట్టిగా కట్టావా? తాటి మోకును నే చెప్పిన కొండ రాతికి బలంగా బిగించావా?" అని అడిగాడు శిథిలాలయ పూజారి.

"తమ ఆజ్ఞ ప్రకారం అంతా సిద్ధపరిచి వుంచాను. కొండ కింది లోయలోకి ఎగిరి పోదామంటావా, దేవా?" అన్నాడు సవర ఖేమండం.

"అలాంటి పిచ్చి పని చెయ్యకు, కాళ్లూ చేతులూ విరిగి చస్తావు. మోకు సాయంతో నేను ముందుగా లోయలోకి దిగుతాను. నువ్వు చాప చుట్టను ఎత్తుకుని కాస్త వెనకగా దిగు," అన్నాడు పూజారి.

ఇద్దరూ కొండ అంచుకు పోయారు. అక్కడ ఒక పెద్ద రాతికి బలమైన మోకు







ఒకటి కట్టబడి వున్నది. రాతి పక్కన తాళ్ళతో కట్టబడిన చాప చుట్ట ఒకటి వున్నది. అందులో బంధించబడి వున్నది నాగుమల్లే! ఆమె తల మాత్రం బయిటికి కనబడుతున్నది. అరవకుండా వుండేందుకు ఆమె నోటికి అడ్డంగా ఒక వస్త్రం ముక్క బిగించారు.

శిధిలాలయ పూజారి, నాగుమల్లి కేసి ఓ మారు చూసి, తృప్తిగా తలాడించి రాతి దగ్గిరకు పోయి మోకును లాగి చూశాడు. తరవాత భేరుండం కేసి తిరిగి, "మోకు లోయలోకి దిగేందుకు సరిపడా వున్నదా?" అని ప్రశ్నించాడు.

"లోయలోకేంటి, దేవా! నువ్వు శాస్త్ర మంత్రం ప్రయోగిస్తే అది బ్రహ్మపుత్రానది ఉత్తరం గట్టునే తాకేస్తుంది," అన్నాడు భేరుండం.

"ఈ రాత్రి తాగొద్దని చెప్పానే, తాగావా? ఏవిటా పిచ్చి మాటలు! నోరు మూసుకుని, ఆ చాప చుట్ట ఎత్తుకుని, నా వెనగ్గా లోయలోకి దిగు," అంటూ శిధిలాలయ పూజారి తాడు పట్టుకుని, కొండ మీంచి లోయలోకి దిగసాగాడు.

సవర భేరుండం చేతుల్ని పైకి కిందికి ఓ సారి వూపి, "అంతా పూజారిదేవుడి



ఆజ్ఞ," అంటూ నాగుమల్లి కట్టబడి వున్న చాప చుట్టను భుజానికి ఎత్తుకోబోయేంతలో, ఆకాశగుహ వైపు నుంచి పెద్ద రణగొణ ధ్వని వినిపించింది.

భేరుండం చిటుకు చిటుకు మంటూ ఆకాశగుహ కేసి ఓ క్షణకాలం చూసి, "పూజారి దేవా! ఆ శిఖిముఖి వాళ్ళు, మన బిడేచెంచు మీద దాడి చేస్తున్నట్టున్నది. మనం చెంచుకు సాయంపోవద్దా?" అన్నాడు.

"ఆ చెంచు చవటకు సాయం పోవటమా? ఛీ, నోరు మూసుకుని త్వరగా రా. ఆ చెంచు వెధవ, నే చెప్పిన పని ఒక్కటి సక్రమంగా చేయలేకపోయాడు. వాణ్ణి









ఆ దయ్యాలపోతు మోసం చేస్తే, నేను వాళ్ళిద్దర్నీ మంత్రశక్తితో బుద్ధిహీనుల్ని చేసి, నాగుమల్లిని వశం చేసుకున్నాను. ఇక వాళ్ళనీ వాళ్ళనీ కొండ మీంచి దూకి చావనియ్," అన్నాడు శిథిలాలయ పూజారి.

"పాపం, బడేచెంచు మంచివాడు! అతడికి శిఖిముఖి చేతుల్లో చావు రాసిపెట్టి వున్నదిగామాలు!" అని ఓసారి గట్టిగా గొంతు సవరించుకుని సవరభేరుండం, నాగుమల్లిని వీపుకు వేలాడవేసుకుని మోకు సాయంతో లోయలోకి దిగసాగాడు.

సవరభేరుండం ఊహించినట్టే ఆకాశ గుహ ముందు శిఖిముఖి అతడి అనుచరులూ, బడేచెంచుతోపాటు అతడి ముఠా వాళ్ళను చుట్టుముట్టారు. ఆ ప్రయత్నంలో చెంచుల్లో ఇద్దరుముగ్గురు బాగా గాయపడ్డారు కూడా. సాధ్యమైతే ఎలాంటి రక్తపాతం లేకుండా చెంచుల్ని లొంగదీసుకుని, నాగుమల్లిని బంధవిముక్తురాల్ని చేసి తీసుకుపోవా లనుకున్న శిఖిముఖి, బడేచెంచుతో, "మీవాళ్ళ నందర్నీ ఆయుధాలు కింద పడవేయమని చెప్పు. అలా చేస్తే మీలో ఎవరికీ హాని కలిగించను. నాక్కావలసింది సవరనాయకుడి కూతురు నాగుమల్లి," అన్నాడు.

"నాగుమల్లినే కాదు, శిథిలాలయ పూజారిని కూడా మా వశం చెయ్యాలి," అన్నాడు విక్రమకేసరి ఈటెను బడేచెంచు కేసి గురి చేస్తూ.

బడేచెంచు గడగడ వణికిపోతూ, "ఇందులో నా తప్పేమీ లేదు. ఏదో దురాశ కొద్దీ దబ్బాశ పడి నాగుమల్లిని పట్టి తెచ్చాను. ఆవిడ తండ్రి చాలా డబ్బున్న వాడని విన్నాను. కాని చివరికిట్లా జరిగింది!" అన్నాడు.

"జరగబోయే దానితో పోలిస్తే, యీ జరిగింది నీకు సన్మానం కింద లెక్క. ముందు చెప్పు, ఆ పూజార్నీ, నీ దయ్యాల





పోతునూ ఎక్కడ దాచావ్?" అంటూ విక్రమకేసరి, బడేచెంచు కేసి రెండడుగులు వేశాడు.

బడేచెంచు మరింతగా వణికిపోతూ ఏదో అనబోయేంతలో, కంచె ప్రాంతాల్నించి, దయ్యాలపోతు ఏడ్పుగొంతుతో, "ఈ పులి మాటే అందరూ మర్చినట్టుంది. బాబులూ, వచ్చి సాయపడండి! అది నా గొంతు కొరికేందుకు చూస్తున్నది," అని కేక పెట్టాడు.

దయ్యాలపోతు కేక వింటూనే విక్రమకేసరి ఇద్దరుముగ్గురు అనుచరులతో కంచె దగ్గిరికి పరిగెత్తాడు. పులి కంచె కానుకుని నిలబడి వున్నది. చెంచు దయ్యాలపోతు మోకాళ్ళ మీద కూర్చుని, ఆరిపోవటానికి సిద్ధంగా వున్న ఒక నిప్పుకట్టెను దాని కేసి వూపుతున్నాడు. పులి మీదికి దూకేందుకు కోరలు చాచి గుర్రు పెడుతున్నది.

"ఈ దయ్యాలపోతును తెల్లారింతర్వాత పులికి ఆహారంగా వేద్దాం. ప్రస్తుతానికి యితడితో మనకు పని వున్నది. మీరు రెండుమూడు మండేకట్టెలు తెండి. పులిని మెల్లిగా తరిమి బోనులోకి పంపుదాం," అన్నారు విక్రమకేసరి.

విక్రమకేసరి యిలా అనగానే శబరులు నెగళ్ళ దగ్గిరకు పరిగెత్తిపోయి బాగా







మండుతున్న కర్రలతో తిరిగి వచ్చారు. విక్రమకేసరి, దయ్యాలపోతు పారిపోకుండా ఒకస్నితనికి కాపలా పెట్టి, రెండు చేతుల్లో రెండు మండుతున్న కర్రల్ని పట్టుకుని పులిని సమీపించాడు. పులి పెద్దగా ఓసారి గాండ్రించి, వెనుదిరిగి కంచెవారగా నడవ సాగింది. అది కంచె ఆవతల బోను వున్న ప్రదేశం చేరగానే, ఒకడు దాన్ని రెండవ వైపు నుంచి అటకాయించాడు. పులి పంజా సాచి ఆతని మీద దూకబోయినదల్లా, భయ పడి బోనులో దూరబడింది. వెంటనే విక్రమ కేసరి కంచె పైకెక్కి బోను తలుపును దఢీ మంటూ మూసేశాడు.

విక్రమకేసరి, చెంచు దయ్యాలపోతు దగ్గరకు తిరిగి వచ్చేసరికి, వాడు జుట్టు పీక్కుంటూ మతిపోయిన వాడిలా గొణుక్కుంటున్నాడు. విక్రమకేసరి కాపలా వున్న శబరవాణ్ణి పక్కకు పిలిచి, "ఏమిటి వాడు వాగేది? పారిపోవాలని ఏమైనా ప్రయత్నం చేశాడా?" అని అడిగాడు.

"దయ్యాలపోతుకు పిచ్చెక్కిందని నా కనుమానం కలుగుతున్నది, దొరా! పూజారి గాడెక్కడ అని అడిగితే, నా మాట విని పించుకోకుండా, 'వాడెత్తుకు పోయాడు, చావు తప్పదు, పులివాత పడక తప్పదు,' అంటూ ఒకే వరసన గొణుగుతున్నాడు," అన్నాడు శబరుడు.

విక్రమకేసరి, దయ్యాలపోతును భుజం పట్టుకుని కుదిలించి, "ఆ గొణుగుడు మాని, నిజం చెప్పు. ఎత్తుకుపోయిం దెవర్ని? చావు తప్పం దెవరికి? నాగుమల్లిని ఎక్కడ దాచావు?" అని ప్రశ్నించాడు.

దయ్యాలపోతు ఆ ప్రశ్నతో ఈ లోకం లోకి వచ్చినవాడిలా విక్రమకేసరిని నిలువు గుడ్లేసుకుని ఓ క్షణకాలం చూసి, "నాగుమల్లిని నేను దాచిన గుడిసెలోంచి ఆ పూజారి ఎత్తుకుపోయాడు. నేను అన్న మాట తప్పానని శశిముఖి నన్ను పులికి











మెతగా వేస్తాడు...నాకు చావు తప్పదు," అన్నాడు బొంగురుగొంతుతో.

దయ్యాలపోతు మాటల్తో విక్రమకేసరికి, నాగమల్లిని శిథిలాలయ పూజారి ఆకాశ గుహ ప్రాంతం నుంచి చల్లగా మరెక్కడి కైనా దాటవేశాడేమో అన్న సంశయం కలి గింది. అతడు మారు మాటాడకుండా దయ్యాలపోతును మెడ పట్టుకుని బరబరా శశిముఖి వున్న చోటుకు లాక్కువచ్చి, అతడన్న మాటలు శశిముఖికి చెప్పాడు.

శశిముఖి పట్టరాని కోపంతో ఈటె పైకెత్తి, "దయ్యాలపోతూ, నీకు చావు తప్పదు. నువ్వూ, ఆ పూజారి దుర్మార్గుడూ తోడుదొంగలు. వాడి కోసం యీ చుట్టు పక్కల అంతా గాలించాం, కనిపించలేదు. నాగమల్లి కూడా కనబడటం లేదు. వాడు దాగే రహస్యస్థలం ఎక్కడ?" అన్నాడు.

"ఆ దుర్మార్గుడూ నేనూ బద్ధ శత్రు వులం, దొరబాబూ! ఆ సంగతి మా బడే చెంచుక్కూడా తెలుసు. నాగమల్లిని నువ్వు దాయుమన్న గుడిసెలోనే దాచాను. వాడూ, వాడి నౌకరూ చీకటి పడింతర్వాత ఒకటికి రెండుసార్లు కొండ అంచు కేసి పోవటం చూశాను. అక్క డేమన్నా..." అంటూ దయ్యాలపోతు ఆగిపోయాడు.

శశిముఖి, దయ్యాలపోతు మెడ పట్టు కుని, "త్వరగా రా. ఆ ప్రదేశం ఏదో చూపు," అన్నాడు తొందరపెడుతూ.

దయ్యాలపోతు కొండ అంచు కేసి గబ గబా నడిచాడు. అతని వెన్నంటి పోయిన శశిముఖి, విక్రమకేసరులకు శబరవాళ్ళు తెచ్చిన కాగడాల వెలుగులో, ఒక పెద్ద గండశిలా, దానికి కట్టివున్న బలమైన తాటి మోకూ కనిపించినై. శశిముఖి చప్పున వంగి మోకును బలంగా లాగి చూశాడు, అది బిగునుకుపోయి వుంది. అప్పు డతను తల వంచి దాన్ని చెవికానించుకుని కొద్ది సేపు విని "మోకు ఆధారంతో ఆ పూజారి



వాళ్ళు కొండ మీంచి లోయలోకి దిగిపోతున్నారు, అనుమానం లేదు," అన్నాడు.

"అలా అయితే ఒక్క వేటుకు మోకు నరకండి. ఆ నీచుడు కింది లోయలో రాళ్ల మీద పడి తల పగిలి చస్తాడు," అన్నాడు బడేచెంచు ఆ సమయాని కక్కడికి వచ్చి.

"చెంచూ! తొందరపడి అలాంటి బుద్ధి తక్కువ పని చేసేవు. అలా మోకు నరికితే చచ్చేది ఒక్క పూజారే కాదు, అతడి వెంట నాగుమల్లి కూడా వున్నది," అన్నాడు శిఖిముఖి. అతడు యిలా అనేంతలో చెంచుల్లో కొందరు తమ చేతుల్లో వున్న కాగడాలను లోయలోకి విసిరారు. వాటి వెలుగులో మోకు సాయంతో కిందికి దిగిపోతున్న శిథిలాలయ పూజారీ, నవరభేరుండం, అతడి భుజాన వేలాడుతున్న చాప చుట్టా— అందరికీ కనిపించినై.

"శిఖీ! ఇప్పుడేమిటి ఉపాయం? ఆ దుర్మార్గుడు నాగుమల్లితో కూడా మనకు కనిపించకుండా పారిపోయే ప్రమాదం వున్నది," అన్నాడు విక్రమకేసరి.

"నేనూ మరో మోకు సాయంతో వాడి వెంట బడతాను. ఈ వున్న మోకు నలుగురిని మోయలేక పోవచ్చు," అని శిఖిముఖి బడేచెంచుతో, "త్వరగా ఒక మోకు తెప్పించు," అని చెప్పాడు.

క్షణాల మీద చెంచులు ఒక మోకు తెచ్చారు. శిఖిముఖి దాని కొస ఒకదాన్ని గండశిలకు కట్టించి, మిగతా దాన్ని లోయలోకి జార్చి, దాని వెంట కిందికి దిగుతూ, "కాగడాలను పూజారి వాళ్లకు తగలకుండా కొంచెం దూరంగా విసరండి," అన్నాడు.

చెంచులు విసిరిన కాగడాల వెలుగులో శిథిలాలయ పూజారీ వాళ్ళు దాదాపు లోయ అడుగు భాగాన్ని చేరబోవటం శిఖిముఖికి కనిపించింది. వెంటనే అతడు మోకు వెంట సర్రుమంటూ వేగంగా లోయలోకి దిగసాగాడు.

—(ఇంకా వుంది)








# 16

[పెద్దపులి మీద పడటంతో, చెంచులు నెగళ్ళ దగ్గర నుంచి పారిపోయారు. ఎంత వెతికినా శిఖిముఖికి, నాగుమల్లి కనిపించ లేదు. శిధిలాలయ పూజారి ఆమెను తీసుకుని పారిపోయినట్టు చెంచు దయ్యాలపోతు అతడికి చెప్పాడు. మోకు సాయంతో కొండ మీది నుంచి లోయలోకి దిగి పోతున్న పూజారిని, శిఖిముఖి వెంబడించాడు. తరవాత—]

శిఖిముఖి లోయలోకి దిగేసరికి అతడికి పూజారిగాని, నాగుమల్లిని వీపుకు వేలాడ కట్టుకున్న గండభేరుండంగాని కనిపించ లేదు. వాళ్ళు అతడికన్న కొంచెం ముందుగా లోయలోకి దిగగలిగారు. శిఖిముఖి చుట్టూ కలయ చూసేంతలో అతడికి దూరంగా గుర్రం సకిలించిన ధ్వని వినబడింది. వెంటనే అతడు ఆ దిక్కు కేసి వేగంగా పరిగెత్తాడు. చీకట్లో క్రమంగా దూరమై పోతున్న గిట్టల ధ్వని తప్ప అతడికి గుర్రం కనిపించలేదు.

శిఖిముఖి నిరుత్సాహ పడిపోతూ, యిప్పు డేమి చేయటమా అని ఆలోచించేంతలో, మోకు సాయంతో లోయలోకి దిగిన విక్రమ కేసరి, అతణ్ణి "శిఖీ!" అని పిలిచాడు.

శిఖిముఖి ఆ పిలుపు వింటూనే అదిరి పడి, వెనక్కు తిరిగాడు. విక్రమకేసరి అతడి భుజంమీద చేయి వేసి చిన్న







గొంతుతో, "ఏం, ఆ దుర్మార్గుడు నీకు అందకుండా పారిపోయాడా?" అని ప్రశ్నించారు.

"అందకపోవటమే కాదు, వాడు నా కంటికే కనిపించలేదు. దూరాన గుర్రం పరిగెత్తిపోయిన శబ్దం మాత్రం విన్నాను," అన్నాడు శిఖిముఖి.

"వాడుగాని, ఆ భైరుండంగాని నాగుమల్లిని గుర్రం మీద వేసుకుని త్వరత్వరగా యీ ప్రదేశం వదిలి పారిపోయివుంటారు. అలా జరిగివుంటే మాత్రం ఆ పూజారిగాడికి యిక్కడ సహాయపడేందుకు మరికొందరు మనుషులు వుండి వుండాలి. లేకపోతే గుర్రం ఎక్కణ్ణుంచి వస్తుంది!" అన్నాడు విక్రమకేసరి.

"అంతే అయివుండాలి. మనం మాటలతో కాలయాపన చేయటం ఎందుకు. ఈ చుట్టుపక్కల వాళ్ళకోసం వెతుకుదాం. మనవాళ్ళందరూ కొంత దిగి వస్తున్నారు గదా?" అన్నాడు శిఖిముఖి.

"వస్తున్నారు. వాళ్ళు యిక్కడికి చేరేందుకు కొంత ఆలస్యం అవుతుంది. నువ్వు గుర్రం పరిగెత్తిపోయిన ధ్వని ఏ దిక్కుగా విన్నావు?" అని అడిగాడు విక్రమకేసరి.

శిఖిముఖి వున్న చోటు నుంచి కదిలి, అక్కడికి దాపుల వున్న చెట్లకేసి చేయి చూపాడు. ఇద్దరూ అటు కేసి నిశ్శబ్దంగా బయలుదేరారు. ఆ ప్రదేశం లోయకు కొంచెం ఎగువగా వున్నది. అంత చీకటిలోనూ చెట్ల మధ్య నుంచి సన్నని కాలిబాట ఒకటి వాళ్ళ కంట బడింది. ఆ బాట వెంట వాళ్ళు కొంతదూరం వెళ్ళేసరికి, బాటకు పక్కగా వున్న పొదల చాటు నుంచి చిన్న వెలుగు వాళ్ళకు కనిపించింది.

శిఖిముఖి, విక్రమకేసరికి ఆ వెలుగు చూపి, "ఎవరో ఆ పొదల వెనక నెగడు వేసుకుని కూర్చున్నట్టున్నది. అరణ్య







మృగాల భయంకొద్దీ, యీ ప్రాంతాల దొంగ
లైనా దొరలైనా రాత్రివేళల్లో నిప్పు ముందు
కాలక్షేపం చేయవలసిందే. వాళ్ళెవరో తెలుసు
కుందాం," అంటూ పొదల చాటునే
నక్కుతూ ముందుకు కదిలాడు.

శిఖిముఖి, విక్రమకేసరి ఆ నెగడు వున్న
చోటుకు దాపుల నున్న పొదల వెనక్కు
పోయేసరికి, వాళ్ళకు నెగడు ముందు ఇద్దరు
మనుషులు కనిపించారు. వాళ్ళ దుస్తుల
తీరూ అదీ చూస్తుంటే, వాళ్ళు అడవి
దొంగలలా వున్నారు. వాళ్ళు లోకం మాటే
మరిచి కాళ్ళ ముందు పరుచుకున్న వస్త్రం
మీద కుప్పగా పోసివున్న వెండి కాసుల్ని
లెక్కిస్తున్నారు.

శిఖిముఖి, విక్రమకేసరిని, ఆ దొంగల
వెనక వున్న పొదల చాటుకు వెళ్ళమని
చెప్పి, తాను పొదల చాటు నుంచి కత్తి
దూసి వాళ్ళ ముందుకుపోతూ, "ఉన్న
చోటు నుంచి కదలకండి, జాగ్రత్త!" అని
గట్టిగా హెచ్చరించాడు.

దొంగ లిద్దరూ అదిరిపడి, కత్తులు
దూయబోయిన వాళ్ళల్లా శిఖిముఖిని
చూస్తూనే ఓ క్షణకాలం తటపటాయించారు.
ఆ అదనులో విక్రమకేసరి పొదల చాటు
నుంచి వాళ్ళ వెనగ్గా వచ్చి నిలబడి, కత్తిని



వాళ్ళ కంఠాల మీద ఆడిస్తూ, "జాగ్రత్త,
కదలకండి!" అంటూ హుంకరించాడు.

దొంగలు ఆ హెచ్చరికతో కుక్కిన
పేనుల్లా అయిపోయారు. శిఖిముఖి వాళ్ళను
సమీపించి, ఒరల నుంచి కత్తులు లాగి
దూరంగా విసిరివేస్తూ, "శిథిలాలయ పూజారి
ఎక్కడ?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే దొంగల్లో ఒకడు
అమాయకుడిలా ముఖం పెట్టి, "శిథిలాలయ
పూజారా? ఆ పేరే వినలేదే!" అన్నాడు.

"ఆ పేరు వినటమేగాదు, ఆ దుర్మార్గుడి
నుంచే యీ వెండి కాసులన్నీ సంపా
యించారు. మోసం చెయ్యాలని చూడ









కండి," అని, విక్రమకేసరితో, "కేసరి! వీళ్ళ చేత నిజం చెప్పించటం ఏమంత కష్టం కాదు. పారిపోవాలని ప్రయత్నించిన వాణ్ణి నిర్దాక్షిణ్యంగా కత్తితో నరుకు," అని చెప్పి, దొంగల్లో ఒకడి తలను వున్న వస్త్రాన్ని లాగి, దానితో వాడి చేతులను వెనక్కు విరిచికట్టాడు శశిముఖి.

"ఇప్పుడు నిజం చెప్పబోతున్నారు, తెలిసిందా?" అని శశిముఖి నెగడు నుంచి కాలే కట్టె ఒకటి తీసుకుని, ఒక దొంగ వాడి కేసి ముందుకొక అడుగు వేశాడు.

రానున్న ప్రమాదాన్ని గుర్తించగానే దొంగ లబోమంటూ, "అయ్యా, నన్ను కాల్చి చంపకండి. ఆ పూజారి ఎక్కడున్నాడో తెలీదు. అతడికి ఒక గుర్రాన్ని అమ్మాం. ఆ డబ్బు పంచుకుంటున్నాం," అన్నాడు.

"నీకు తెలిసింది యింతే నన్నమాట. సరే, నీ స్నేహితుడికి మరికొంత తెలిసి వుంటుంది," అంటూ శశిముఖి కాలే కట్టెను రెండవ దొంగ మీదికి గురి చేశాడు.

ఈసారి ఆ రెండవ దొంగ ఒక చావు కేక పెట్టి, "అయ్యా, నన్ను కాల్చకు. అంతా నిజం చెబుతాను. ఆ పూజారి వెంట దుక్కలాంటి నౌకరొకడున్నాడు. వాడు దాపలో చుట్టి తెచ్చిన ఒక మనిషిని పూజారి గుర్రం మీద వేసుకుని అరణ్యంలోకి దౌడు తీశాడు. ఇంతే మాకు తెలిసింది," అన్నాడు.

"కాదు, మీకింకా చాలా తెలుసు. కేసరీ, నువ్వో ఒక నిప్పు కట్టె అందుకో," అన్నాడు శశిముఖి.

విక్రమకేసరి నెగడులో నుంచి బాగా మండుతున్న కట్టె పెద్దదాన్ని తీసుకుని మొదటి దొంగను సమీపిస్తూ, "వీపు కాల్చటం కంటె తల కాలిస్తే వీళ్ళకు మరి కాస్త సుఖంగా వుంటుంది," అని కట్టెను మొదటి దొంగ తలమీద పెట్టబోయాడు.

దొంగ గడగడ వణికిపోతూ, "అయ్యలారా, మమ్మల్ని హింసించకండి. ఇప్పుడు







మాకు తెలిసినదంతా చెప్పేస్తాం. ఆ పూజారీ, ఆతడి నౌకరూ మాట్లాడుకునేదాన్నిబట్టి, వాళ్ళు రాత్రికిరాత్రే బయలుదేరి బ్రహ్మపుత్రానదీ ప్రాంతాలకు వెళ్ళిపోతున్నట్టు తెలిసింది. సత్యం చెబుతున్నాను. ఆ పైన కొండదేవతే సాక్షి!" అన్నారు.

"శశీ, యీ వెధవలు బ్రహ్మపుత్రానది యీ పక్కన ఎక్కడో వున్నదను కుంటున్నారులావుంది. ఒళ్ళు కాలితే తప్ప నిజం చెప్పరు," అంటూ విక్రమకేసరి శశిముఖి చేతులో వున్న నిప్పు కట్టెను కూడా లాక్కొని, యిద్దరు దొంగల తలల మీదా ఆనించబోయాడు.

"మా కింతకన్నా ఏం తెలియదు. రక్షించండి," అంటూ దొంగలు గగ్గోలు ప్రారంభించారు. శశిముఖి, విక్రమకేసరిని వారించి, "వీళ్లు నిజంచెప్తున్నట్టే వున్నది. పాపం, నాలుగు రాళ్ళ కోసం గుర్రాన్ని ఆ పూజారికి అమ్మటం నేరం కింద జమ కట్టలేంకదా," అని, దొంగలతో, "సరే, ఇక మీ దారేదో మీరు చూడండి. ఒకవేళ మీ కెప్పుడైనా ఆ పూజారిగాని, నవర వాడు...వాడి పేరు ఖేదుండంగాడని కని పించితే, ఆ సంగతి కుంభారమిట్ట పల్లెలో చెప్పాలి. అలాచేయ్యక పోయారో మీ చర్మం వలిచి తీస్తాను," అన్నారు.

"అయ్యో, మీరు ప్రాణదాతలు. మాటిస్తున్నాం. ఆ పూజారి కనిపిస్తే ఆగమేఘాల మీద వచ్చి, మీ పల్లెలో ఆ సంగతి చెపుతాం," అన్నారు దొంగల్లో ఒకడు.

శశిముఖి అంగీకార సూచకంగా తలా డించి, విక్రమకేసరిని వెంట బెట్టుకుని చెట్లల్లోకి కొంతదూరం పోయి ఆగి, "కేసరీ, ఈ దొంగలు మనతో చెప్పకుండా దాచిన ముఖ్య రహస్యం ఒకటున్నదని నా కను మానం కలుగుతున్నది. పూజారికి గుర్రాన్ని అమ్మిన మాట నిజం. కాని, వాడెక్కడ వున్నదీ తమకు తెలియదనటం పూర్తి









అసాధ్యం. ప్రాణభయం పెట్టినా మనను వాళ్ళు అబద్ధాలతో పక్కదార్లు తొక్కించ వచ్చు. అందుకని, నేను వాళ్ళను వెంబ డించి ఎటుపోయేదీ తెలుసుకోదలిచాను. నువ్వు, యీ ప్రాంతాల్లోనే వుండి, మన వాళ్ళు రాగానే, వాళ్ళను నాలుగు దిక్కు లకూ పూజారిని వెతికేందుకు పంపి, యీ సమీపంలోనే నా కోసం కాచుకుని వుండు," అన్నాడు.

విక్రమకేసరి సరే నన్నాడు. ఆ వెంటనే శిఖిముఖి దొంగలున్న చోటుకు పోయాడు. అతడు పొదలచాటు నుంచి వాళ్ళేమి చేస్తున్నదీ చూసేంతలో దొంగలు డబ్బును రెండు చిన్న మూటలుగా కట్టి, నడుముకు వేలాడ వేసుకుని, పొదల్లో వెతికి, పోయిన కత్తుల్ని సంపాయించి, నవ్వుకుంటూ అరణ్యంలోకి వున్న కాలిబాట వెంట బయలుదేరారు. శిఖిముఖి నిశ్శబ్దంగా వాళ్ళను అనుసరించాడు.

విక్రమకేసరి చీకట్లో అటూ యిటూ పచార్లు చేస్తూ తన అనుచరుల రాకకోసం ఎదురు చూడసాగాడు. ఓ పావు గంట గడిచింది. హఠాత్తుగా అతడికి లోయ దిగువ ప్రాంతం నుంచి కుక్క అరవటం విన బడింది. ఆ అరుపు శిఖిముఖి వేటకుక్క ఎర్రగండుదని అతడు గ్రహించాడు. దాని అర్థం కుంభారమిట్ట నుంచి శివాలుడుగాని, లేక శిఖిముఖి బంధువుల్లో మరెవరైనాగాని అటువస్తున్నారన్నమాట.

అతడు చప్పున కదిలి కుక్క అరుపు వినబడిన వైపుకు నడవసాగాడు. కొద్ది సేపట్లోనే అతడికి లోయ పైకి ఎక్కి వస్తున్న శివాలుడూ, గండుపోతూ వాళ్ళ వెంట నలుగు రైదుగురు శబర సవర వాళ్ళూ కనిపించారు. ఒక శబరుడు ఎర్రగండు మెడ నున్న తాడు పట్టుకుని వున్నాడు. కుక్క తాడును గుంజుతూ ముందుకు పరిగెత్తాలని పెనుగులాడుతున్నది.





శివాలుడు, విక్రమకేసరిని చూస్తూనే, "కేసరీ, క్షేమంగా వున్నావా? శిఖి ఎక్కడ? నాగుమల్లిని ఆ దుర్మార్గుడైన పూజారి ఎత్తుకు పోయిన మాట నిజమా?" అని ప్రశ్నించాడు.

విక్రమకేసరి జవాబు చెప్పబోయేంతలో, నవరగండుపోతు పెద్దగా గొంతెత్తి, "ఆ పూజారి నీచుణ్ణి ప్రాణాలతో చర్మం ఒలిపిస్తాను. వా డెక్కడ?" అన్నాడు ఆవేశ పడిపోతూ.

శివాలుడు అతడి భుజం పట్టుకుని, "తొందరపడకు, గండుపోతూ! ముందు సంగతి సందర్భాలు తెలుసుకోనీయ్," అన్నాడు శాంతపరుస్తూ.

విక్రమకేసరి తాము అరణ్యంలో ప్రవేశించి, బడేబెంచు నివసించే ఆకాశగుహ చేరటం, అక్కడ జరిగిన గొడవలూ—అన్నీ టూకీగా చెప్పి, చివరకు శిఖిముఖి దొంగలను అనుసరించి పోవటం సంగతి తెలియపరిచాడు.

"ఒంటరిగా ఆ అడవి దొంగలను వెంబడించటంలో కొంత ప్రమాదం వున్నా, శిఖిముఖి తెలివైన పనే చేశాడు. ఏమైనా యీ చీకట్లో ఆ పూజారిని పట్టుకోవటం సాధ్యమయే పని కాదు. తెల్లవారిం తరవాత ఈ అరణ్యాలూ, కొండలూ వాడికోసం గాలించవలసి వున్నది," అని, శివాలుడు గండుపోతుతో, "నువ్వేమీ దిగులు పడకు. నాగుమల్లి ఆ దుర్మార్గుణ్ణించి స్వశక్తితోనే బంధవిముక్తురాలు కాగలదని నా నమ్మకం. అలా జరగకపోయినా, పూజారి మన వలలో చిక్కకుండా పోడు," అన్నాడు.

శివాలుడు మాట ముగించీ ముగించక ముందే, లోయ పక్కనే వున్న ఒక ఎత్తయిన ప్రదేశం నుంచి భగభగ మండుతున్న దివిటీ కనిపించింది. ఎవరో దాన్ని గాలిలో వూపుతున్నారు. శివాలుడూ అతడి వెంట వున్నవాళ్లూ అటు కేసి చూసేంతలో, సన్నని ఈల వినిపించింది. —(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 17

[శిథిలాలయ పూజారి తన బంటు నవరత్నకేయూరుడి సాయంతో, నాగమల్లిని అపహరించి, పారిపోయారు. ఆ సమయంలో శిఖిముఖి, పూజారికి గుర్రాన్ని అమ్మి పారిపోయిన దొంగలు కనిపించగా, వాళ్ళను వెన్నంటి పోయారు. శివాలుడూ, గంధుపోతూ లోయలోకి వచ్చారు. వారికి దూరం నుంచి ఎవరో ఈలవేస్తున్న ధ్వనివినిపించింది. తరవాత—]

శివాలుడు దివిటీ వెలుగు కేసి ఓ క్షణకాలం చూసి, తన అనుచరులతో, "దివిటీని గాలిలో అల్లల్లాడిస్తున్న వాడెవడు? ఆ ఈల లోగడ ఎక్కడో విన్నట్టున్నదే," అన్నాడు ఆశ్చర్యపడుతూ.

అప్పుడు భటుల్లో ఒకడు శివాలుడితో, "దొరా, ఆ దివిటీ కనబడుతున్న చోటున బడేబెంచు వేటకు వచ్చినప్పుడు విశ్రాంతి తీసుకునే పాక ఒకటి వున్నది. చీకటి పడే వేళ నేను అటు నుంచే వచ్చాను. ఆ సమయంలో ఎవరూ అక్కడ లేరు," అన్నాడు.

దివిటీని శివాలుడూ వాళ్ళున్న వైపుకు రమ్మన్న సూచనగా పైకీ కిందికీ ఊపుతూ, వాడెవడో మరింత బిగ్గరగా ఈల వేయ సాగాడు. శివాలుడు, గంధుపోతుతో మాట్లాడి, అనుచరులతో, "వాడెవడో గాని మననే పిలుస్తున్నట్టున్నది. పోదాం పదండి," అంటూ బయలుదేరాడు.







శివాలుడూ వాళ్ళు పాకను సమీపించేంతలో, దివిటీ పట్టుకున్నవాడు ఈలలు వేయటం మాని పాక లోపలికి వెళ్ళిపోయాడు. శివాలుడు పాకను సమీపించి చూసేసరికి దాని వెదురుకర్రల తలుపు మూయబడి వున్నది. లోపల వెలుగుతున్న దివిటీ కాంతి కిటికీ లోంచి బయటికి పడుతున్నది.

శివాలుడు తలుపు దగ్గరకు పోయి దాన్ని గట్టిగా తడుతూ, "ఎవరూ లోపల? తలుపు తెరవండి!" అన్నాడు.

లోపలి నుంచి జవాబు లేదు. శివాలుడు తలుపును గట్టిగా తోశాడు. అది కిర్రుమంటూ తెరుచుకున్నది. లోపల ఒక కొయ్యబల్ల మీద శిథిలాలయ పూజారి కూర్చుని వున్నాడు. అతడు శివాలుణ్ణి చూస్తూనే వికృతంగా నవ్వి, "ఓహో, కులపెద్ద లంతా కలిసికట్టుగా వచ్చినట్టుందే! స్వాగతం అనక తప్పదు గదా? లోపలికి రండి." అన్నాడు.

పూజారి ధైర్యం, తెగువతనం చూసి శివాలుడు నిర్విణ్ణుడయిపోయాడు. నవర గండుపోతు పెద్దగా హుంకరించి కత్తి ఝళిపిస్తూ పూజారి కేసి దూకబోయాడు.

శివాలుడు, గండుపోతును భుజం పట్టుకుని ఆపి, "తొందరపడకు, పోతూ! మన చేతిలో చిక్కిన యీ దుష్టుడు మరెక్కడికీ పారిపోలేడు," అన్నాడు.

గండుపోతు ఆ మాటలతో కాస్త కాంతించాడు. కాని, అతడి కళ్ళు నిప్పులు చెరుగుతున్నవి. ఏమాత్రం వీలు దొరికినా పూజారిని కత్తితో రెండుగా నరకాలన్న ఉద్రేకంలో వున్నా డతను.

శివాలుడు, శిథిలాలయ పూజారిని సమీపించి, "మా అందరికీ ఎంతో కష్టనష్టాలు కలిగించటమే గాక; నవరపెద్ద కుమార్తెను కూడా నువ్వు అపహరించుకు పోయావు. అలాంటి నువ్వు యింత ధైర్యంగా మా







మధ్యకు రావటం నాకు ఆశ్చర్యాన్ని కలిగి
స్తున్నది," అన్నాడు.

శిథిలాలయ పూజారి ఆ మాటలకు వికవిక
మంటూ నవ్వి, "నువ్వు గండుపోతు కన్న
ఎన్నో రెట్లు వివేకవంతుడివి, నా శక్తిసామ
ర్థ్యాలు ఎలాంటివో యిప్పటికి నీ కర్థమైన
వనుకుంటాను," అన్నాడు.

పూజారి నవ్వూ, అతడి మాటల వెనక
వున్న అవహేళనా చూసి శివాలుడు మండి
పడి, ఒక్క అంగలో అతణ్ణి సమీపించి
మెడ గట్టిగా పట్టుకుని, "నీచుడా, అంత
ధీమాగా మాట్లాడకు. నాగుమల్లిని ఎక్కడ
దాచావు? వెంటనే చెప్పు," అంటూ
హుంకరించాడు.

పూజారి మాట్లాడబోయి, మెడమీద శివా
లుడి గుప్పెట బిగిసివుండటంతో గిలగిల్లా
డుతూ కళ్ళు తేలవేసే స్థితికి వచ్చాడు.
వాణ్ణి చంపే ముందు, నాగుమల్లి ఎక్కడ
వున్నదీ తెలుసుకోవటం ముఖ్యంఅనుకుని
శివాలుడు అతడి మెడపట్టు వదిలాడు.

పూజారి మెడను రెండుచేతులతో కాసేపు
సవరించుకుని, ఒకసారి గట్టిగా కాండ్రించి,
పట్టరాని కోపంతో ముక్కుపుటాలు అదురు
తుండగా శివాలుడి కేసి తీవ్రంగా చూస్తూ,
"శివాలూ, చివరికి నువ్వు ఆటవికుడి వన్న
సత్యాన్ని బయట పెట్టుకున్నావు. నేను నీ
మిత్రుడి కుమార్తెను అపహరించి కూడా,
మిమ్మల్ని కావాలని యిక్కడికి ఎందుకు
పిలిచానో, నీ కర్థమైనట్టు లేదు. మరొక
మాట, శిథిలాలయ పూజారి పాదాలను
తప్ప మరే శరీరభాగాన్నీ మానవమాత్రు
డెవరూ తాకరాదు. అటువంటి పవిత్రమైన
శరీరంలో మెడభాగాన్ని పట్టుకుని, నువ్వు
నీ నాశనాన్నీ, నీ వంశనాశనాన్నీ కోరి
తెచ్చుకున్నావు," అన్నాడు.

"ఆ వెధవ కోతలన్నీ కట్టిపెట్టి, ముందు
నాగుమల్లిని ఎక్కడ దాచావో చెప్పు! అలా
చెప్పకపోయావో, యీ సారి నీ తుచ్ఛ



దేహాన్ని నేను తాకను. దాన్ని మా పెంపుడు కుక్క ఎర్రగండు ఆకలయినప్పుడల్లా కొంచెంకొంచెంగా తినేస్తుంది," అన్నాడు శవాలుడు.

ఎర్రగండు అన్నమాట వింటూనే కుక్క శవాలుణ్ణి సమీపించింది. అతడి పక్కగా నిలబడి చిన్నగా మొరుగుతూ, శిథిలాలయ పూజారి కేసి దూకేందుకు కాళ్ళు చాచబోయింది. శవాలుడు దాని తల నిమురుతూ, "ఈ నీచుడి దేహం విషంతో సమానమన్న భయం నా కుంది. తొందరపడి నీ ప్రాణాపాయం తెచ్చుకోవటం ఎందుకు, కొంచెం ఆగు," అన్నాడు.



"శవాలా, ఈ అవమానాన్ని నేను సహించను. నీ మేలు కోరి ఒక మాట చెప్పుదామని వచ్చాను. కాని, నీ ధోరణి నాకు కోపం తెప్పిస్తున్నది. నేను వెళుతున్నాను," అంటూ శిథిలాలయపూజారి బల్ల మీది నుంచి లేచాడు.

అప్పటి వరకూ తనలో పొంగే కోపాన్ని అణుచుకుని, ఓ పక్కగా నిలబడి అంతా వింటున్న సమరగండుపోతు, పూజారి లేచి నిలబడగానే, యిక కోపాన్ని పట్టలేక ఎగిరి అతడి మీద పడి, రెండుచేతుల్తో పైకెత్తి నేలకు విసిరి కొట్టబోయాడు. శవాలుడు చప్పున, గండుపోతు ముందుకుపోయి, అతడి చేతుల్లో విలవిల తన్నుకుంటున్న పూజారిని నడుం పట్టుకుని కిందకు దింపి, "పోతూ, కొంచెం ఆగు. ముందు నాగుమల్లి ఎక్కడ వున్నదో తెలుసుకోనియ్. తర వాత వీణ్ణి నీ యిష్టం వచ్చినట్టు చిత్రవధ చేద్దువుగాని," అన్నాడు.

శిథిలాలయ పూజారి భయంతో వణికిపోతూ, "మీ రింత బుద్ధిహీనులని తెలిస్తే, నే నిక్కడికి వచ్చేవాణ్ణే కాదు. నా దారిన నేను హిమాలయాలకు వెళ్ళిపోయేవాణ్ణి. సరే, నాగుమల్లి ఎలాంటి ప్రమాదంలో చిక్కుకుని వున్నదో మీకు అంతుబట్టినట్టు





లేదు. మీ ఇద్దరు మూర్ఖ ఆటవికుల్ని చంపేందుకు నేను నా మహా మంత్రశక్తిని వృథాపరచ దలచలేదు. ఇక్కడ నేను మరణించటమే జరిగితే, ఆ మరుక్షణంలో నాగుమల్లి అక్కడ చిత్రవధ చేయబడు తుంది. అందుకు అవసరం అయిన ఏర్పాట్లన్నీ చేసి నేను మీ మధ్యకు వచ్చాను. జాగ్రత్త!" అన్నాడు.

పూజారి యిలా అనేసరికి శివాలుడికీ, గండుపాతుకూ వాడి ఎత్తుగడ అర్థమై పోయింది. ఇక్కడ పూజారికి ఎలాంటి హాని జరిగినా, అతడి భృత్యులు నాగుమల్లిని హత్య చేస్తారు...

"పూజారీ, యిప్పటికి నీ కుతంత్రం ఏమిటో నాకు పూర్తిగా అర్థమైంది. సరే, నీకు ఎలాంటి ప్రాణాపాయం రాదు. నాగుమల్లిని ఎక్కడ మా స్వాధీనం చేస్తావు?" అని అడిగాడు శివాలుడు.

"నాగుమల్లిని వట్టినే మీకు తిరిగి ఒప్ప చెప్పదలిస్తే, అసలు యిక్కడికి నేను రావటం ఎందుకు? నేను పిచ్చివాణ్ణను కున్నారా? విక్రమకేసరి నీకు తెచ్చి యిచ్చిన తాళపత్రాలు నా స్వాధీనం చేస్తే, నాగుమల్లి సజీవంగా మిమ్మల్ని చేరుతుంది. లేకపోతే, రేపు సూర్యోదయంవేళ, తలలేని ఆమె మొండెం, కొండ మలుపున వున్న





రావిచెట్టుకు వేలాడుతూ వుంటుంది," అన్నాడు శిథిలాలయ పూజారి.

"సరే, అలాగే ఆ తాళపత్రాలు పల్లె నుంచి తెప్పించి నీకిస్తాను. కాని, నాగుమల్లిని నువ్వు వదులుతావన్న నమ్మకం ఏమిటి?" అని అడిగాడు శివాలుడు.

"నేను ఆటవికుణ్ణి కాను, దేవీభక్తుణ్ణి! దేవీభక్తుడు మాట తప్పడు. ఆ తాళపత్రాలున్న సంచీని, తెల్లవారే లోపల ఆ రావిచెట్టుకు వేలాడ కట్టండి. వాటిని నా శిష్యుడు తీసుకోగానే, నాగుమల్లి అక్కడే మిమ్మల్ని కలుసుకుంటుంది," అన్నాడు శిథిలాలయ పూజారి.



"మాట తప్పవుగదా?" అన్నాడు శివాలుడు.

"ఆ మూర్ఖ ప్రశ్నకు యింతకు ముందే జవాబు చెప్పాను. మరో అరగంటలో నేను నా స్థానానికి చేరకపోతే, నాగుమల్లి మొండెం రావిచెట్టును చేరుతుంది. వెళతాను ... సూర్యోదయం లోపల—గుర్తుందిగదా?" అంటూ శిథిలాలయ పూజారి పాకలోంచి బయటికి నడిచి, చీకట్లో కలిసిపోయాడు.

పూజారి పోగానే శివాలుడు, గండు పోతుతో, "పోతూ! మొత్తం మీద యీ పూజారి దుర్మార్గుడు మన మీద విజయం సాధించాడు. నాగుమల్లి ప్రాణం కన్న ఆ తాళపత్రాలేమీ ఎక్కువ కాదు. కాని, నా పూర్వ యజమాని పుత్రుడు ప్రాణప్రదంగా నా దగ్గిరకు పంపిన వాటిని కాపాడలేకపోయాననే అన్న విచారం నాకు కలుగుతున్నది," అంటూ వాకిలి పక్కగా నిలబడి వున్న విక్రమకేసరి కేసి తిరిగి, "కేసరీ! నీ అభిప్రాయం ఏమిటి? ఇంతవరకూ నువ్వు ఒక్కగానొక్క మాట కూడా మాట్లాడలేదు," అన్నాడు.

"పెద్దలు మీరంతా సంప్రతింపుకుంటున్నప్పుడు, నేను మధ్యలో కల్పించు







కోవటం బావుండదని భావిస్తున్నాను. నాగు
మల్లిని రక్షించేందుకు, ఆ తాళపత్రాలను
పూజారి పరం చెయ్యటం ఒక్కటే మార్గంగా
నాకు తోస్తున్నది. ఒకసారి నాగమల్లి సుర
క్షితంగా మనను చేరినతరవాత, తాళపత్రా
లను తిరిగి సంపాయించేందుకు పూజారిని
వేటాడవచ్చు," అన్నాడు విక్రమకేసరి.

"కుర్రవాడివైనా, చాలా వివేకమైన
మాట చెప్పావు," అని శివాలుడు విక్రమ
కేసరిని మెచ్చుకుని, తన అనుచరులైన
శబరులతో, వెంటనే కుంభారమిట్టపల్లెలోని
తన యింటికి వెళ్ళి, తాళపత్రాలను తీసుకు
రమ్మని చెప్పాడు.

ఈలోపల శిఖిలాలయ పూజారికి గుర్రాన్ని
అమ్మమని చెప్పిన దొంగ లిద్దరినీ అను
సరించిపోయిన శిఖిముఖి, అరణ్యంలో
వాళ్ళుండే ఇంటిని చేరుకున్నాడు. దొంగ
లిద్దరూ తలుపు తట్టగానే అది తెరుచు
కున్నది. శిఖిముఖి ఇంటి నానుకుని వున్న
చెట్ల చాటునుంచి కిటికీలో గుండా లోపలికి
చూశాడు. లోపల కాగడాల వెలుగులో
మరిద్దరు దొంగలు అతడి కంటబడ్డారు.
నాగమల్లి గోడ పక్కగా వున్న ఒక కొయ్య
బల్ల మీద కూర్చుని వున్నది. ఆమె చేతులు
రెండూ తాళ్ళతో బంధించబడి వున్నవి.




ఆ దృశ్యం చూస్తూనే శిఖిముఖి కోపంతో
నిలువెల్లా కంపించి పోయాడు. ఓ క్షణం
అతడు తలుపు తోసుకుని లోపలికి పోయి
దొంగల్ని హతమార్చా లనుకున్నాడు. కాని,
మరుక్షణంలో అతడు ఆ ప్రయత్నం తనకే
కాక, నాగమల్లికి కూడా ప్రమాదకారణం
అవుతుందని గ్రహించాడు. ఇప్పుడు తను
చేయవలసింది కొండ లోయలోకి సాధ్య
మైనంత త్వరగా పోయి, విక్రమకేసరినీ
మరి కొందరినీ వెంటబెట్టుకుని వచ్చి,
ఇంటిని చుట్టుముట్టి పూజారి అనుచరుల్ని
హతమార్చి, నాగమల్లిని విడిపించుకు
పోవటం...







శశిముఖి యిలా ఆలోచించేంతలో అతడికి పూజారి ఎక్కడ అన్న ప్రశ్న ఎదురైంది. వాడూ, వాడి బంటు నవరభేరుండం ఎక్కడికి పోయాడు? ఒకవేళ పూజారి, నాగుమల్లిని దొంగల పరం చేసి, తాను తన బంటుతో బ్రహ్మపుత్రానది ప్రాంతాలకు తిరిగి ప్రయాణమయ్యాడా?

ఆలోచిస్తూ కాలం వృథాపుచ్చటం మంచిది కాదనుకుంటూ శశిముఖి కిటికీ నుంచి యివతలికి వచ్చి, పొదల చాటున నక్కుతూ, అరణ్యం కేసి పోయే కాలిబాట మీదికి వచ్చాడు. హఠాత్తుగా అతడికి గుర్రపు గిట్టల సవ్వడి వినిపించింది. శశిముఖి చప్పున దారికి పక్క నున్న పొదల చాటుకు పోయాడు. అంతలో ఒక చెట్టు చాటు నుంచి నవరభేరుండం పరిగెత్తుకుంటూ వచ్చి, "ఎవరక్కడ? పొదల చాటున దాగిందెవరు? బయటికి వచ్చెయ్యండి!" అంటూ కేక పెట్టాడు.

శశిముఖి ప్రమాదాన్ని గుర్తించి, అక్కణ్ణించి మరి కొంచెం దూరంగా కదిలేంతలో శిథిలాలయ పూజారి గుర్రం మీద వేగంగా అక్కడికి వస్తూ, "ఎవడూ, భేరుండమా? ఏమిటా కేకలు? శత్రువులకు మన నివాసం తెలియపరచా లనుకుంటున్నావా?" అన్నాడు కోపంగా.

"కాదు, పూజారిదేవా! పొదల్లో ఏదో అలికిడయింది!" అన్నాడు భేరుండం తడబడుతూ.

"ఆ అలికిడేదో నీ బుర్రలో అయింది. వద్దంటే మళ్ళీ అతిగా తాగుతున్నావ్. సరే, ఆ అలికిడికి కారణం ఏమిటో చూసి, త్వరగా రా," అంటూ పూజారి గుర్రాన్ని ఇంటి కేసి దౌడు తీయించాడు.

నవరభేరుండం చేతిలో వున్న ఈటెను ఝళిపిస్తూ, శశిముఖి దాగివున్న పొదల కేసి అడుగులో అడుగు వేసుకుంటూ బయలుదేరాడు. —(ఇంకా వుంది)








## 18

[నాగమల్లిని ఎత్తుకుపోయిన శిథిలాలయ పూజారి, ఆమెను విడిచి పుచ్చేందుకు, శివాలుణ్ణి తాళపత్రగ్రంథం మూల్యంగా చెల్లించమన్నాడు. శివాలుడు అందుకు అంగీకరించాడు. దొంగలువున్న చోటుదాని శిఖిముఖి తిరిగి వస్తూండగా, అలికిడి విన్న నవరభేరుండం, ఈటెను ఝుళిపిస్తూ అతడి పైకి రాసాగాడు. తరవాత—]

శిఖిముఖి క్షణాల మీద తను ఏమి చెయ్యటం క్షేమమో ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. నవర భేరుండాన్ని వెనక నుంచి వెళ్ళి తలమీద బలంగా ఒక దెబ్బ కొట్టి చడీ చప్పుడూ లేకుండా చంపెయ్య వచ్చు. కాని, అందువల్ల పూజారి ముఠా తమ రహస్య నివాసం శత్రువులకు తెలిసి పోయిందని, నాగమల్లిని మరొక చోటుకు ఎత్తుకుపోయి దాయవచ్చు...

ఇలా ఆలోచించిన శిఖిముఖి, నవర భేరుండం కంట బడకుండా పారిపోయేం దుకు ఒక ఎత్తు వేశాడు. అతను దాగివున్న పొదల్లో నుంచి దాపుల నున్న మరికొన్ని పొదల కేసి నాలుక్కాళ్ళ మీద నడుస్తున్న జంతువులా కుప్పించి దూకుతూ, చిరుత గండు కోపంతో అరిచినట్టు పెద్దగా గర్జన చేశాడు. ఆ ధ్వని వింటూనే నవరభేరుండం బెదురుకుని తక్కున ఆగిపోయి, వెనక్కు









ఒక్కొక్క అడుగే వేస్తూ, "చిరుతగండా! ఏదో మనిషనుకున్నాను," అన్నాడు భయం వల్ల వణుకుతున్న గొంతుతో.

భేరుండాన్ని యింత తేలిగ్గా మోసగించగలిగినందుకు సంతోషపడిపోతూ, శిఖిముఖి మరింత బిగ్గరగా అరుస్తూ, పొదల చాటు నుంచి మహా వృక్షాలున్న అరణ్యంలోకి పరిగెత్తాడు. బయట అడవి జంతువు అరవటం వింటూనే, ఇంట్లోకి పోయిన శిథిలాలయ పూజారి, దొంగల్లో యిద్దర్ని సవర భేరుండానికి సాయం వెళ్ళమని చెప్పాడు.

ఆ దొంగ లిద్దరూ కత్తులూపుకుంటూ, "ఎక్కడ చిరతపులి? ఎక్కడ?" అంటూ సవర భేరుండం వున్న పొదల దగ్గిరకు పరిగెత్తుకు వచ్చారు.

సవర భేరుండం అప్పటికి తేరుకుని, పెద్దగా నవ్వుతూ, "ఇంకెక్కడి చిరత? అది నా మీదికి దూకబోయే సమయంలో ఈ చేతో గట్టిగా ఒకే పోటు పొడిచాను. ఆ దెబ్బకు వెల్లకిలా పొదల్లో పడి లేచి అరణ్యం కేసి దౌడు తీసింది," అన్నాడు.

"భేష్, సాహసంలో, తెగువతనంలో మాతో సరితూగ్గలవాడివి. ఇక రా. పూజారి దొర నీ కేదో ప్రమాదమైన పని ఒప్పచెప్ప బోతున్నాడు," అన్నాడు దొంగల్లో ఒకడు.

"ప్రమాదమైన పనా? ఉహూఁ, నాకేం భయం లేదు. దొర ఆజ్ఞాపిస్తే, అలా ఆకాశంలోకి ఎగిరిపోగలను. నేను మానవప గండభేరుండాన్ని, తెలుసుగా!" అన్నాడు సవరభేరుండం.

"ఆ సంగతి మాకు తెలును. తెలియని వాళ్ళు నువ్వేదో హెచ్చులు మాట్లాడు తున్నావనుకుంటారు. పూజారి దొర మంత్ర శక్తికి తిరుగేమిటి?" అన్నాడు దొంగల్లో రెండోవాడు.

"ఏమిటా చచ్చు కబుర్లు? భేరుండాన్ని చిరుతపులి పీక కొరికి ఎత్తుకు పోలేదు, నయం! వాడు బాగా మైకంలో వున్నట్టు







న్నాడు. వాగుడు కట్టి పెట్టి రమ్మనండి," అంటూ శిథిలాలయ పూజారి కేకపెట్టాడు.

సవర భేరుండాన్ని యింత తేలిగ్గా మోసం చేసి అరణ్యంలోకి పారిపోయిన శిఖిముఖి అతి వేగంగా లోయలోకి పరిగెత్తాడు. అక్కడ అతడు దివిటీల వల్ల లోయ అంచున వున్న ఇంటిని గుర్తించి, అక్కడికి చేరేసరికి, శవాలుడూ, సవర గండుపోతూ—అందరూ కనిపించారు. శిఖిముఖి వాళ్ళకు, నాగమల్లి బంధించబడి వున్న ఇంటిని గురించి చెప్పి, దాన్ని చుట్టుముట్టితే, ఆమెను రక్షించటమే గాక, శిథిలాలయ పూజారిని కూడా పట్టుకుని బంధించవచ్చని తెలియపరిచాడు.

శవాలుడు తన కొడుకు చెప్పినట్టు చేయటమే సరిఅయిన మార్గం అని సవర గండుపోతుతో సంప్రతించి నిర్ణయించాడు. తండ్రి ద్వారా శిఖిముఖి, పూజారి తాళపత్రాలున్న సంచిని వేలాడకట్టమన్న రావిచెట్టు సంగతి విన్నాడు. అతడు ముందు జాగ్రత్తగా, ఆ రావిచెట్టు ప్రాంతాల కాపలాకోసం ఇద్దరు శబరయువకుల్ని పంపాడు.

ఆ తర్వాత ధైర్యసాహసాలు గల పది మంది శబర యువకుల్ని, విక్రమకేసరిని వెంటబెట్టుకుని శిఖిముఖి, శిథిలాలయ



పూజారివున్న ఇంటి కేసి వేగంగా ప్రయాణమయాడు. అరగంట తరవాత ఆ ఇంటి ప్రాంతాన్ని చేరేసరికి శిఖిముఖికి, యీ సారి ఇంటి ముందున్న పొదల ప్రాంతాల దొంగల్లో ఒకడు అటూ యిటూ గస్తీ తిరుగుతూండటం కనిపించింది, కిటికీలోంచి దీపకాంతి బయటికి పడుతున్నది.

ఆ గస్తీవాణ్ణి చూస్తూనే శిఖిముఖికి, పూజారి ఏదైనా ప్రమాదాన్ని శంకించాడా అన్న అనుమానం కలిగింది. వాడు బహుటక్కరి. నాగమల్లిని మరోచోటుకు ఎత్తుకు పోలేదు గదా అన్న భయం కలిగిందతడికి. ఏది ఏమైనా ముందు ఇంటిని చుట్టు







ముట్టాలి. శిఖిముఖి, విక్రమకేసరితో తాను చేయబోయే పని గురించి చెప్పాడు. గస్తీ వాడు ముందుగా హెచ్చరిస్తే, ఇంట్లో వున్న శత్రుమూక అంతా పారిపోయే ప్రమాదం వున్నది. కనక గస్తీవాణ్ణి కిక్కురుమన కుండా తుదముట్టించాలి.

శిఖిముఖి అనుచరుల్ని అంత దూరాన వదిలి పొదల వెనగ్గా పాకుతూ పోయి, గస్తీవాడు తానున్న పొద పక్కగా నడిచే సమయంలో వెనకనుంచి కత్తిపిడితో బలంగా నెత్తిమీద కొట్టి, వాడు కింద పడ బోయే సమయంలో అరవకుండా వుండేందుగ్గాను గొంతు పట్టుకోబోయాడు. కాని, దొంగ దెబ్బ తిని ముందుకు తూలి పడబోతూనే పెద్దగా చావుకేక పెట్టాడు.

ఆ కేక వింటూనే ఇంట్లో వున్న శిథిలాలయ పూజారి ప్రమాద మేదో ముంచుకు వస్తున్నదని గ్రహించి, సవర భేరుండంతో, "ఒరే, భేరుండం! మనం తక్షణం యీ ఇల్లు వదిలి పోవాలి. నా వెంట పరిగెత్తుకు రా!" అంటూ ఇంటికి వెనకవైపు నున్న వాకిలి తెరుచుకుని, దాపుల నున్న అరణ్యం కేసి పరిగెత్తాడు.

శిఖిముఖి గస్తీ దొంగ కేక పెట్టగానే తాను వేసిన పథకం చెడిందని గ్రహించి, తన అనుచరుల్ని ఇంటిని చుట్టు ముట్టమని హెచ్చరించాడు. విక్రమకేసరీ, శబర సవర యువకులూ ఇల్లు చుట్టుముట్టారు. శిఖిముఖి ఇంటి ముందు ద్వారం నుంచి, విక్రమకేసరి వెనక వైపు నున్న ద్వారం నుంచీ కత్తులు ఝళిపిస్తూ లోపలి కడుగు పెడుతూనే, "అందరూ లొంగి పొండి. ఎదురు తిరిగారో ప్రాణాలు దక్కవు, జాగ్రత్త!" అన్నారు.

కొయ్యబల్ల మీద కూర్చుని వున్న నాగుమల్లి వాళ్ళిద్దరి కేసి వింతగా చూస్తూ, "భలే తెలివైన వాళ్ళు. మీరు పట్టుకోదలిచిన పూజారి వెధవ భేరుండంతో యింతకు









ముంచే పారిపోయాడు. అదుగో, ఆ మూల వున్న ముగ్గురు సోమరి వెధవలూ మాంచి కైపుతో కళ్ళు మూశారు. భూకంపం వచ్చి ఇల్లు కూలినా లేవరు," అన్నది.

శిఖిముఖి, నాగమల్లిని సమీపించి మౌనంగా ఆమె కాలి చేతి కట్లను విప్ప సాగాడు. విక్రమకేసరి అతడి దగ్గిర కొచ్చి, "ఏం, శిఖీ! ఆ పూజారి దుర్మార్గుణ్ణి వెంబడించే ప్రయత్నం చేయొద్దా? వాడు మరో సారి మనందరినీ మోసగించి పారిపోయాడు," అన్నాడు.

"వాడు రోజులు మూడిననాడు గాని మన చేతబడడు. ఈ గుడ్డి వెన్నెల్లో వాణ్ణి యీ మహారణ్యంలో ఎక్కడని వెతుకుతాం? మనకు అనవసర శ్రమ తప్ప ఫలితం వుండదు. ఇదిగో, యీ గండుపోతు కూతుర్ని తండ్రికి ఒప్పచెపితే, మన బాధ్యత తీరిపోతుంది. ఆ తరవాత మనం నిశ్చింతగా మీ తాతగారిని గురించి తెలునుకునేందుకూ, ఆ శిథిలాలయ రహస్యం ఏమిటో కనుక్కునేందుకూ బ్రహ్మపుత్రా నదీ ప్రాంతాలకు పోదాం," అన్నాడు శిఖిముఖి.

నాగుమల్లి కట్లు వూడతీయగానే లేచి నిలబడబోయి, రక్తప్రసారం సరిగా జరగక కాళ్ళు చచ్చు పడటంతో తిరిగి బల్లమీద కూర్చుంటూ, విక్రమకేసరితో, "ఈ శబర కుర్రాడికి ఆ శిథిలాలయ పూజారి ఎంత జిత్తులమారో యింకా తెలిసినట్టు లేదు. వాడు మీకంటె ముందుగా ఆ బ్రహ్మపుత్రా లోయల్లోని శిథిలాలయాన్ని చేరతాడు," అన్నది.

"అక్కడికి వెళ్ళేందుకు అవసరం అయిన దారి గుర్తులూ అవీ వున్న పటం గల తాళపత్రాలు మా దగ్గిర వున్నవి. ఆ దారేదో తెలుసుకునేందుకే పూజారి ఆ తాళపత్రాల కోసం యింతగా తెగించి ప్రయత్నించాడు. అవి జన్మలో వాడిచేత బడవు," అన్నాడు శిఖిముఖి.











అంతలో గది మూల నిద్రపోతున్న దొంగల్లో ఒకడు పెద్దగా ఆవులిస్తూ కళ్ళు తెరిచి, శిలిముఖి వాళ్ళను చూసి, భయంతో కంపించి పోతూ తోటి వాళ్ళను నిద్ర లేపాలని చూశాడు. కాని వాళ్ళు కదల లేదు. శిలిముఖి వాళ్ళను సమీపించి కత్తిపిడితో ఒక్కొక్కళ్ణీ పొడుస్తూ, "ఇక లేవండి. మీ యజమాని పారిపోయాడు. మీ ముగ్గురి తలలూ రావిచెట్టుకు వేళ్ళాడ గట్ట బోతున్నాను," అన్నాడు.

తతిమ్మా యిద్దరు దొంగలూ కళ్ళు తెరుస్తూనే, శిలిముఖిని చూసి అదురుకు పోయారు. శిలిముఖి మరోసారి వాళ్ళకు తలలు నరక బోతున్నట్టు చెప్పాడు. దొంగలు ముగ్గురూ అతడి కాళ్ళా వేళ్ళా పడుతూ, "ఆ పూజారి దుర్మార్గుడిచ్చిన డబ్బంతా నీ కిస్తాం. మమ్మల్ని ప్రాణాలతో వదులు," అన్నారు.

"ఏదీ, ఆ డబ్బు చూపండి?" అన్నాడు శిలిముఖి.

దొంగలు ఒకరి ముఖాలొకరు చూసుకుని, చుట్టూ కలయచూడసాగారు. వాళ్ళెవరి కోసం చూస్తున్నారో గ్రహించిన శిలిముఖి, "నాలుగోవాడి కోసం చూస్తున్నారా? వాడు కూడా వస్తేగాని, ఆ దాచిన డబ్బు బయటికి తీయటానికి లేదన్న మాట! సరే, బహుశా వాడిపాటికి నరకంలో వుండి వుంటాడు. వాడివంతు డబ్బు కూడా మీరే పంచుకుని, ఎక్కడనైనా యింత పొలం కొనుక్కుని సన్మార్గంలో బతకండి. దొంగల్లా మళ్ళీ ఏనాడైనా నా కంట బడ్డారో, ఆ క్షణానే మీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు.

శిలిముఖి వెంట నాగుమల్లి తతిమ్మా అనుచరులూ ఇంటి బయటికి వచ్చారు. విక్రమకేసరి, శిలిముఖితో, "శిఖీ! పూజారికీ, దొంగలకూ ఆశ్రయం అయిన యీ ఇంటిని యిలా వుండ నివ్వటం నా కిష్టం లేదు. వాళ్ళు మరోసారి యిక్కడ చేరి దుర్మార్గ









కార్యాలు చేయవచ్చు. దీనికి నిప్పుపెట్టటం మంచిది,'' అన్నాడు.

శిఖిముఖి, "నీ యిష్టం," అంటూ తల ఊపాడు. విక్రమకేసరి ఇంట్లోకి పోయి వెలుగుతున్న దివిటీ తీసుకుని బయటికి వచ్చి, ఇంటి నాలుగు పక్కలా దానితో అంటించాడు. చూస్తూండగానే పెద్ద మంటలు లేచినై. శిఖిముఖి అతడి అనుచరులూ సంతోషంగా చప్పట్లు చరుస్తూ లోయ కేసి బయలుదేరారు. చచ్చినవాడు చావగా మిగిలిన ముగ్గురు దొంగలూ, కాలే ఇంట్లో నుంచి తమకు పనికి వస్తవనుకున్న కొయ్యబల్లలూ, వంటపాత్రలూ హడావిడిగా బయటికి తెచ్చుకోసాగారు.

లోయ సమీపంలో వున్న పూరిపాక దగ్గిర తిరిగి అంతా కలుసుకున్నారు. సవరగండుపోతు తన కుమార్తెను చూసి పొందిన ఆనందం అంతా యింతా కాదు. అతడు నాగుమల్లిని బుజ్జగిస్తూ, "నిన్నా పూజారి కుక్క ఉత్తరాదికి ఎత్తుకు పోయాడే అనుకున్నాను. అదృష్టం కొద్దీ దొరికావు. ఆ పిచ్చికుక్కగాణ్ణి ఏదో విధంగా పట్టుకుని కండకు కండ కోసి కాకులకూ గద్దలకూ వెయ్యకపోతే నేను గండుపోతునే కాదు,'' అన్నాడతను.

శివాలుడు చిరునవ్వు నవ్వుతూ, "గండుపోతూ, మనం యిలాంటి ప్రతిజ్ఞలు చేసి నెరవేర్చుకోగలిగిన స్థితిలో లేం, పెద్దవాళ్ళమయి పోయాం. శిఖిముఖీ, విక్రమకేసరీ ముందుగా శూరసేనదేశం వెళ్ళి, విక్రమకేసరి తండ్రిగారితో మాట్లాడి బహుశా అక్కణ్ణించి బ్రహ్మపుత్రా నదీలోయ ప్రాంతాలకు వెళతారు. ఒకవేళ వాళ్ళకు తిరిగి ఆ శిథిలాలయ పూజారి నని చెప్పుకునే దుష్టుడు ఎదురైతే, తప్పక వాణ్ణి నీ కోసం కాళ్ళూ చేతులూ కట్టి తీసుకు వస్తారు. అప్పుడు నువ్వు వాణ్ణి చిత్రహింసలకు గురిచెయ్యవచ్చు,'' అన్నాడు.





శివాలుడి మాటలకు అందరూ వినోదంగా నవ్వారు. తరవాత సూర్యోదయం అవుతూనే శివాలుడూ, గండుపోతూ తమవాళ్లను వెంటబెట్టుకుని తిమ్మగూడెం చేరారు. అక్కడ ఆ పగలూ, రాత్రీ వినోదాలతో, విందులతో కాలంగడిపి శివాలుడు మర్నాటి ఉదయం తన కుంభారమిట్ట పల్లెకు బయలుదేరాడు. అతడు ప్రయాణమయే సమయంలో నాగుమల్లి, శిఖిముఖిని ఒక పెద్ద చెట్టు చాటుకు పిలిచి, తనను కాళ్లూ చేతులూ కట్టి హింస పెట్టిన శిథిలాలయ పూజారి శిఖ కావాలన్నది.

"వాడు మాకు ఆ లోయల్లో తటస్థపడాలే కాని, వాడి తలే నరికి తెచ్చి నీకిస్తానని వాగ్దానం చేస్తున్నాను. కాని, తిరిగి రావటానికి ఎంతకాలం పడుతుందో చెప్పలేను. ఈ లోపల నువ్వు మరొక నవరవాడి పెళ్ళాం అయిపోతే, వాడు నా మీద ఈటె ఎత్తుతాడు," అన్నాడు శిఖిముఖి.

ఆ మాటలు నాగుమల్లికి కోపం, సిగ్గూ కూడా తెప్పించినై. ఆమె తలవంచుకుని నేల చూపులు చూస్తూ, "నన్ను నవరవాడు కాదు గదా, మరే శబరవాడు కూడా చేసుకోలేడు," అన్నది వణుకుతున్న కంఠస్వరంతో.

"అంటే....నాకేం తెలియటం లేదు," అంటూ శిఖిముఖి అమాయకంగా, నాగుమల్లి ముఖం కేసి చూశాడు.

నాగుమల్లి ఏదో చెప్పబోయింది, కాని అంతలో శివాలుడు పెద్దగా, "ఊఁ, యిక అందరూ బయల్దేరండి. శిఖిముఖి ఎక్కడ?" అన్నాడు.

నాగుమల్లి చప్పున కదిలి ఇంటి కేసి పరిగెత్తింది. ఎర్రగండు అరుస్తూ శిఖిముఖి దగ్గిరకు వచ్చింది. శిఖిముఖి దాని తల నిమిరి నాగుమల్లి అన్న మాటల్లోని భావమేమిటా అని ఆలోచిస్తూ తండ్రి దగ్గిరకు బయలుదేరాడు. —(ఇంకా వుంది)






## 19

[శిఖిముఖి, విక్రమకేసరి తమ అనుచరులతో శిథిలాలయ పూజారి వున్న ఇంటిని చుట్టుముట్టి నాగుమల్లిని బంధవిముక్తురాల్ని చేశారు. పూజారి, వనరఖేపుండంతో అరణ్యంలోకి పారిపోయాడు. నాగుమల్లి, శిఖిముఖితో ఆతడు బ్రహ్మపుత్రా నదీ లోయల నుంచి తిరిగివచ్చేవరకూ తాను పెళ్ళాడబోవటం లేదని చెప్పింది. తరవాత—]

శివాలుడు తన అనుచరులందరినీ వెంట బెట్టుకుని మధ్యాహ్నం వేళకు కుంభార మిట్టపల్లె చేరాడు. తాను పల్లెలో లేని సమయాన శిథిలాలయ పూజారి పల్లెపై ఏదైనా అఘాయిత్యం చేసివుండవచ్చునన్న భయం ఆతణ్ణి దారి పొడుగునా బాధించింది. కాని పల్లె చేరుతూనే అలాంటి ఉపద్రవం ఏమీ జరగలేదని తెలిసి, ఆతడు చాలా సంతోషించాడు.

ఇన్నాళ్ళకు శివాలుడికి, విక్రమకేసరి తండ్రి జయపాలుడు తనకు పంపిన తాళపత్రాలు తీరిగ్గా చదివిచూసే అవకాశం దొరికింది. జయపాలుడి తండ్రి విక్రమకేసరి రెండవసారి బ్రహ్మపుత్రా లోయలకు ఎందుకు వెళ్ళటం జరిగిందో, వాటిల్లో ఆతడికి సూచనప్రాయంగా వున్న కొన్ని స్థలాల పేర్ల ద్వారా అర్థమైంది. ఆతడు యీ రెండవ యాత్ర పెట్టుకున్నది, బ్రహ్మ









పుత్రానది లోని అసంఖ్యాకమైన లంకల్లో ఒకటైన వృశ్చికలంక చేరేందుకు. ఆ లంక మీదే శిథిలాలయం వున్నదని వాడుక. అందులో అంతులేని ధనకనకాలే కాక, వెలలేని శిల్పసంపద కూడా వున్నదని చెపుతారు. విక్రమకేసరి ఆ ధనాన్ని, వీలయితే అపూర్వకళాఖండాలుగా చెప్పబడే శిల్పాలనూ తీసుకువచ్చి తన రాజభవనాన్ని అలంకరింప చేయాలనుకున్నాడు.

తాళపత్రాల్లో విక్రమకేసరి ఆ శిథిలాలయాన్ని చేరేందుకు తనకు తెలిసిన వర్తమానమంతా రాశాడు. ఆ దేవాలయం అభ్యు లనబడే ఆటవికులు కొన్ని వందల సంవత్సరాల క్రితం నిర్మించినది. ప్రకృతి వైపరీత్యాలవల్లా, బ్రహ్మపుత్ర వరదల వల్లా, ఆ లంక చుట్టుపక్కల చాలా ప్రాంతం జలమయం అయిపోయి, కొన్నేళ్ళుగా ఆ దేవాలయం వున్న లంక ఎక్కడున్నదో కూడా ఎవరికీ తెలియకుండా పోయింది. కాని, అభ్యుజాతి వాళ్ళలో కొందరు వృద్ధులకు మాత్రం ఆ శిథిలాలయం వున్న లంకను గురించిన సమాచారం కొంతలో కొంత తెలుసునన్న వాడుక వున్నది.

శివాలుడు, వందల సంఖ్యలో వున్న తాళపత్రాల్లో అక్కడా యిక్కడా వున్న శిథిలాలయానికి సంబంధించిన విషయాన్ని విక్రమకేసరికి చెప్పి, "కేసరీ, మీ తాతగారైన విక్రమకేసరి దొర యింకా సజీవుడే అన్న నమ్మకం నాకు లేదు. ఆయన వయసులో నా కన్న చాలా పెద్ద. అంతే కాక ఆ లోయల్లో ఒంటరిగా తిరుగుతూ విషజ్వరాలకూ వాటికీ గురై యింతకాలం సజీవుడై వుంటాడని నేననుకోను. ఏమైనా, సంగతి మీ నాయనగారితో చెప్పు. ఆయన ఆ ప్రాంతాలకు వెళ్ళిరాలంటే మనం చేయగలిగిందేమీ లేదు. నీకు తోడుగా శూరసేనదేశం వరకే గాక, ఆ బ్రహ్మపుత్రా









నదీ లోయలకు కూడా నా కొడుకు శిఖిముఖిని పంపుతున్నాను," అన్నాడు.

విక్రమకేసరి, శివాలుడికి కృతజ్ఞత తెలియపరిచాడు. మర్నాటి ఉదయం అతడు శిఖిముఖిని వెంటబెట్టుకుని తన దేశానికి బయలుదేరాడు. దారిలో దొంగల బెడదగాని, శిథిలాలయ పూజారి నుంచి ఏమైనా ఆపదగాని రావచ్చునన్న అనుమానంతో శివాలుడు వారి వెంట దృఢకాయులైన యిద్దరు శబరయువకుల్ని అంగరక్షకులుగా పంపాడు.

మార్గమధ్యంలో ఎలాంటి చిక్కులకూ గురి కాకుండానే పక్షం రోజుల తరవాత శిఖిముఖి, విక్రమకేసరి శూరసేనదేశం చేరారు. జయపాలుడు విక్రమకేసరి ద్వారా సంగతి సందర్భాలన్నీ తెలుసుకుని, ఎంత ప్రమాదంతో కూడిన కార్యం అయినా సరే, తాను తప్పక బ్రహ్మపుత్రానదీ లోయలకు పోయి, తన తండ్రి సజీవుడో కాదో అన్న సంగతి తెలుసుకు తీరాలన్నాడు.

జయపాలుడి ఆలోచనకు మంత్రి, యితర రాజోద్యోగులూ అభ్యంతరం చెప్పారు. ఇటువంటి కష్టసాధ్యమైన పనికి యువకుడే తగినవాడని, ఈ వయసులో జయపాలుడు అంత దూరప్రయాణానికి పూనుకోవటం క్షేమం కాదని సలహా యిచ్చారు. వారి సలహాను పాటించి జయపాలుడు తన కొడుకైన విక్రమకేసరి పైన యీ కార్యభారం పెట్టాడు.

ప్రయాణానికి అవసరం అయిన ఏర్పాట్లన్నీ ఒక వారం రోజుల్లో పూర్తయినై. విక్రమకేసరి, శిఖిముఖుల వెంట రక్షణగా జయపాలుడు సుశిక్షితులైన ఇద్దరు క్షత్రియ యువకుల్ని పంపేందుకు ఏర్పాటు చేశాడు. అందరూ ఒకనాటి ప్రాతఃకాలాన బ్రహ్మపుత్రానదీ లోయలకు ప్రయాణం అయారు. బయలుదేరే ముందు జయపాలుడు శిఖిముఖిని ఆప్యాయంగా కౌగలించుకుని,







అతడి మెడలో ఒక రక్షరేకు కట్టాడు. అది జయపాలుడికి తన తండ్రి నుంచి లభ్యమయిన తాళపత్రాలు గల పెట్టెలో దొరికింది. దాని మీద కాళీమాత రూపం చెక్కబడి వున్నది.

శిఖిముఖి, విక్రమకేసరులు తమ యిద్దరు సహచరులతో నాలుగైదు నెలల కాలం అరణ్యాల్లో, కొండల్లో ప్రయాణించి, చిన్నాపెద్ద నదులను అనేకం దాటి చివరకు కామాఖ్యాపురం చేరారు. అక్కడ కొద్ది రోజులపాటు విశ్రాంతి తీసుకుని తర వాత దారిచూపే వాణ్ణెవణ్ణయినా కుదుర్చుకుని అభ్యుజాతి వాళ్ళుండే ప్రాంతం చేరాలని వాళ్ళు నిర్ణయించుకున్నారు. తాత విక్రమకేసరి యీ జాతివాళ్ళు నివసించే ప్రాంతాల కొంతకాలం వున్నట్టు శూరసేన దేశపు పండితుడు జయపాలుడికి లోగడ చెప్పి వున్నాడు.

విక్రమకేసరీ అతడి అనుచరులూ కామాఖ్యాపురం చేరి, ఒక సత్రంలో బస చేశారు. ఆ సమయాన పట్టణంలో దేవీ ఉత్సవాలు జరుగుతున్నవి. అవి చూసేందుకు చుట్టుపక్కల పదీ పన్నెండు కోసుల దూరం నుంచి కూడా జనం వస్తున్నారు. వీళ్ళల్లో అనేక తెగలవాళ్ళూ, జాతుల వాళ్ళూ వున్నారు. బ్రహ్మపుత్రా నదీ లోయల్లో దారి చూపేందుకు నమ్మకస్థుడైనవాడి కోసం వెతకటానికి యిది మంచి అదనుగా శిఖిముఖికి తోచింది. అతడు విక్రమకేసరినీ, తతిమ్మా యువకుల్నీ వెంటబెట్టుకుని ఉత్సవం జరుగుతున్న ప్రాంతానికి బయలుదేరాడు. వీధులకు యిరువైపులా చిన్నచిన్న దుకాణాలు అనేకం వాళ్ళ కంటబడినై. ఆ దుకాణాల్లో ఏనుగు దంతంతో చేసిన రకరకాల వస్తువులూ, పాలరాతితో చెక్కిన విగ్రహాలూ, జంతు చర్మాలతో తయారైన సామగ్రులూ అమ్ముతున్నారు.





నలుగురు యువకులూ ఆ దుకాణాల్లోని విచిత్ర వస్తువులను చూస్తూ ముందుకు కదిలారు. వాళ్ళకు ఒక వీధి మలుపున ఏనుగుచర్మాలు పరుచుకుని వాటి మీద మానవాస్తికలు పెట్టుకు కూర్చున్న ఒక జ్యోతిష్యుడు కనిపించాడు. పెద్ద గడ్డం, జడలు కట్టిన తల వెంట్రుకలతో, ముఖాన ఎర్రని పెద్ద కుంకంబొట్టుతో, అతడు చూపరుల్ని బాగా ఆకర్షిస్తున్నాడు.

శిఖిముఖీ వాళ్ళూ అతడి కేసి ఓ క్షణ కాలం చూసి ముందుకు కదలబోయేంతలో, జ్యోతిష్యుడు "శూరసేనదేశపు కేసరీ, ఆగు! ఒక్క మాట," అన్నాడు పెద్దగొంతుతో.

తనను ఆ విధంగా పేరుపెట్టి పిలిచిన జ్యోతిష్యుడి కేసి ఆశ్చర్యంగా చూస్తూ విక్రమకేసరి నిలబడ్డాడు. జ్యోతిష్యుడి చేత సాముద్రికం చెప్పించుకుంటున్న కొందరు విక్రమకేసరినీ, అతడి వెంటవున్న వాళ్ళనూ పరీక్షగా చూడసాగారు.

శిఖిముఖి జ్యోతిష్యుడి కేసి రెండడుగులు వేసి, "అయ్యా, చేయి చూసి మనుషుల పేర్లు చెప్పే జ్యోతిష్యుల్ని కొందరిని నే నెరుగుదును. కాని, మీరు మనిషి ముఖం చూసి పేరూ వూరూ తెలుసుకో గలిగారు. లోగడ మా ప్రాంతాల ఏమన్నా వున్నారా?" అని అడిగారు.





జ్యోతిష్యుడు వికవిక మంటూ నవ్వి, "నేను అఘోరీ జ్యోతిశ్శాస్త్ర పండితుణ్ణి, శిఖీ! భూతభవిష్యత్ వర్తమానాలు అన్నీ వున్నపాళంగా చెప్పగలను. మీరిక వచ్చిన దారినే ఇంటికి తిరిగిపొండి. వృద్ధ విక్రమకేసరి బతికిలేడు. పైగా మీరు వెయ్యేళ్ళ వయసు గల మహాశక్తిమంతుడితో విరోధం తెచ్చుకున్నారు. సాహసించి బ్రహ్మపుత్రా నదీ లోయల్లోకి పోయారో మీరు బలవన్మరణం పొందుతారు," అన్నాడు.

ఆ మాటలు వింటూనే విక్రమకేసరి కత్తి దూయబోయాడు. శిఖిముఖి అతణ్ణి వారించి చిన్నగొంతుతో, "కేసరీ! తొందరపడకు. మనం వున్నది దేశంకాని దేశం. ఈ కపట జ్యోతిష్యుడు శిథిలాలయ పూజారి మిత్రుడో సేవకుడో అయివుంటాడు. ఆ దుర్మార్గుడి ద్వారానే వీడు మనను గురించి విన్నాడు. అంటే దాని అర్థం, ఆ పూజారి యీ పట్టణంలోనే ఎక్కడో వున్నాడన్న మాట, మనను యిన్నాళ్ళుగా ఒక కంట కనిపెట్టే వున్నాడని తెలుస్తున్నది గదా!" అన్నాడు.

"అలాగే తోస్తున్నది. ఆ దుర్మార్గుడి పీడ విరగడైపోయిందనుకున్నాను. సరే, మనం యిక యీ జనంలో తిరగటం మంచిది కాదు. వాడి ఇంట్లో మనను చాటు నుంచి దెబ్బ తీయవచ్చు. మన విడిది సత్రంకు పోదాం పదండి," అన్నాడు విక్రమకేసరి.

నలుగురూ ఓ అర గంట తరవాత సత్రం దగ్గిరకు వచ్చేసరికి, సత్రం యజమాని వాళ్ళతో, "మీ గురువుగారు, మీరు విడిది చేసిన గదిలో వున్నారు. ఓ గంట కాలంగా మీ కోసం ఎదురు చూస్తున్నారు," అని చెప్పాడు.

సత్రం యజమాని యిలా అనగానే నలుగురూ ఎక్కడలేని ఆశ్చర్యం పొందారు. శిఖిముఖి సత్రం యజమాని కేసి అను








మౌనంగా చూస్తూ, "మాకు గురువంటూ ఎవరూ లేరు. వాడెవడో దొంగ అయి వుంటాడు. మేం దిగిన గది వాడికి చూపావా?" అని అడిగాడు.

సత్రం యజమాని కళవెళపడిపోతూ, "గది చూపాను. అతడు గొప్ప కాళీ భక్తుడిలా వున్నాడు. ఏదో గుడికి పూజారి ననీ, మీకు చాలా కాలంగా గురువుననీ చెప్పాడు," అన్నాడు.

"సరే, వాడి సంగతి మేం చూసుకుంటాం. మా గది వైపు నుంచి కేకలూ అరుపులూ వినిపించినా, ఓ అర గంట వరకూ అటు కేసి ఎవర్నీ రానీయకు," అంటూ శశిముఖి గబగబా మిద్దెపై నున్న తమ గది కేసి బయలుదేరాడు. విక్రమకేసరీ, క్షత్రియయువకు లిద్దరూ అతడి వెనకనే నడిచారు.

విక్రమకేసరి వాళ్ళు విడిదికని తీసుకున్న గది తలుపులు బార్లా తెరిచి వున్నవి. అందరికన్న ముందు నడుస్తున్న శశిముఖి గదిలో అడుగు పెడుతూనే శిథిలాలయ పూజారిని చూశాడు. పూజారి ఒక చిన్న కొయ్యపెట్టెను బద్దలు కొట్టేందుకు ఒక చురకత్తి పిడితో దాని మీద బలంగా కొడుతున్నాడు.

శశిముఖి వాకిట్లోకి రాగానే పూజారి తల ఎత్తి అతడి కేసి చూసి, వికృతంగా నవ్వుతూ, "శశీ, మంచి సమయానికే వచ్చావే! సరే, నువ్వూ నీ స్నేహితులూ గడప దగ్గిరే ఆగండి. ఈ తుక్కుపెట్టెను తెరిచేందుకు నా మంత్రశక్తిని వృథా చెయ్యటం ఎందుకని, యీ చురకత్తిని వాడుతున్నాను," అన్నాడు.

శశిముఖి గడప దగ్గిరే ఆగి, వెనక నిలబడివున్న క్షత్రియ యువకులైన అజితుడికీ, వీరభద్రుడికీ కనుసైగతో ద్వారాన్ని కాపలాకాయమని హెచ్చరించి, ముందుకు రెండడుగులు వేసి, "పూజారీ! ఆ పెట్టెలో





శిథిలాలయానికి పోయేందుకు అవసరం అయిన దారి గుర్తులు గల తాళపత్రం వున్నదనుకుంటున్నావా? ఊహుఁ, అది అక్కడ లేదు. అదుగో, కేసరి దాన్ని సర్వదా తన దుస్తుల్లో దాచుకు తిరుగు తున్నాడు. కొంచెం దగ్గిరకొచ్చి అడుగు, యిచ్చేస్తాడు," అన్నాడు.

విక్రమకేసరి తన దుస్తుల్లో నుంచి ఒక పెద్ద తాళపత్రం తీసి పూజారి కేసి రెపరెప లాడించాడు. పూజారి దాన్ని చూస్తూనే పళ్ళుకొరికి, "దాని కోసం అడగాలా? అడుగుతున్నాను; నోటితో కాదు కత్తితో!" అంటూ తన చేతులోవున్న చురకత్తిని విక్రమకేసరి కేసి విసిరాడు.

రానున్న ప్రమాదాన్ని ముందుగానే గుర్తించిన శిఖిముఖి, విక్రమకేసరిని భుజాలు పట్టుకుని కిందికి లాగాడు. చురకత్తి రివ్వుమంటూపోయి ద్వారబంధానికి బలంగా గుచ్చుకుపోయింది. శిఖిముఖి, పూజారిని పట్టుకునేందుకు ముందుకు దూకేంతలో అతడు గది వెనకవున్న తలుపు తెరుచుకుని పక్కనేవున్న పిట్టగోడ మీంచి కిందికి దూకేశాడు.

శిఖిముఖి, విక్రమకేసరి పిట్టగోడను ఒక్క త్రుటికాలం ఆలస్యంగా చేరారు. పూజారి అంత ఎత్తు నుంచి కిందపడి మరణిస్తాడని వాళ్ళనుకున్నారు. కాని, మిద్దె కింది ఆవరణలో నిలబడివున్న నవర భేరుండం, పూజారి నేల తాకకుండా మధ్యలోనే పట్టుకుని, అతణ్ణి, దాపులనున్న రెండు గుర్రాల్లో ఒకదాని మీద ఎక్కించి, తాను రెండో గుర్రం మీదికి లంఘించాడు.

శిఖిముఖి చప్పున వెనక్కుతిరిగి, "అజితా! వీరభద్రా! మీరు సత్వరం ఆవరణలోకి పరిగెత్తి, గుర్రాల మీద పారిపో చూస్తున్న ఆ దుర్మార్గుల్ని పట్టుకోండి!" అని కేకపెట్టాడు. అజితుడూ, వీరభద్రుడూ కిందికి పరిగెత్తారు. —(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 20

[శిఖిముఖి, విక్రమకేసరి యిద్దరు అనుచరులతో బ్రహ్మపుత్రానది లోయలకు బయలు దేరారు. వాళ్ళు కామాఖ్యానగరం చేరి ఒక సత్రంలో విడిది చేశారు. వాళ్ళు లేని సమయంలో పూజారి వాళ్ళుంటే మిద్దె మీది గదిలో ప్రవేశించాడు. శిఖిముఖి అతణ్ణి పట్టుకోవాలని ప్రయత్నిస్తే, పిట్టగోడ దూకి గుర్రం మీద పారిపోసాగాడు. తరవాత—]

సత్రం ముందు పెద్ద కలకలం రేగింది. ఇద్దరు హడావిడిగా గుర్రాల మీద పారి పోతూండటం, కత్తులు దూసిన యువకు లిద్దరు 'ఆగండి!' అంటూ వాళ్ళకేసి పరి గెత్తుతూండటం చూసి, సత్రంలో విడిది చేసినవాళ్ళు చాలామంది ఆవరణలోకి పరి గెత్తుకొచ్చారు. అజితుడూ, వీరభద్రుడూ వేగంగా పూజారివాళ్ళ వెనక కొంతదూరం పరిగెత్తారు. కాని, గుర్రాల మీద పారి పోతున్న అతణ్ణీ, సహచరబృందాన్నీ పట్టు కోవటం వాళ్ళకు సాధ్యమయేపని కాదు.

శిఖిముఖీ, విక్రమకేసరీ తమ గది తలుపు బంధించి మిద్దె మీది నుంచి కిందికి దిగి వచ్చారు. ఆ సరికి అజిత వీరభద్రులు రొప్పుతూ వాళ్ళ దగ్గిరకు వచ్చి, పూజారి దొరకలేదని చెప్పారు. ఆ దుర్మార్గుణ్ణి చేజిక్కించుకునే అవకాశం కొద్దిలో విఫల మైనందుకు శిఖిముఖి విచారపడ్డాడు.



అంత ఎత్తు మిద్దె మీది నుంచి పూజారి కిందికి దూకుతాడని ఆతడు అనుమానించలేకపోయాడు. నవరభేరుండం కింద కాచుకుని వున్న సంగతి ఆతడికి తెలియదు.

"శిఖీ! ఈ దుర్మార్గుడి బెడద మనకు వదిలేలాలేదు. మనం వాడితో తెలివితక్కువగా మాటలు పెట్టుకున్నాం. గదిలో ప్రవేసిస్తూనే వాణ్ణి కత్తితో నరకవలసింది," అన్నాడు విక్రమకేసరి.

"అవును. ఈసారి వాడు తటస్థపడితే మనం చేయబోయేది అదే. ఆ నీచుడితో మనకు మాట లేమిటి?" అన్నాడు శిఖిముఖి.



అక్కడ చేరినవాళ్ళు శిఖిముఖినీ, విక్రమకేసరినీ రకరకాల ప్రశ్నలు అడగసాగారు. ఎవరో యిద్దరు, పెద్ద దొంగతనం చేసి గుర్రాల మీద పారిపోయారని వాళ్ళనుకున్నారు. సత్రపు యజమాని చేతులు నలుపుకుంటూ నంగిగా, "అయ్యా, ఇందులో నా పొరపాటు చాలా వున్నది. మీరు లేనప్పుడు ఆ పూజారినని చెప్పినతణ్ణి మీ గదిలోకి పోనివ్వవలసింది కాదు. విలువగల వస్తువు లేమైనా ఎత్తుకుపోయాడా?" అని అడిగాడు.

"వాడిక్కావలసిన విలువైన వస్తువు లేవీ మా దగ్గిర లేవు. మేము యాత్రికులం; పుణ్యతీర్థాలు సేవించేందుకు బయలుదేరినవాళ్ళం. మా దగ్గిర విలువైన వస్తువు లేంవుంటవి?" అన్నాడు శిఖిముఖి.

"తమ గదిలో దొంగతనం జరగలేదని వినటం నాకు చాలా సంతోషం కలిగిస్తున్నది. ఆ పూజారినన్నవాడి ముఖలక్షణాలు చూస్తే, వాడు ఇఖ్యజాతి వాడిలా వున్నాడు. వాళ్ళెంత నమ్మకస్థులో అంత నమ్మకద్రోహులు," అన్నాడు సత్రం యజమాని.

ఆ రాత్రి శిఖిముఖి, విక్రమకేసరి సంప్రతించుకుని బ్రహ్మపుత్రానది లోయల్లో







ఇభ్యజాతి వాళ్ళుండే ప్రాంతాలకు దారి చూప గల వాళ్ళొకణ్ణి కుదుర్చుకోవటం మంచిదని నిశ్చయించారు. పెద్దమనిషిలా కనబడుతున్న సత్రం యజమానితో యీ మాట చెపితే, అతడు ఆశ్చర్యపడి, "ఆ ప్రాంతాలకు పోవటం అంత క్షేమం కాదు," అన్నాడు.

శిఖిముఖి ఆ మాటకు చిన్నగా నవ్వి, "మాకు ప్రాణాపాయం కలగవచ్చునే కదా మీరు భయపడుతున్నది. అలాంటి భయం మాకేం లేదు. మమ్మల్ని చంపినందువల్ల ఎవరికీ ఒరిగేదేంవుండదు. ఆ లోయల్లోని చిన్నా పెద్ద పవిత్ర స్థలాలన్నీ చూడదలిచాం. ముఖ్యంగా ఇభ్యజాతివాళ్ళుండే ప్రాంతాల అతి పురాతనమైన దేవాలయా లున్నవని విన్నాం. ఎంత కష్టనష్టాలకైనా సరే ఓర్చి వాటన్నిటినీ తప్పక దర్శించి తీరాలి," అన్నాడు.

"అయితే మీ యిష్టం. మీ ప్రయాణం ఎప్పుడో చెప్పండి. ఆ ప్రాంతాలు బాగా తెలిసిన వాళ్ళొకణ్ణి మీ వెంట పంపుతాను. వాడికి తిండీ తిప్పలూ మీరే చూడాలి. తిరిగివచ్చిం తరవాత పారితోషికంగా కొంత డబ్బు యివ్వవలసివుంటుంది," అన్నాడు సత్రంయజమాని.



శిఖిముఖీ, విక్రమకేసరి అందుకు అంగీకరించారు. మర్నాడు సూర్యోదయంవేళ పొట్టిగా బలంగా గున్నఏనుగుపిల్లలా వున్న ఒక నడి వయసువాణ్ణి, సత్రంయజమాని వాళ్ళ దగ్గిరకు తీసుకువచ్చి, "అయ్యా, అతడి పేరు జాంగ్లా. ఇభ్యజాతి వాళ్ళుండే ప్రాంతాలన్నీ తనకు బాగా తెలుసంటున్నాడు. ఇతడూ ఆ జాతివాడే," అని చెప్పాడు.

శిఖిముఖి అతణ్ణి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు. మనిషిముఖం చూసి స్వభావాన్ని కనిపెట్టేందుకు అతడికి సాధ్య మయేలా కనిపించలేదు. జాంగ్లా పెదాల









మీద చిరునవ్వు కదులుతున్నది. ముఖం మీద ఎలాంటి భావం ప్రస్ఫుటం కావటం లేదు. ఎండ వానలకు గురై, బాగా చీటలు బారిన నల్ల రాతిపలకలా వున్నది అతడి ముఖం.

జాంగ్లాను పరిచయం చేసి సత్రం యజమాని వెళ్ళిపోగానే, శిఖిముఖి అతడితో, "నీవు నమ్మకస్థుడివా కావా అన్న భయం మాకు లేదు. మేం నలుగురం, నువ్వొక్కడివి. కాని, నీకు ఇభ్యజాతి వాళ్ళుండే ప్రాంతాలు క్షుణ్ణంగా తెలుసునా లేదా అన్నదే నా అనుమానంగా వున్నది." అన్నాడు.

"నేనెంత నమ్మకస్థుణ్ణో మీరే తెలుసుకుంటారు. పోతే, నేను పుట్టి పెరిగింది ఇభ్యజాతి వాళ్ళుండే ప్రాంతానే. నేను ఆ జాతివాణ్ణేనని సత్రంయజమాని తమకు చెప్పాడు గదా? ఆయన నన్ను బాగా ఎరుగు," అన్నాడు జాంగ్లా.

"సరే, నీకు దాంభత్యం మేమే జరుపుతాం. ప్రయాణం ముగిసి తిరిగి ఈ కామాఖ్యానగరం చేరేంతరవాత, నీకు పారితోషికంగా అయిదు బంగారుకాసు లిస్తాం. ఇష్టమేనా? ఆలోచించుకుని చెప్పు," అన్నాడు శిఖిముఖి.

"ఆలోచనెందుకు, తమ దయ!" అన్నాడు జాంగ్లా.

"మమ్మల్ని ఆ లోయల్లోని గోలభరా అన్న ఇభ్యజాతి గ్రామం చేర్చాలి. ఆ దాపుల్లో ఎక్కడో అతిపురాతనమైన ప్రసిద్ధ దేవాలయం వున్నదని విన్నాం." అన్నాడు శిఖిముఖి.

గోలభరా అన్న పేరు వింటూనే జాంగ్లా కొంచెం ఉలిక్కిపడి, "చిత్తం. అలాగే అక్కడికి దారి చూపుతాను, ఆ గ్రామం నేనెరిగినదే. కాని, మీ రన్నట్టు అక్కడ ప్రసిద్ధ దేవాలయం ఏమీ లేదు. తరవాత నన్ను తప్పుపట్టకుండా ముందే







వున్న సంగతి తమకు మనవి చేసుకుం
టున్నాను," అన్నాడు.

"ఉన్నట్టు మేం విన్నాం, అవునా, కేసరీ?" అంటూ శిఖిముఖి విక్రమకేసరి కేసి చూసి, అతడు అవునన్నట్టు తల వూప గానే, జాంగలాతో, "నువ్వు మాకు ఆ గ్రామానికి దారి చూపు. అక్కడికి చేరింతరవాత, సంగతి మేం చూసు కుంటాం. ప్రయాణం యీ సాయంకాలమే, సిద్ధంకా," అన్నాడు.

జాంగలా వాళ్ళకు నమస్కరించి వెళ్ళి పోయాడు. ఆ సాయంత్రం తమకు దారిలో అవసరం అయిన ఆహార పదార్థాలనూ, ఇతర సామగ్రినీ రెండు కంచరగాడిదల మీద వేసుకుని, శిఖిముఖీ, విక్రమకేసరి నదీ లోయల కేసి బయలుదేరారు. జాంగ్లా వాళ్ళకు ముందు నడుస్తూ దారి చూప సాగాడు.

చీకటిపడుతూనే అందరూ అరణ్యం లోని ఒక చిన్న కొలను ప్రాంతం చేరారు. ఆ రాత్రికి అక్కడ ఆగి, వంట చేసుకుని, మర్నాటి వేకువజామున తిరిగి ప్రయాణం కావటానికి వాళ్ళు నిశ్చయించుకున్నారు. వంటపనిలో అజితుడూ, వీరభద్రుడూ నిమగ్నులయారు. జాంగలా ఎండుపుల్లలు




తీసుకువస్తానని శిఖిముఖితో చెప్పి, అరణ్యం లోకి పోయాడు

శిఖిముఖీ, విక్రమకేసరి ఒక చెట్టు వానుకుని కూర్చుని తమ ముందు కార్య క్రమాన్ని గురించి మాట్లాడుకో సాగారు. విక్రకేసరికి, జాంగలా మీద పూర్తి నమ్మకం కలగలేదు. వాడు తమను తప్పు దారి పట్టిస్తాడేమో అన్న అనుమానం అతడు బయటపెట్టాడు. శిఖిముఖిని యిలాంటి అనుమానమే అప్పుడప్పుడూ పీడిస్తున్నది.

"మన జాగ్రత్తలో మనం వుందాం. ఈ జాంగలా, శిథిలాలయ పూజారి అను







చరుడేమో అనేగదా నీ భయం. ఆ దుర్మార్గుడే మనను ఏమీ చేయలేనప్పుడు, యీ వెధవ చేయగలిగిం దేమిటి?" అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి ఏదో జవాబు చెప్పబోయేంతలో, ఎర్రగండు చిన్నగా మొరిగి, దాపుల నున్న గుబురుచెట్ల కేసి బయలుదేరింది. శిఖిముఖి కుక్క వాలకం చూసి, విక్రమకేసరిని హెచ్చరించి, దాని వెనకనే నిశ్శబ్దంగా నడిచారు.

విక్రమకేసరి కత్తి దూసి నిలబడి, చూట్టూ అలముకుంటున్న చీకటిలోకి గుచ్చి గుచ్చి చూడసాగారు.



ఎర్రగండు చెట్లల్లో కొంత దూరం ముందుకు పోయి ఒక చోట ఆగి, తల పైకెత్తి మొరగ సాగింది. నేలకు దాదాపు ఆయిదా రడుగుల ఎత్తులో దట్టంగా పరుచుకుపోయిన చెట్లకొమ్మల కేసి, శిఖిముఖి పరీక్షగా చూశాడు. అక్కడ శత్రు వెవడైనా దాగివున్నాడేమో అన్న సంశయం అతడి కక్కలిగింది. కాని అక్కడ ఎవరూ వున్నట్టు లేదు. అంతలో అతడికి దూరంగా ఎవరో చిన్నగొంతుతో మాట్లాడుతున్నట్టు అనుమానం కలిగింది. అతడు ముందుకు నడవబోయాడు. ఎర్రగండు అతడి దారిని అడ్డగిస్తూ తల పైకెత్తి పెద్దగా మొరగటం ప్రారంభించింది.

ఈసారి శిఖిముఖికి అడుగుల చప్పుడు స్పష్టంగా వినబడింది. చూస్తూండగానే జాంగ్‌లా భుజం మీద యిన్ని ఎండుపుల్లలు పెట్టుకుని వేగంగా అతడి కేసి రాసాగాడు. శిఖిముఖి అతడి కేసి రెండడుగులు వేసేంతలో చెట్లకొమ్మల్లోంచి ఒక పెద్ద కొండచిలువ తపీ మంటూ జాంగ్‌లా మీద పడి, అతడి శరీరాన్ని బలంగా చుట్టివేయసాగింది. ఎర్రగండు పెద్దగా అరుస్తూ ముందుకు దూకింది. జాంగ్‌లా ఒక చావుకేక పెట్టాడు.









శశిముఖి ఓ క్షణకాలం కొయ్యబారి పోయాడు. మరుక్షణంలో అతడికి బాంగలా ఎలాంటి ఘోర ప్రమాదంలో చిక్కు కున్నాడో అర్థమైంది. అతడు పరిగెత్తు కుంటూ పోయి కొండచిలువ తల నరికేం దుకు కత్తి దూశాడు. కాని, కొండచిలువ బాంగలాను నడుము నుంచి పైన తన దేహంతో బలంగా చుట్టి అతడి తలను బిగించి పట్టుకునేందుకు ప్రయత్నిస్తున్నది. ఆ చీకట్లో కత్తి గురి ఏమాత్రం తప్పినా కొండచిలువ తలకు బదులుగా బాంగలా తల తెగి కింద పడే ప్రమాదం వున్నది.

బాంగలా ఉక్కిరిబిక్కిరై పోతూ చిన్నగా మూలుగుతున్నాడు. శశిముఖి, "భయ పడకు బాంగలా! ఇదుగో కొండచిలువను నరికేస్తున్నాను." అంటూ ఎడమచేత్తో పాము మెడ పట్టుకుని ముందుకి లాగుతూ, అదే సమయంలో కత్తితో దాని మెడ మీద బలంగా కొట్టాడు.

తల తెగిపోగానే, బాంగలా శరీరం మీది నుంచి కొండచిలువ దేహం మెలికలు తిరుగుతూ కింద పడిపోయింది. బాంగలా పెద్దగా మూలిగి ఒక పక్కకు దభీమంటూ పడిపోయాడు. ఈ గందరగోళం అంతా విన్న విక్రమకేసరి, అజిత వీరభద్రులూ అక్కడికి పరిగెత్తుకు వచ్చారు.

శశిముఖి, బాంగ్గలాను లేవనెత్తేందుకు వంగుతూ, "కొండచిలువ తల నరికాను. దాని పట్టులో చిక్కి నీ కాళ్ళూ చేతులూ ఏమైనా విరిగిపోలేదు గదా?" అన్నాడు.

బాంగలా జవాబిచ్చేందుకు గొంతు సవ రించుకునేంతలో చీకట్లో నుంచి, "ఆమా రీలు భక్తితో పూజించే కొండచిలువ తల నరికిన వాడెవడు? ఇదుగో, నీ తల నరక బోతున్నాం, కాచుకో!" అంటూ నలుగు రైదుగురు భయంకరాకారులు, పెద్ద పెద్ద శూలాలు పైకెత్తి, శశిముఖి కేసి పరిగెత్తుకు రాసాగారు. —(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 21

[శిఖిముఖి కామాఖ్యానగరం నుంచి, జాంగ్లా అనే ఒక జబ్బుజాతివాణ్ణి దారి చూపేందుకు వెంటబెట్టుకుని బ్రహ్మపుత్రా నదీలోయలకు బయలుదేరాడు. వాళ్ళు ఒక మహారణ్యంలో వుండగా జాంగ్లాను కొండచిలువ పట్టుకున్నది. శిఖిముఖి దాన్ని చంపాడు. అది చూసిన అఘోరీలనే సన్యాసులు కొందరు అతని మీదికి రాసాగారు. తరవాత—]

తన మీదికి వచ్చే అఘోరీలను చూసి శిఖిముఖి, తనకు చావు తప్పదనుకున్నాడు. వాళ్ళెంత క్రూరులో తన తండ్రి చెప్పగా లోగడ అతడు వినివున్నాడు. కాని, ఈ సమయంలో పారిపోవటం గాని, వాళ్ళను ప్రాణభిక్ష కోరటం గాని అవమానకరంగా శిఖిముఖికి తోచింది. చావు తప్పనిసరి అయితే, వాళ్ళను ప్రతిఘటించి పోరాడుతూ చావటమే మేలనుకున్నాడతను.

శిఖిముఖి యిలా ఆలోచించి కత్తి పైకెత్తి పెద్ద గొంతుతో, "విక్రమకేసరీ! నువ్వు మన అంగరక్షకులతో తక్షణం అక్కణ్ణించి పారిపో. నన్ను అఘోరీల దండు చుట్టుముట్టుతున్నది. నా రక్షణకు వచ్చి నువ్వు అనవసరంగా చావటం ఎందుకు?" అని కేక పెట్టాడు.

శిఖిముఖి మాట ముగించే లోపలే, అఘోరీల్లో ఒకడు అతణ్ణి శూలంతో పొడవ







పోయాడు. కళిముఖి దాని దెబ్బ తప్పుకుని, ఆ అఘోరీని కత్తితో మెడ మీద బలంగా కొట్టాడు. వాడు, "మహాకాళా!" అని అరుస్తూ పక్కకు పడిపోయాడు. ఇంతలో అఘోరీల్లో ఒకడు, "ఆగండి! వాణ్ణి చంప కండి. వాడు విక్రమకేసరి గురువు పేరు ఉచ్చరిస్తున్నాడు." అని కేక పెట్టాడు.

ఆ సమయానికి అక్కడికి మరి నలుగురు అఘోరీలు వచ్చారు. కళిముఖి కేక వింటూనే, పారిపోవటానికి మారుగా, విక్రమకేసరి, అజితుడూ, వీరభద్రుడూ కత్తులు దూసి అతడి రక్షణకు పరిగెత్తుకు వచ్చారు. అఘోరీల్లో మొదట మాట్లాడిన వాడు చేతులు చాచి తన వాళ్ళను కొంచెం వెనక్కు పొమ్మని చెప్పి, కళిముఖితో, "మీ కత్తులూ, ఈ బలమూ మా అఘోరీల ముందు ఎందుకూ కొరగావు. నేను నా అను చరుల్ని వెనక్కు పొమ్మన్నది, మీకు భయ పడి కాదు. అంతకు ముందు నువ్వు విక్రమకేసరి గురువు పేరు తలిచావు. అంతే కాకుండా ఆయన్ని పారిపొమ్మన్నావు. ఇది చాలా వింతగా వున్నది! ఎవరివి నువ్వు? ఆ విక్రమకేసరి గురువు ఎక్కడ?" అని ప్రశ్నించాడు.

కళిముఖికి ఆ ప్రశ్నతో పరిస్థితి చాలా వరకు అర్థమైపోయింది. తాత విక్రమకేసరి చాలాకాలం పాటు అఘోరీలు వుండే ప్రాంతాన నివసించినట్టు, అతడు వదిలి పోయిన తాళపత్రాల ద్వారా తెలుస్తున్నది. తను కేకపెట్టి పారిపొమ్మన్నది, ఆ విక్రమ కేసరినేనని వీళ్ళనుకుంటున్నారు.

విక్రమకేసరి తన సమీపానికి రాగానే కళిముఖి అతణ్ణి తనను ప్రశ్నించిన అఘో రీకి చూపుతూ, "ఇతడే విక్రమకేసరి! ఈయన తాతగారైన విక్రమకేసరి మహా రాజు కొన్నేళ్ళ క్రితం ఈ ప్రాంతాలకి వచ్చాడు. ఆయన ఏమైనదీ తెలియలేదు. ఆయన్ని వెతికేందుకే మేము [illegible]







దేశం నుంచి బయలుదేరి ఈ ప్రదేశానికి వచ్చాం." అన్నారు.

శశిముఖిని ప్రశ్నించిన అఘోరీ తతిమ్మా వాళ్ళకు నాయకుడు. అతడు శశిముఖి ఇచ్చిన జవాబు వింటూనే, విక్రమకేసరి ముందుకు వచ్చి వంగి నమస్కరించి, "విక్రమకేసరి గురువు పోలికలన్నీ మీలో వున్నవి. ఆయన మా ముఠా అఘోరీలకు అవసరమయాల్లో సలహా లిచ్చి, దీర్ఘ రోగాలను మూలికా చికిత్సతో నయంచేసి ఎంతగానో పాటుపడ్డాడు. ఆయన ఋణం తీర్చుకో లేనిది. కాని..." అంటూ శశిముఖి ముఖంలోకి గుచ్చిగుచ్చి చూస్తూ, "అతడు చెప్పేది నా కేం అర్థం కావడం లేదు. విక్రమకేసరి గురువు యింకా బతికుంటాడని మీ రెందుకు భావించారు? ఒకవేళ ఆయన బతికే వుంటే మీ దేశానికి ఎప్పుడో తిరిగి వచ్చేవాడు కదా?" అన్నారు.

"ఆయన యింకా సజీవులై ఉన్న కొన్ని వదంతులు మేం విన్నాం. బ్రహ్మపుత్రా నది లోయల్లోని ఒకానొక శిథిలాలయ ప్రాంతానికి ఆయన వెళ్ళినట్టూ, తరవాత ఆయన జాడ తెలియకుండా పోయినట్టూ, మాకు లభించిన తాళపత్రాల ద్వారా మేము ఊహించాం." అన్నాడు శశిముఖి.



"మీ ఊహ సరైనదే. విక్రమకేసరి గురువు గఘ్నారాతి వాళ్ళు నివసించే లోయ ప్రాంతాలకు వెళ్ళారు. తరవాత ఆయన జాడ మాకు తెలియలేదు. గఘ్నాలు ఆయన్ని చంపి వుంటారని మేం అనుకోం, ఆ ప్రాంతాల ఆయన ఏదో భయంకర వ్యాధికి గురై మరణించి వుంటాడని మా నమ్మకం," అన్నాడు అఘోరీల నాయకుడు.

"అదేదో ఇదమిత్థంగా తెల్సుకో దలిచాం. కాని, మాకు ఒకానొక పూజారి నుంచే కాక, మీ అఘోరీల నుంచి కూడా ప్రమాదాలు తప్పనట్టున్నవి." అన్నాడు శశిముఖి.









ఆ మాటకు అఘోరీల నాయకుడు నవ్వి, "మా వాళ్ళ నుంచి మీకు ఎలాంటి హాని కలగకుండా, ఇదిగో ఈ రుద్రాక్షల దండ నీ ముంజేతికి కడుతున్నాను. ఆ పూజారి సంగతి నాకు తెలియదు. మీ జాగ్రత్తలో మీ రుండండి. మీ దేశానికి తిరిగి పోయేలోపల మిమ్మల్ని ఈ మహారణ్యాల్లో ఎక్కడో మరోసారి మేం తప్పక కలుసు కుంటాం. నా పేరు ఘోరచిత్రుడు," అని చెప్పి, శిఖిముఖి చేతికి రుద్రాక్షల దండ కట్టి, చావు బతుకుల్లో వున్న తమ అనుచ రుల్ని తనవాళ్ళచేత పట్టించుకుని అఘోరీల నాయకుడు వెళ్ళిపోయాడు.

శిఖిముఖి తామంతా దిగిన చెట్టు కిందికి వచ్చాడు. అజిత, వీరభద్రులు వంటపనిలో నిమగ్నులయ్యారు. శిఖిముఖి, విక్రమకేసరిని దూరంగా తీసుకుపోయి, బాంగ్లాను కొండ చిలువ పట్టుకునే ముందు, తాను చెట్ల చాటున ఎవరో మాట్లాడుతున్న శబ్దం విన్న సంగతి చెప్పాడు.

"బాంగ్లాను ప్రశ్నించి నిజం తెలుసు కోవచ్చు గదా?" అన్నాడు విక్రమకేసరి.

"వాడు మనకు తెలియకుండా మరెవరి తోనో చెట్ల చాటున మాట్లాడివుంటే—మన ప్రశ్నలకు వాణ్ణుంచి నిజం బయటపడదు. ఒకవేళ నేనే పొరబడి వుండవచ్చు. గాలికి చెట్ల ఆకులూ, చిరుకొమ్మలూ చేసే శబ్దం కూడా ఒకోసారి ఎవరో గుసగుసలాడు తున్నట్టు ధ్వనించటం జరుగుతుంది. ఏమైనా మనం మరి కాస్త అప్రమత్తులంగా వుండాలి," అన్నాడు శిఖిముఖి.

వంట పూర్తవగానే అందరూ భోజనాలు చేశారు. ఆ సరికి బాంగ్లా ఒళ్ళునొప్పులు పోయి, మామూలుగా నడవసాగాడు. చెట్టు కింద శిఖిముఖి, విక్రమకేసరి తమ వెంట తెచ్చిన నారపట్టాలతో చిన్న గుడారం వేసు కుని, దానిలో పడుకున్నారు. అజితుడూ, వీరభద్రుడూ, బాంగ్లా కంచరగాడిదలకు







మేత వేసి, తాము దిగిన చోటుకు చుట్టూ అక్కడక్కడా నెగళ్ళు వెలిగించారు. అప్పటికే జాము పొద్దుపోవటంతో తతిమ్మా మూడు జాముల రాత్రిలోనూ, జాముకొకరు చొప్పున మేల్కొని వుండి, కాపలా కాయటానికి ఏర్పాట్లు చేసుకున్నారు.

మొట్టమొదటి కాపలా వంతు అజితుడిది. అతడు నెగళ్ళు ఆరిపోకుండా మధ్యమధ్య వాటి మీద ఎండుపుల్లలు వేస్తూ, చుట్టూ వున్న చీకట్లో నుంచి ఏవైనా మృగాలు గాని, శత్రువులు గాని వస్తున్నారేమో కనిపెట్టేందుకు గుచ్చి గుచ్చి చూడ సాగాడు. ఆ జాము కాలమూ ఎలాంటి దుర్ఘటనా లేకుండా గడిచిపోయింది. దూరంగా అరణ్యంలో పులి అరుపూ, నక్క కూతలూ మాత్రం అజితుడు విన్నాడు. మధ్యమధ్య ఏదో ఈల లాంటి ధ్వని కూడా అతడి చెవుల బడింది. బహుశా అది వెదురు పొదల్లో గాలి చేసే శబ్దం అయివుంటుందనుకున్నా డతను.

అజితుడి వంతు అయిపోగానే జాంగ్లా కాపలాకు పూనుకున్నాడు. అజితుడు పోయి వీరభద్రుడికి అంత ఎడంలో పడుకున్నాడు. కాని అతడికి నిద్ర సరిగా పట్టలేదు. అఘోరీల దాడి చూసింతరవాత అతడికి యీ అరణ్యంలో ఏ నిమిషాన ఎలాంటి ప్రమాదం వస్తుందో అన్న భయం పట్టుకున్నది.

కొద్ది కాలం గడిచింది. అజితుడు కొంచెం సేపు నిద్రలో జోగి, దూరాన్నుంచి ఏదో క్రూర జంతువు అరుపు వినబడగానే మత్తుగా కళ్ళు తెరిచి చూశాడు. జాంగ్లా నెగళ్ళ పక్కగా నిలబడి అరణ్యంలోకి చూస్తున్నాడు. వాడు సరిగా కట్టెలు వేయనందున నెగళ్ళు క్రమక్రమంగా ఆరిపోతున్నవి.

అజితుడు లేచి వాణ్ణి గట్టిగా కొప్పడదామనుకున్నంతలో, చెట్ల దాటు నుంచి





సన్నని ఈల వినబడింది. ఆ వెంటనే ఖాంగేలా ఈటె భుజాన పెట్టుకుని కూర్చున్నాడు. ఏదో మోసం జరగబోతున్నదని అజితుడు అనుకుని నిశ్శబ్దంగా తల తిప్పి శిలీముఖి, విక్రమకేసరులు నిద్రపోతున్న గుడారం కేసి చూశాడు. ఆ సమయంలో అక్కడ కనిపించిన దృశ్యం అతణ్ణి నిలువెల్లా కంపించేలా చేసింది.

చిరుతపులి ఒకటి గుడారాన్ని సమీపించి, నేలను మూచూసి, గుడారం వస్త్రాల ఖాళీ లోంచి లోపలికి తలపెట్టబోతున్నది. ఇంత జరుగుతుంటే ఎర్రగండు ఏం చేస్తున్నట్టు? అనుకున్నాడు అజితుడు. అతడికి రానున్న ప్రమాదం అర్థం కాగానే, అంతవరకూ వున్న భయం కాస్తా ఎగిరిపోయింది.

"వీరభద్రా, లే! ప్రమాదం ముంచుకు వస్తున్నది!" అంటూ అతడు ఎగిరి లేచి, చేతిలో వున్న ఈటెను గురిచూసి చిరుతపులి కేసి విసిరాడు. అదృష్టం కొద్దీ ఆ ఈటె సూటిగా పోయి చిరుతపులి రొమ్ముల్లో గుచ్చుకున్నది. బాధతో అది పెద్దగా బొబ్బరిస్తూ, పడుతూ లేస్తూ దూరంగా వున్న పొదల కేసి పోసాగింది.

అజితుడి కేకలూ, చిరుతపులి బొబ్బరింతల్లో శిలీముఖి, విక్రమకేసరి నిద్ర లేచి కత్తులు దూస్తూ గుడారం నుంచి బయటికి







వచ్చారు. ఈలోపల అజితుడు, నిద్రలేచిన వీరభద్రుడితో, జాంగ్లా పారిపోతుండగా చూస్తూండమని చెప్పి, శశిముఖి వాళ్ళ దగ్గరకు పరిగెత్తి పోయి, జరిగిం దేమిటో రెండు మాటల్లో చెప్పి, "ఆ పొదల చాటు నుంచి ఈల వినిపించింది. అక్కడెవరో దాగివున్నారని నా అనుమానం," అన్నాడు.

విక్రమకేసరి ఆ మాట వింటూనే, విల్లు తీసుకుని బాణం ఎక్కుపెట్టి, అజితుడు చూపిన పొదల కేసి ఒకదాని వెంట ఒక టిగా మూడు బాణాలు కొట్టాడు. మూడో బాణం జుయ్‌మంటూ పోయి ఒక పొదను తాకేసరికి, అక్కణ్ణుంచి పెద్దగా ఒక చావుకేక వినిపించింది మరుక్షణంలో పొద బాగా కదిలి నట్టయి, అందులో నుంచి నల్లని ఆకారం ఒకటి బయటికి పారిపోవటం కనిపించింది.

శశిముఖి, అజితుణ్ణి హెచ్చరిస్తూ, "ఈ గుడ్డివెన్నెల్లో వాణ్ణి ఒంటరిగా వెంబడిం చటం ప్రమాదం. శత్రువులు మరి కొందరు ఆ చుట్టుపక్కల ఎక్కడైనా దాగివుండొచ్చు. మీ యిద్దర్లో ఒకరు జాంగ్లాను కనిపెట్టి వుండండి. మరొకళ్ళు మన సామాను రక్షణ చూడండి. నేనూ, కేసరీ పోయి ముందుగా, ఆ గాయపడిన చిరుతపులి ఎలా వుందో చూసి వస్తాం. గాయపడిన క్రూరమృగాన్ని వదిలి ఊరుకోవటం చాలా ప్రమాదం," అన్నాడు.

శశిముఖి, విక్రమకేసరి బయలుదేర గానే, అజితుడు, "శశిధరా! ఇంత జరుగు తున్నా ఎర్రగండు అరవకుండా మొరగ కుండా వున్నదేం?" అన్నాడు.

"దానికి ఎవరో ఎవరో ఏమిటో — ఈ జాంగ్లా మత్తుమందు పెట్టాడు. నీ కేక వినపడగానే దాన్ని తట్టి లేపాలని చూశాను. అది మత్తుగా పడి వున్నది... అదంతా తర వాత చూద్దాం," అన్నాడు శశిముఖి.

వెలుగుతున్న కర్ర ఒకటి తీసుకుని శశిముఖి, విక్రమకేసరి పొదలను సమీపిం





చెంతలో చిరుతపులి ఒకసారి గట్టిగా అరిచి వాళ్ళ మీదికి దూకబోయింది. కాని, బాగా గాయపడి వుండటం వల్లా, గుండెల్లో గుచ్చుకున్న ఈటె ముందుకాళ్ళకు అడ్డపడటం వల్లా, అది పొదలో నుంచి దూకుతూనే పక్కకు పడి గిలగిల్లాడ సాగింది.

కలిముఖి ఈటెతో దాని తల మీద రెండుసార్లు బలంగా పొడిచి, గుండెల్లో దిగి వున్న ఈటెను పట్టుకుని ఒక్క గుంజుతో బయటికి లాగారు. చిరుతపులి ఓ క్షణ కాలం గిల గిల తన్నుకుని ప్రాణాలు విడిచింది.

"కలి! ఇది చూశావా?" అంటూ విక్రమకేసరి తన ఈటెను చిరుతపులి మెడ మీద ఆనించారు. అక్కడ ఒక తోలు పట్టెడ—చిరుతపులి మెడకు బిగించి వున్నది కనిపించింది.

"ఇది పెంపుడు చిరుత. దీన్ని పెంచిన వాడు స్వయంగా వచ్చి మనం వున్న గుడారం మీదికి దీన్ని వదిలి పొదల్లో దాక్కున్నాడు. వాడు నీ బాణందెబ్బ తిన్నాడు. ఇక వాడి సంగతి చూద్దాం పద," అంటూ కలిముఖి బయలుదేరారు.

ప్రాణభయంతో గజగజ వణికిపోతున్న జాంగలా దగ్గరకు అతడు రాగానే, జాంగలా దణ్ణాలు పెడుతూ అతడి పాదాల మీద పడబోయాడు. కలిముఖి, వాణ్ణి మెడ పట్టుకు గుంజి నిలబెట్టి, వాడి చేతిలో ఒక వెలిగే కట్టెపుల్ల పెడుతూ, "అన్ని సంగతులూ తరవాత మాట్లాడదాం. బాణందెబ్బ తిన్న నీ మిత్రుడు ఎలా వున్నాడో చూడాలి. ముందుండి దారితియ్యి. పారిపోవాలని చూశావో, నీ వెన్నులో ఈటె గుచ్చుతాను." అన్నారు కఠినంగా.

జాంగలా మరింతగా వణికిపోతూ పొదలకేసి నడవసాగాడు. వెనగ్గా కలిముఖి, విక్రమకేసరి బయలుదేరారు.

—(ఇంకావుంది)






## 22

[అఘోరీలు శిఖిముఖితో రాజీమాటలు మాట్లాడి తమ దారిన వెళ్ళిపోయారు. రాత్రివేళ శత్రువులు తమ మీదికి దొంగదాటుగా పంపిన చిరుతపులిని శిఖిముఖివాళ్ళు చంపారు. వాళ్ళకు సాయపడిన బాంగోబాను, గాయపడిన దాని ప్రభువు ఎక్కడున్నదీ తెలుసు కునేందుకు, కొండంచి దాని పాదముద్రల శిఖిముఖి అన్వేషించారు. తరవాత—]

వెన్నెలకాంతిలో శిఖిముఖివాళ్ళు మెల్ల మెల్లగా నడుస్తూ, గాయపడిన శత్రువు కోసం వెతకసాగారు. వారికి ఒక పొద దగ్గిర నెత్తురు మరకలు కనిపించాయి. అక్కడ విరిగిన కొన్ని చెట్టుకొమ్మలూ, ఆకులూ చెల్లాచెదురుగా పడివున్నాయి.

"కేసరీ, వాడు నీ బాణందెబ్బ తిన్నది, యీ పొద దగ్గిరే. కాని, ఎలాగో యిక్కడినుంచి పారిపోగలిగాడు. తెల్లవారవస్తుంది. ఇంకా యిక్కడ కాలయాపన చెయ్యటం ఎందుకు? ప్రయాణసన్నాహాలు చేద్దాం," అన్నాడు శిఖిముఖి.

"మన ప్రయాణానికి దారి చూపి సాయపడినవాడెవడు? ఈ బాంగోబా శత్రుపక్షంవాడని తెలిసిపోయింది గదా?" అన్నాడు విక్రమకేసరి.

"ఏ పక్షంవాడయినా, వీడు ప్రస్తుతానికి మన ఆధీనంలో వున్నాడు. కామాక్షి



నగరం నుంచి బయలుదేరేటప్పుడు, వీడు మనను ఇద్దుర్భాతివాళ్ళు నివసించే గోల్‌ఫరా గ్రామం చేరుస్తానని మాట యిచ్చాడు. ఆ పని వీడిచేత చేయించుదాం." అన్నాడు శిఖిముఖి.

"అంతా యీ దుర్మార్గుణ్ణి నమ్మటమా? మనను తప్పుదారి పట్టించి, ఆ శిథిలాలయ పూజారికి ఒప్పచెప్పగలడు!" అన్నాడు విక్రమకేసరి.

"అలాంటి భయం ఏమీ లేదు. వీడైనా మోసం చేయబోతున్నట్టు అనుమానం కలిగిన మరుక్షణం, ఈ జాంగ్‌లాను కత్తితో ముక్కలు ముక్కలుగా నరుకుతాను. మనకొచ్చిన చిక్కేమిటంటే, ఈ మహారణ్యాల్లో, నదీ లోయల్లో వీడు తప్ప, దారి చూపగలవాడు మరొకడు లేడు. వీణ్ణి అందుకు ఉపయోగించుకోక తప్పదు," అన్నాడు శిఖిముఖి.

"ఆ ఉపయోగించుకోవటం అదీ నీవే చూసుకోవాలి. నేను మాత్రం ఈ జాంగ్‌లాను ఒక్క క్షణం కూడా నమ్మను," అన్నాడు విక్రమకేసరి.

"నేనూ అంతే," అని శిఖిముఖి, జాంగ్‌లా కేసి తిరిగి, "జాంగ్‌లా, నిజం చెప్పు. నీకు డబ్బు మీద ఎక్కువ ఆశా, ప్రాణం మీద ఎక్కువ ఆశా?" అని ప్రశ్నించాడు.

జాంగ్‌లా ఓ క్షణకాలం తలవటా యించి, తరవాత చిన్నగొంతుతో, "శిఖిరా! నాకు రెంటి మీదా సమానమైన ఆశే వున్నది. ఒకటి లేకపోతే రెండోది వృథా!" అన్నాడు.

"ఎంత విశ్వాసఘాతుకుడివైనా, ఇప్పుడు అజాగ్రత్తవల్లనో, పరధ్యానం చేతనో నిజం చెప్పినట్టు కనబడుతున్నావు. ఈ క్షణం నుంచి నీ ప్రాణం నా గుప్పిట్లో వున్నది. ఎలాంటి మోసం చేయకుండా గోల్‌ఫరాకు మమ్మల్ని చేర్చిన మరునిమిషంలో నీకు





స్వేచ్ఛ యిస్తాను, కొంత ధనం కూడా యిస్తాను. విన్నావా?" అన్నాడు శిఖిముఖి.

"విన్నాను, దొరా! కామాఖ్యనగరంలో శిథిలాలయ పూజారి అంతులేని ధనం ఆశ చూపి, నన్ను వక్రమార్గం పట్టించాడు. ఇకనుంచి మీకు విశ్వాసపాత్రుడుగా బతుకుతాను." అన్నాడు జాంగలా.

శిఖిముఖి తలవూపి, జాంగలాను ముందు నడవమని, విక్రమకేసరితో రాత్రి తాము బసచేసిన చెట్టు దగ్గిరకు బయలుదేరాడు. వాళ్ళు ఆ చెట్టు దగ్గిరకు వచ్చే సరికి అజితుడూ, వీరభద్రుడూ ఎర్రగండుతో వినోదంగా ఆడుకుంటున్నారు. శిఖిముఖిని చూస్తూనే కుక్క ఆతడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చింది.

శిఖిముఖి, ఎర్రగండు తల నిమురుతూ, "మత్తుమందు దెబ్బ నుంచి యిప్పటికి కోలుకున్నావన్న మాట! అదుగో, ఆ మందు ప్రయోగించినవాణ్ణి ఓ కంట కనిపెట్టి వుండు. పారిపోవాలని చూస్తే, మమ్మల్ని హెచ్చరించ నవసరం లేదు. కంఠం కొరికి నెత్తురు తాగు," అన్నాడు జాంగలాను చూపుతూ.

ఎర్రగండు చిన్నగా మొరిగింది. జాంగలా వెలవెలపోతూ, "నేనిక నుంచి



తమకు విశ్వాసపాత్రుడైన సేవకుణ్ణి, దొరా!" అన్నాడు.

"ఆ సంగతి ముందుముందు నువ్వు రుజువు చేసుకోవలసి వున్నది. ప్రస్తుతానికి తాడుతో నీ చేతులు వెనక్కు విరిచికట్టి, పారిపోకుండా వుండేందుకు కంచరగాడిద మెడకు, ఆ తాడు బిగించబోతున్నాము." అన్నాడు శిఖిముఖి.

ఆ తరవాత అందరూ కలిసి తమ సామానులను రెండు కంచరగాడిదల మీదా వేసి తాళ్ళతో గట్టిగా కట్టారు. అజితుడు, జాంగలా చేతుల్ని వెనక్కు లాగి తాడుతో బలంగా ముడివేసి, రెండవ కొనను కంచర



గాడిద మెడకు కట్టారు. కేశముఖి ఆజ్ఞాపించగానే బాంగ్లా ముందుండి దారి తీయసాగాడు.

మిట్టమధ్యాహ్నం వరకూ వాళ్ళు అరణ్యంలో నడిచి, ఒక లోయలో ప్రవహిస్తున్న ఒక నది పాయను చేరారు. అది హిమాలయాల్లో పుట్టిన ఏదో ఒక పెద్ద నదికి ఉపనది అయివుంటుంది. నదిలో అక్కడక్కడా ఎత్తయిన రాళ్ళగుట్టలు వున్నవి. వాటి మీదా, నది అంచులంటా అనేక వందల సంఖ్యలో మొసళ్ళు వున్నవి.

కేశముఖి ఆ మొసళ్ళ కేసి వింతగా చూస్తూ, "కేసరీ! మనం బహుశా యీ



నది దాటవలసి వుంటుందనుకుంటాను. నీటి వేగం హెచ్చుగా వున్నా, నది వెడల్పు నూరు గజాలకన్న ఎక్కువ వుండదు. కాని, యీ మొసళ్ళకు చిక్కకుండా దీన్ని దాటటం పెద్ద చిక్కు సమస్యే," అన్నాడు.

"బాంగ్లా కావాలని మన నెక్కడికి నడిపించాడేమో అని నా అనుమానం. గోరీఖరా గ్రామం చేరేందుకు యీ నదిని దాటవలసిన అవసరం వున్నదా లేదా వాణ్ణి అడిగి చూస్తాను," అన్నాడు కేసరి.

అందరికన్న ముందు నడుస్తున్న బాంగ్లాను సమీపించి విక్రమకేసరి, "బాంగ్లా! ఈ మొసళ్ళ నదికి దారి తీశావేం! గోరీఖరా యింకెంత దూరం?" అని అడిగాడు.

బాంగ్లా రొప్పుతూ, "ఈ నదీతీరం వెంట నాలుగైదు కోసుల దూరం పోయి, ఒక కొండచరియ దాటి వెనక్కు తిరిగి ఒక కోసు దూరం వస్తే, గోరీఖరా గ్రామం చేరవచ్చు. అలా కాక యిక్కడే నది దాటి వెళితే, ఆ గ్రామం సుమారు రెండు కోసుల దూరంలో వుంటుంది," అన్నాడు.

"నీ కోసుల లెక్క ఏదో కాస్త తికమకగా వున్నది. నదిలో యున్న మొసళ్లు వుండగా ప్రాణాపాయం లేకుండా దీన్ని దాటటం ఎలా?" అన్నాడు విక్రమకేసరి.









"చెక్కకొమ్మలు గాని, వెదురు గాని నరికి తెప్పలు కట్టి వాటిమీద నది దాట వచ్చు, దొరా," అన్నాడు బాంగ్‌లా.

అంతలో అక్కడికి శిఖిముఖి వచ్చాడు. విక్రమకేసరి బాంగ్‌లా చెప్పినదంతా అతడికి చెప్పి, నీ అభిప్రాయం ఏమిటని అడిగాడు.

"అది కొంచెం తాపీగా ఆలోచించవలసిన సంగతి. మనను ఈ బాంగ్‌లా గోల్‌ఖరా గ్రామం చేరుస్తున్నాడా, లేక శిథిలాలయపు పూజారి మాటు పెట్టుకు కూచున్న చోటుకు చేర్చబోతున్నాడో ముందుగా తెలుసుకోవాలి. ముందు ఇక్కడ వంటపనులు కానిచ్చి, భోజనాలు ముగించుకుని తరవాత ఏం చేయవలసిందీ ఆలోచిద్దాం," అన్నాడు శిఖిముఖి.

ఆ వెంటనే కంచరగాడిదల మీంచి సామానులు దింపి ఆటవికుడూ, వీరభద్రుడూ వంటపని ప్రారంభించారు. శిఖిముఖి, బాంగ్‌లా చేతికట్లు విప్పి, పారిపోవాలని ప్రయత్నిస్తే చావు తప్పదని హెచ్చరించాడు. ఈ లోపల విక్రమకేసరి ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి, అక్కడ్నించి పరిసరాలు పరికించాడు. అతడికి నది అవతల సుమారు రెండుమూడు కోసుల దూరంలో, ఒక కొండ



పాదం దగ్గిర్నుంచి పొగ వస్తూండటం కనిపించింది.

విక్రమకేసరి చెట్టు దిగివచ్చి, శిఖిముఖికి ఈ సంగతి చెప్పి, "అది గోల్‌ఖరాయే కావచ్చు," అన్నాడు.

"అయి వుంటుంది. భోజనాలైన తరవాత బాంగ్‌లాను చెట్టెక్కించి ఆ పొగ ఎక్కణ్ణించి వస్తున్నదో చూసి చెప్పమందాం. శిథిలాలయపు పూజారి కూడా మన దారి తెన్నులు చూస్తూ, ఈ ప్రాంతాల్లే ఎక్కడో వున్నట్టు తెలుస్తున్నది గదా. మనం తగు జాగ్రత్తలో వుండాలి," అన్నాడు శిఖిముఖి.









తరవాత అందరూ చెట్లనీడన కూర్చుని భోజనాలు చేశారు. నదిలో నుంచి నీరు తేవటానికి పోయిన అజితుడూ, వీరభద్రుడూ ఎంతో శ్రమపడి మొసళ్ళను చివరకొట్టి పాత్రల్లో నీళ్ళు నింపుకోవలసి వచ్చింది.

"కేసరి దొరా! ఈ నదిని మనం దాటాలని చూడటం ప్రమాదకరం. నది వెంట ఎగువకు పోయి, యీ జాంగ్లా చెప్పిన కొండచరియ ఏదో దాటి, గోలేభరా చేరటం బావుంటుంది," అన్నాడు అజితుడు.

"అదే ఆలోచిస్తున్నాం. అసలు యీ మోసకారి మాటల్లో వున్న నిజమెంతో ముందు తెలుసుకోవాలి గదా," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి, జాంగ్లాను దగ్గిరకు పిలిచి, దాపులనున్న మహావృక్షం ఒకటి ఎక్కి చుట్టుపక్కల పూజారిముఠాగాని, ఏదైనా గ్రామంగాని వున్నదేమో చూడమన్నాడు.

జాంగ్లా ఎలుగుబంటిలా చకచకా చెట్టు మీదికి పాకిపోయి, చుట్టూ ఓ మారు కలయచూసి, చిన్నగా నవ్వుకుని చెట్టు దిగి వచ్చాడు. వాడు నవ్వుకోవటం శిఖిముఖి వాళ్ళు గమనించలేదు.

జాంగ్లా, శిఖిముఖి దగ్గిరకు వచ్చి, "దొరా! దూరాన కొండల్లో గోలేభరా గ్రామం కొంచెంగా కనబడుతున్నది. గ్రామం చుట్టూ అరణ్యం కావటంతో కొత్త వాళ్ళు దాన్ని గుర్తించటం కష్టం. ప్రయాణమవుదామా?" అని అడిగాడు.

"ప్రయాణం యిప్పుడు కాదు, ఎండ తగ్గి చల్లబడ్డం తరవాత. నీ మిత్రులు—ఆ పూజారి ముఠా నది అవతల ఎక్కడైనా కనిపించిందా?" అని అడిగాడు శిఖిముఖి.

ఆ ప్రశ్న వింటూనే జాంగ్లా కొంచెంగా వణికి, "నన్నింకా నమ్మటం లేదా, దొరా! ఆ దుర్మార్గులు నా కంటబడితే ప్రాణాలతో వదలను," అన్నాడు.





"ఇదీ రుజువు కావలసిన సంగతే. కాని. ఒకవేళ నువ్వు ఏదైనా మోసానికి సాహసిస్తే మాత్రం నిన్నూ నేను ప్రాణాలతో వదలను." అన్నాడు శిఖిముఖి.

బాంగ్లా చేతులు రెండూ ఎత్తి శిఖిముఖికి నమస్కరిస్తూ, ఏమో చెప్పబోయేంతలో మేతకు వదిలిన కంచరగాడిదల్లో ఒకటి, నది ఒడ్డునే వున్న ఒక చెట్లపొద దగ్గిర్నుంచి పెద్దగా అరుస్తూ, దూరంగా పారిపోసాగింది. శిఖిముఖి, అజితవీరభద్రుల్ని దాన్ని మళ్ళీ వెనుకకు రమ్మని చెప్పబోయేంతలో, బాంగ్లా కర్ర ఒకటి తీసుకుని, గాడిద వేపు పరిగెత్తాడు.

విక్రమకేసరి చప్పున విల్లంబులు చేత బట్టి, బాంగ్లా కేసి గురి చేశాడు. ఒకవేళ వాడు అరణ్యవృక్షాల్లోకి పారిపోవాలని చూస్తే, బాణంతో కొట్టటానికి అతడు సిద్ధంగా వున్నాడు.

ఈలోపల అజిత వీరభద్రులు కూడా అటుకేసి బయలుదేరారు.

బాంగ్లా పరిగెత్తుతున్నవాడల్లా నది ఒడ్డునున్న చెట్లపొద దగ్గిరకు వెళ్తూనే తక్కున ఆగిపోయాడు. పొదలో నుంచి ఒక చిరుతగండు కోపంతో అరిచింది. అది ఆ సమయంలో అక్కడ తాను చంపిన లేడి నెరదాన్ని తింటున్నది. ముందు



కంచరగాడివా. తరవాత జాంగ్లా అక్క డికి పోయి దాన్ని రెచ్చకొట్టారు.

చిరుతపులి పొదలో నుంచి తల బయ టికి పెట్టింది. పొదకు ఒక గజం దూరంలో జాంగ్లా భయకంపితుడై, వెనక్కు అడుగు వేసేందుకూడా శక్తిచాలక నిలబడి పోయాడు. ఒక త్రుటికాలం యిలా చిరుత పులి, వాడూ ఒకరి ముఖాలొకరు చూసు కుంటూ స్థాణువుల్లా కదలామెదలక వుండి పోయారు. అంతలో చిరుత కసిగా అరిచి, జాంగ్లా కేసి లంఘించింది. జాంగ్లా చావు ఎలానూ తప్పదనుకుని కత్తితో బలంగా చిరుతపులి తల మీద కొట్టాడు. కాని, చిరుత బలం ముందూ, వేగం ముందూ అతడి శక్తి కొరగానిదై పోయింది.

చిరుతపులి, తన గొంతుపట్టుకోకుండా జాంగ్లా దాని మెడ మీద బలంగా ముష్టి ఘాతా లివ్వసాగాడు. అది కాళ్ళతో వాడి నడుం పట్టుకుని విదిలించింది. చిరుతా, జాంగ్లా కూడా ఒకళ్ళనొకళ్ళు బలంగా పట్టుకుని వుండటంతో, ఆ ఊపుకు పల్లంగా వున్న నదిలోకి దొర్లుకుంటూ పోయి, ప్రవా హంలో పడ్డారు.

ప్రవాహంలో పడినా ఒకళ్ళనొకళ్ళు వదలకుండా సంఘర్షిస్తున్న చిరుతా, మనిషి మీదికి పది పన్నెండు మొసళ్ళు అన్ని వైపుల నుంచి వేగంగా వచ్చిపడినై. కినారాల మీద జరిగిపోయిన యీ ఘోరం చూసి, కలిము లి నిశ్చేష్టులైపోయారు. కాని, విక్రమకేసరి, మొసళ్ళకేసి బాణం తరవాత బాణం కొట్టసాగాడు.

పోరాడుతూ ప్రవాహం వెంట కొట్టుకు పోతున్న చిరుతపులి, జాంగ్లాల కేసి, నది అవతలి ఒడ్డునున్న చెట్లలో నుంచి బాణాలు రివ్వురివ్వు మంటూ రాసాగినై. అక్కడెవరో దాగివుండి జాంగ్లాకు తగల కుండా, గురిగా చిరుతపులి మీదికి బాణాలు వదులుతున్నారు. —(ఇంకా వుంది)





# శిథిలాలయం

## 23

[జాంగ్‌లాను కంచరగాడిదకు కట్టించి, వాళ్ళే ముందుండి దారిచూపుమని శిఖిముఖి ఆజ్ఞాపించాడు. మధ్యాహ్నంవేళకు అందరూ ఒక నదీతీరం చేరారు. అక్కడ జాంగ్‌లా పైకి ఒక చిరుతపులి దూకింది. పులీ, వాడూ మొసళ్ళున్న నదిలో పడ్డారు. ఆ సమయంలో నది అవతలి నుంచి రివ్వుమంటూ బాణాలు రాసాగినై. తరవాత—]

నది అవతలి గట్టు నుంచి జాంగ్‌లా, చిరుత పులుల కేసి బాణాలు రావటం చూస్తూనే శిఖిముఖి ఓ క్షణకాలం ఆశ్చర్యపడి, విక్రమకేసరిని హెచ్చరించాడు. ఆ బాణాలు వదులుతున్నవాళ్ళు జాంగ్‌లా మిత్రులని అతడికి అనుమానం కలిగింది. ఆ మిత్రులు 'మరెవరో కాదు, పూజారిముఠా!

"కేసరీ! మనం నదీతీరం నుంచి కొంచెం వెనక్కు రావటం మంచిది. నది అవతలి నుంచి బాణాలు కొడుతున్నవాళ్ళు పూజారి ముఠా, సందేహం లేదు. మనం వాళ్ళ బాణందెబ్బకు అందుబాటులో వున్నాం. జాగ్రత్త!" అన్నాడు శిఖిముఖి.

శిఖిముఖి హెచ్చరిక వింటూనే కేసరి, అజితవీరభద్రులు నదీతీరం నుంచి బాగా వెనక్కు వచ్చేశారు. ప్రవాహంలో జాంగ్‌లా, చిరుతపులి ఒకరి నుంచి ఒకరు వేరుపడి పోయారు. జాంగ్‌లా మునుగుతూ తేలుతూ,







నది ఆవతలి ఒడ్డుకు చేరేందుకు ప్రయత్నిస్తున్నారు. చిరుతపులి గింగిరం తమ్ముకుంటూ ప్రవాహం వెంట కొట్టుకుపోతున్నది. మొసళ్ళు కొన్ని, బాణాలు తగలటంతో చెదిరిపోయి దూరంగా పోసాగినై.

ఈ స్థితిలో చెట్లచాటు నుంచి ఒక దృఢకాయుడు తెప్ప నొకదాన్ని తోస్తుకుంటూ వచ్చి నదిలోకి వదిలాడు. అతడి వెనకగా పరిగెత్తుకొచ్చిన యిద్దరు వ్యక్తులు ఎగిరి దానిమీద ఎక్కి, చిన్నచిన్న తెడ్లతో దాన్ని జాంగ్రా కేసి తోసుకుపోసాగారు. తెప్పలో కొచ్చిన దృఢకాయుణ్ణి చూస్తూనే శిలిముఖి వాడెవరైందీ గుర్తించాడు.



శిలిముఖి, విక్రమకేసరికి వాణ్ణి చూపిస్తూ, "వాణ్ణి గుర్తించావా? వాడు నవరభేరుండం, పూజారి నౌకరు. గురి చూసి బాణం గుండెల్లో దూసుకుపోయేలా కొట్టు." అన్నాడు.

విక్రమకేసరి బాణం వదిలేందుకు గురి చూసేంతలో, నవరభేరుండం అయిదారడుగుల ఎత్తున్న ఒక డాలును పట్టుకుని, దాని పించి తల పైకెత్తి శిలిముఖి కేసి చూస్తూ, "వాడెవడు, శిలిముఖా? శబర పెద్ద శివాలుడి కాడుగా? ఎక్కడి కుంభార మిట్టపల్లె, ఎక్కడి బ్రహ్మపుత్రానది లోయలు! దావదరిస్తే యింత దూరం రావాలా? వృథా ప్రయాస!" అన్నాడు.

నవరభేరుండం మాట ముగించే లోపలే విక్రమకేసరి వదిలిన బాణం రివ్వుమంటూ పోయి డాలు పైభాగాన్ని తాకి, కింద పడిపోయింది. భేరుండం ఆ దెబ్బకు ఎగిరి పడి, "నా మాటలు వినబడుతున్నయ్యా? ఈ డాలు పూజారి దగ్గర మంత్రించి నా కిచ్చింది. దీని వెనక వున్నవాడికి ప్రాణభయం లేదు!" అన్నాడు.

విక్రమకేసరి విల్లుకు మరో అంబు పెట్టి వదలబోయేంతలో నవరభేరుండం దగ్గరకు శిథిలాలయ పూజారి వచ్చాడు.







పూజారిని చూస్తూనే శిలిముఖి చప్పున విక్రమకేసరి కేసి తలతిప్పి. "కేసరీ! ఇప్పుడు నువ్వు కొట్టవలసింది శిథిలాలయ పూజారిని. బాగా గురి చూడు. మేము తక్కినవాళ్ళ సంగతి చూస్తాం." అన్నాడు.

ఆ వెంటనే శిలిముఖి, అజితవీరభద్రులు కూడా విల్లంబులు చేతికి తీసుకున్నారు. అందరూ మోకాళ్ళ మీద వంగి బాణాలు వదిలేందుకు గురి చూస్తున్నంతలో పూజారి పెద్దగా నవ్వుతూ కొంచెం వెనక్కుపోయి. "ఒరే, మూఢుల్లారా! మీ బాణాలు యింత దూరం వచ్చి నన్ను తాకలేవు. అయినా ప్రయత్నించండి." అంటూ కేకపెట్టి, తన పక్కనున్న అడవి దొంగలకు సౌంజ్ఞచేశాడు.

దొంగలు గబగబా విల్లుకు బాణాలు సంధించి, శిలిముఖివాళ్ళ కేసి విడవ సాగారు. కాని, అవి వాళ్ళవరకూ రాకుండా మధ్య వున్న నదిలో పడిపోసాగినై. శిలిముఖి అతడి అనుచరులూ వదిలిన బాణాలు కూడా, పూజారి ముఠాను తాకలేదు. ఈ విధంగా నాలుగైదు నిమిషాల పాటు బాణాలు వదిలిన తరవాత, యిందువల్ల ప్రయోజనంలేదని పూజారికీ, శిలిముఖికీ కూడా తెలిసిపోయింది.



శిలిముఖి తన అనుచరులకు యిక బాణాలు వృథాపరచవద్దని చెప్పి. "మనం ఊహించినట్టు శిథిలాలయ పూజారి మనను వెన్నంటే వస్తున్నాడు. మన కన్న ముందుగా వాడు నది దాటాడంటే, బహుశా వాడు యీ నదికి గోల్‌ఖరా గ్రామం పోయి అక్కడివాళ్ళ నుంచి శిథిలాలయాన్ని గురించి చాలా భోగట్టా సంపాయించి వుంటాడు." అన్నాడు.

"అలా జరిగినట్టే తోస్తున్నది. మాంగ్లాను మన మీద తెలివిగా ప్రయోగించి ఆ దుర్మార్గుడు మన రహస్యాలు చాలా గ్రహించాడు," అన్నాడు విక్రమకేసరి.









"ఇప్పటి సమస్య ఎవరు ముందుగా శిథిలాలయాన్ని చేరతారనేది. గోల్‌ఖరా గ్రామంలో దాన్ని గురించిన వివరాలు మనం తెలుసుకుందాం అనుకున్నాం. ఒక వేళ పూజారి అక్కడికి ముందుగా పోయినా మునిగిపోయేదేమీ లేదు. వాణ్ణి ఆ శిథిలాలయ ప్రాంతంలోనైనా చేజిక్కించుకుని సర్వనాశనం చేయగలం," అన్నాడు శిఖిముఖి.

నదికి ఆవతలి నుంచి పూజారి ముఠా, ఇవతలి నుంచి శిఖిముఖి అతడి అనుచరులూ ఒకళ్ళనొకళ్ళు కొంతసేపు క్రోధంగా చూసుకుంటూ నిలబడ్డారు. అప్పటి పరిస్థితుల్లో ఎవరికెవరూ హాని కలిగించలేరని రుజువైంది. శిఖిముఖి కొంచెం సేపు ఆలోచించి, విక్రమకేసరితో, "ఇక మనం, ఆ జాంగ్లా చెప్పిన కొండచరియ కేసి బయలుదేరదాం. గోల్‌ఖరా గ్రామం చేరేందుకు అది చుట్టుదారి అయినా తప్పదు. ఈ మొసళ్ళ నదిని శత్రువులు అవతలి గట్టున కాపు వేసుకుని వుండగా దాటాలని ప్రయత్నించటం ప్రమాదానికి దారి తీస్తుంది," అన్నాడు.

శిఖిముఖి ఇలా అనగానే అందరూ ప్రయాణసన్నాహాలు ప్రారంభించారు. తమతమ సామానులన్నీ కంచరగాడిదల మీద వేసి, నదితీరం వెంట నడుస్తూ సూర్యాస్తమయం వేళకు కొండ ప్రాంతాన్ని చేరి అక్కడున్న చిన్న కొండచరియనొక దాన్ని చూశారు.

నలుమూలలా చీకటి ముసురుకుంటున్న సమయంలో ఎదురుగా వున్న కొండచరియను దాటాలని చూడటం ప్రమాదకారణం అవుతుందని శిఖిముఖి, విక్రమకేసరి సంప్రదించుకుని నిర్ణయానికి వచ్చారు. ఆ ఇరుకు దారిలో పూజారి ముఠా ఏ రాళ్ళచాటునో వుండి తమ మీద హఠాత్తుగా దాడి చేయవచ్చు...









రాత్రి రెండు జాములు ముగిసేలోపలే అందరూ భోజనాలు చేశారు. తాము దిగిన చోట నెగడు వెయ్యటంవల్ల, పూజారి ముఠాకు తమ ఉనికి తెలిసిపోతుందన్న భయంతో శిఖిముఖివాళ్ళు నెగడు వెలిగించలేదు. కాని, కాపలాకు ఒకడు కాకుండా యిద్దరు చొప్పున వుండటం మంచిదని నిశ్చయించుకున్నారు.

అర్ధరాత్రిపరకూ, ఎక్కడో దూరాన అరణ్యమృగాల అరుపులు తప్ప, వాళ్ళున్న ప్రాంతాన మాత్రం ఎలాంటి సంచలనం కలగలేదు. ఆ తరవాత నదివైపు నుంచి ఏవో ధ్వనులు వినిపించసాగినై. వాటిక్కారణం నదిలోని మొసళ్ళు ఏదో ఆహారం కోసం పోట్లాడుకోవటంగా అజితవీరభద్రులు భావించారు. కాని, ఆ ధ్వనులు వున్నకొద్దీ మరింత అధికం కావటంతో వాళ్ళిద్దరూ కత్తులు చేతబట్టుకుని జాగ్రత్తగా నడుస్తూ నదిని సమీపించారు.

నల్లనిచీకటి పరుచుకుపోయిన నదిలో కొన్ని మానవాకారాలు కదులుతూండటం వాళ్ళిద్దరి కంటబడింది. శత్రువులు తెప్పల మీద నదిని దాటుతున్నారన్న సూచనగా వాళ్ళ ఛాయలు అటూయిటూ ఊగిసలాడుతున్నవి. అలా జరిగినప్పుడల్లా నీళ్ళు కలి విపట్టు శబ్దం చేస్తున్నవి. వాళ్ళు అతి జాగ్రత్తగా తెడ్లు వేస్తున్నారన్న మాట!

అజితవీరభద్రులు, శిఖిముఖిని, విక్రమకేసరిని హెచ్చరించేందుకు చప్పున వున్న చోటు నుంచి కదిలి వెనక్కు పరిగెత్తబోయారు. అంతలో వాళ్ళమీద చిక్కగా అల్లిన వెడల్పాటి వల ఒకటి విసురుగా వచ్చి పడింది. వాళ్ళు దానినుంచి తప్పుకునేందుకు ప్రయత్నించేలోపలే యిద్దరూ అందులో కదిలేందుకైనా వీలులేకుండా బిగించబడ్డారు. ఈ రకం వలల్ని ఆటవికులు జింకలనూ, లేళ్ళనూ పట్టేందుకు ఉపయోగిస్తూంటారు.









అజితవీరభద్రులు వలలో గిజగిజ తన్నుకుంటూ, తమ యజమానుల్ని హెచ్చరించేందుకు అరవబోయేంతలో రెండు బలమైన చేతులు వాళ్ళ కంఠాల మీద పడినై. వాళ్ళు ఉక్కిరిబిక్కిరైపోయారు.

"అరిచేందుకు ప్రయత్నించకండి. మీ నాయకులిద్దర్నీ యింతకు ముందే బంధించాం." అన్నదో కంఠం కోపంగా. ఆ మాట్లాడినవాడి దగ్గరకు మరిద్దరు ఆటవికులు వచ్చారు.

తమను బంధించినవాళ్ళు ఏనుగు చర్మాలు ధరించి వుండటం అజితవీరభద్రులు గుర్తించారు. అంటే వీళ్ళు కాళి కాలయ పూజారి మనుషులు కాదన్న మాట! ఇంతకు ముందు తమను హెచ్చరించినవాడన్నట్టు నిజంగా వీళ్ళు యువరాణి శశిముఖిని, విక్రమకేసరిని కూడా బంధించి వుంటారా?

వాళ్ళిద్దరి సంశయం తొలగిపోయేట్టు మరుక్షణంలోనే శశిముఖివాళ్ళు పడుకున్న గుడారం వైపు నుంచి ఎర్రగండు అరుపూ, మనుషుల కేకలూ వాళ్ళకు వినిపించినై. అక్కడ కొద్ది క్షణాలసేపు గందరగోళం లేచి సద్దు మణిగిపోయింది. అంతవరకూ ఆ దిక్కు కేసి చూస్తున్న ఆటవికుడు తృప్తిగా తలాడించి, తన పక్కన వున్న వాళ్ళతో, "ఈ యిద్దర్నీ అక్కడికి మోసుకురండి!" అంటూ గుడారం వున్న చోటుకు కదిలారు.

అజితవీరభద్రులున్న వలను యిద్దరిద్ద రాటవికులు కర్రకు వేలాడ కట్టుకుని గుడారం దగ్గరకు వచ్చి దింపారు. శశిముఖి చేతులనూ, విక్రమకేసరి చేతులనూ తాళ్ళతో బంధించి యిద్దరాటవికులు పట్టుకుని నిలబడి వున్నారు. ఎర్రగండు వలలో బంధించబడి వున్నది.

"వాళ్ళిద్దర్నీ వలలో నుంచి బయటికి లాగి చేతులకు తాళ్ళు బిగించండి.







ముక్కను మాత్రం వలలోనే వుంచి కర్రకు వేలాడకట్టి భుజానవేసుకు రండి. జాగ్రత్త, అది యిప్పటికే మనవాళ్ళిద్దరి గొంతులు కొరికింది," అన్నాడొక ఆటవికుడు. వాడు వాళ్ళ నాయకుడు.

"ఆ కంచరగాడిదల సంగతేమిటి, దొరా?" అని అడిగాడొక ఆటవికుడు.

"కులపెద్దకు బహూకరిద్దాం. యింత మంది జాతి కంచరగాడిదలు దొరకవు," అన్నాడు ఆటవిక నాయకుడు.

అంతవరకూ యిదంతా నిశ్శబ్దంగా చూస్తూ వూరుకున్న శశిముఖి పెద్దగా గొంతెత్తి అధికారం వుట్టిపడే స్వరంతో, "మీరెవరో మాకు తెలియదు. మేము మా మహారాజును వెతుక్కుంటూ యీ ప్రాంతాలకు వచ్చాం. హఠాత్తుగా దొంగల్లా మా మీదపడి మమ్మల్ని బంధించారు. ఇందుకు మీరు తప్పక ప్రతిఫలం అనుభవిస్తారు," అన్నాడు.

"ఈ బెదిరింపులూ, బతిమింపులూ మా కులపెద్ద వద్ద చేద్దువు గాని. కానీ మాతకు ప్రసాదం అయే ముందుగా మీ అందరికీ మాట్లాడేందుకు చాలా సమయం, అవకాశం వుంటుంది," అంటూ ఆటవికుల నాయకుడు వికవిక నవ్వాడు.



"మీది గోలేరరా గ్రామమా? మీరు ఋభ్యుజాతివాళ్ళా? మేం అక్కడికే వచ్చేందుకే బయలుదేరాం. కట్లు విప్పండి. మీ వెంటవస్తాం," అన్నాడు శశిముఖి.

"అదృష్టం కొద్దీ మీ రెక్కడికి బయలుదేరింది మాకు ముందే తెలిసింది. అంతేగాక మీ రెంత ప్రమాదకారులో కూడా విన్నాం. నువ్వన్నట్టు మేం ఋభ్యుజాతి వాళ్ళమే. ఇక మాట్లాడకుండా వెంట రండి," అంటూ ఋభ్యుల నాయకుడు తన అనుచరులను హెచ్చరించాడు.

అందరూ నదిని చేరి అక్కడ సిద్ధంగా వున్న తెప్పల మీద ఎక్కి నది దాటి







సూర్యోదయమయ్యేవేళకు గోళకర గ్రామం చేరారు. గ్రామంలోని జఘ్యజాతి వాళ్ళంతా—ఆడా మగా పిల్లలూ వీధుల్లో చేరి శిలీముఖివాళ్ళను వింతగా చూడ సాగారు. గ్రామం మధ్యనున్న ఒక విశాలమైన చుట్టు గుడిసెను చేరగానే జఘ్యుల నాయకుడు తన అనుచరులను గుడిసె ద్వారం దగ్గిర ఆగమని చెప్పి, శిలీముఖి వాళ్ళతో లోపలికి వెళ్ళారు.

గుడిసె మధ్య గల ఒక ఎత్తయిన ఆసనం మీద జఘ్యుల కులపెద్ద కూర్చుని వున్నాడు. అతడు చాలా వృద్ధుడు. నెరద్రాటి ముఖం, పెద్ద కళ్ళు, పొడవాటి మీసాలూ—అతడు చూడడానికి భయం కొల్పేట్టున్నాడు. అతడి వెనకగా జఘ్యజాతి మాంత్రికుడు నిలబడి వున్నాడు. దిగువన ఒక ముక్కాలిపీట మీద తృప్తిగా చిరునవ్వునవ్వుతూ శిథిలాలయ పూజారి కూర్చుని వున్నాడు.

"పూజారి కూడా యిక్కడున్నాడా? ఆశ్చర్యం!" అన్నాడు శిలీముఖి హేళన చేస్తున్నట్టు.

"మిమ్మల్ని శిథిలేశ్వరికి బలి పెట్టవలసిన పని వుంది గదా? అందుకోసం వచ్చాను." అన్నాడు పూజారి.

"ముందు కాళీమాతకు బలి యిచ్చిన తరవాత, ఆ ఎంగిలి ప్రసాదాన్ని నువ్వేమైనా చేసుకో. తెలిసిందా?" అంటూ జఘ్యజాతి మాంత్రికుడు కోపంగా పూజారి కేసి కళ్ళురిమాడు.

"శాంతించండి!" అంటూ జఘ్యుల కులపెద్ద చేయి చూపి, శిలీముఖి, విక్రమకేసరుల కేసి నిశితంగా చూస్తూ, "మీ నలుగుర్నీ బలి చేయాలని నాకు లేదు. మీలో నాయకుడెవడు? వాడొక్కణ్ణే కాళీమాతకు బలి పెడతాను. తతిమ్మావాళ్ళు స్వేచ్ఛగా తిరిగిపోవచ్చు. నాయకుడెవరో ముందు చెప్పండి?" అన్నాడు. —(ఇంకా వుంది)







"కులపెద్ద అనుమతి ముందుగా తీసుకుని తరవాత మాట్లాడాలి! ఆపాటి మర్యాద కూడా నీకు తెలియదా?" అన్నాడు.

పూజారి చిన్నగా మూలిగి చేత్తో వీపు తడుముకున్నాడు. ఖడ్గ కులపెద్ద మరోసారి మొదట వేసిన ప్రశ్నను శిఖిముఖి, విక్రమకేసరుల కేసి చూస్తూ గట్టిగా అడిగాడు. విక్రమకేసరి ఏదో జవాబు చెప్పబోయేంతలో శిఖిముఖి అతణ్ణి వారించి, "పూజారి చెప్పినట్టు నేనే యీ అందరికీ నాయకుణ్ణి. కాని, అతనన్నట్టు నేను వీళ్ళను ధనాశ చూపి యింత దూరం తీసుకురాలేదు. మేము యీ ప్రాంతాలకు వచ్చింది విక్రమకేసరి అనే మా మహారాజు కోసం. ఆయన యీ ప్రాంతాల ఎక్కడో వున్నాడని సమాచారం అందింది," అన్నాడు.

'విక్రమకేసరి' అన్న మాట వింటూనే ఖడ్గ కులపెద్ద ఉలిక్కి పడ్డాడు. అది గమనించిన పూజారి, "ఖడ్గనాయకా, మీ అనుమతితో మాట్లాడుతున్నాను. విక్రమకేసరి మహారాజు రాకాపోకా అంతా ఏళ్ళూ పూళ్ళనాటి మాట గదా? వీళ్ళు ఆయన పేరు ఎక్కడో విని, ఆ పేరు చాటున కపట నాటకం ఆడుతున్నారు. వీళ్ళు నిజంగా వచ్చింది, శిథిలాలయంలోని వెండి బంగారాలు దోచుకు పోయేందుకు," అన్నాడు.

ఖడ్గ కులపెద్ద తలాడించి ఒకటి రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, తరవాత శిఖిముఖిని, "మిమ్మల్ని గురించి నాకు సర్వం తెలుసు. అనవసర ప్రసంగం వద్దు. మీలో నాయకుడెవరు?" అని అడిగాడు కఠినంగా.

"చెప్పాను గదా. నేనే నాయకుణ్ణి! నాపేరు శిఖిముఖి!" అంటూ శిఖిముఖి ఒకడుగు ముందుకు వేశాడు.

విక్రమకేసరి అతని భుజం పట్టుకుని లాగుతూ, "నేను రాజవంశంవాణ్ణి, క్షత్రియుణ్ణి! నాకు ఆటవికుడు నాయకుడెలా





కాగలదు? వీళ్ల ముగ్గురికీ నాయకుణ్ణి నేను. నా పేరు విక్రమకేసరి. ఆ కాళీమాతకు నన్నే బలి పెట్టండి. కాని, బలి అయిపోయే ముందు మీలో కొందరినైనా బలి పుచ్చుకు తీరతాను," అన్నాడు రౌద్రంగా.

శిథిలాలయ పూజారి పెద్దగా నవ్వుతూ, ''ఎంత మోసం! తన పేరు విక్రమకేసరి అని పచ్చిఅబద్ధం ఆడేస్తున్నాడు. పైగా బభ్రుజాతివాళ్ళను బలి పుచ్చుకుంటాడట! అహ్హహ్హ!" అన్నాడు.

విక్రమకేసరి మాటలు బభ్రు కుల పెద్దకు బాగా కోపం తెప్పించినై. అతడు తన అనుచరుల్ని హెచ్చరిస్తూ, ''ఈ శిఖిముఖి, విక్రమకేసరులమని చెప్పుకునే వాళ్ళిద్దరూ చాలా ప్రమాదకారుల్లా వున్నారు. తక్షణం యిద్దర్నీ కాళీమాతకు బలి చెయ్యండి. మిగతా యిద్దరి సంగతి తరవాత ఆలోచిద్దాం. నడవండి, కాళీమాత ఆలయానికి," అంటూ ఆసనం మీదినుంచి లేచి బయలుదేరాడు.

శిఖిముఖి, విక్రమకేసరి ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళకు ఆ బభ్రుకుల పెద్దతో మాట్లాడి ప్రయోజనం లేదన్నభావం కలిగింది. తమకు మరణం ఎలాగూ తప్పదు, కాని వెంట వచ్చిన ఆకత వీర



భద్రులు అనవసర కష్టాలపాలు అవుతా రన్న భయం యిద్దర్నీ బాధించసాగింది.

బభ్రు కులపెద్ద వెనకగా అందరూ మట్టి గుడిసె నుంచి బయటికి వచ్చి, పెద్ద వీధి వెంట కొంతదూరం నడిచి, గ్రామానికి అల్లంత దూరంలో ఒక ఎత్తయిన ప్రదేశంలో వున్న కాళికాలయాన్ని చేరారు.

బభ్రు మాంత్రికుడు చేత కత్తి పట్టుకుని, భయంకర రూపంలో వున్న కాళికాదేవి విగ్రహం ముందుకు పోయి, పెద్ద స్వరంతో ఏవో మంత్రాలు చదివి, ''కట్లువిప్పి ఇక ఆ శిఖిముఖి, విక్రమకేసరి అనేవాళ్ళను దేవి ముందుకు తీసుకురండి," అన్నాడు.



మాంత్రికుడి ఆజ్ఞ కపిలాలయ పూజారికి చాలా సంతోషం కలిగించింది. అతడు అఘ్న కులపెద్ద పక్కన చేరి చెవిలో మెల్లిగా ఆవింత వీరభద్రుల్ని కూడా దేవికి బలి పెట్టటం బాగుంటుందని సలహా ఇచ్చాడు. దానికి కులపెద్ద అదేమీ కాదన్నట్టుగా తల ఊపసాగాడు. అతడి దృష్టి విక్రమకేసరి మీద కేంద్రీకరించబడి వున్నది. విక్రమకేసరి ముఖకవళికల్లో అతడికి తాను బాగా ఎరిగిన ఒక వ్యక్తి ముఖలక్షణాలు ఛాయా మాత్రంగా కనిపించసాగినై.

కళముఖి వాళ్ళను కొండచరియ దగ్గర పట్టుకున్న అఘ్న దళనాయకుడు, కళముఖని, విక్రమకేసరిని సమీపించి వాళ్ళ భుజాలు పట్టుకుని, కత్తిపత్తి సిద్ధంగా వున్న అఘ్న మాంత్రికుడి ముందుకు తేయబోయాడు. అదే అదనుగా విక్రమకేసరి గుప్పెట బిగించి అఘ్న దళనాయకుడి తలమీద బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు వాడు దిమ్మెరపోయి కింద పడేంతలో, కళముఖి మాంత్రికుణ్ణి కాలితో బలంగా ఒక్క తన్ను తన్నాడు. మాంత్రికుడు ఒక్క కేక పెట్టి పక్కకు పడిపోయాడు. అతడి చేతిలోని కత్తి ఎగిరి దూరంగా పడింది. కళముఖి ఆ కత్తిని దొరక పుచ్చుకునేందుకు ముందుకురికేంతలో, గద్దరు అఘ్నులూ, కపిలాలయ పూజారి బంటొకడూ అతడి మీద పడి చేతులు విరిచి పట్టుకున్నారు. విక్రమకేసరి అతడికి సహాయం వెళ్ళేలోపల అతడి మీద మరి నలుగురు అఘ్నులు వచ్చి పడి, కదలకుండా పట్టుకున్నారు.

క్షణంలో జరిగిపోయిన ఈ గందరగోళం చూసి అఘ్న కులపెద్దకు ఆశ్చర్యం, కోపం కూడా కలిగింది. అతడు కళ్ళెర్ర చేసి, మీసం మెలివేస్తూ కళముఖి ముందుకు పోయి, అతడి మెడ పట్టుకుని, "కాళీమాత ముందు నువ్వు చేసిన అపచారానికి నిన్ను

చిత్రవధ చేయిస్తాను! ఈ విక్రమకేసరి అని చెప్పేవాడు నేవాణ్ణి...."

అఘ్యకుల పెద్ద మాట ముగించే లోపల నక్షత్రముని తన మెడపట్టు వదిలించుకునేందుకు వీలుగా పక్కకు తిరిగాడు. ఆ ఊపుకు అఘ్యకుల పెద్ద చేయి పట్టుతప్పి, నక్షత్రముని మెడలో వున్న రక్షరేకు మీదపడి, దారంతెగి, అతని చేతిలోకి వచ్చింది.

రక్షరేకు మీద గల కాళీమాత రూపం చూస్తూనే అఘ్యకులంపెద్ద ఓ క్షణకాలం నిర్విణ్ణుడై పోయి, అంతలోనే తెప్పరిల్లి చేయెత్తి, "వీళ్ళిద్దరికీ ఎలాంటి హాని కలిగించకండి. ఇదేదో వింతగా వుంది!" అంటూ రక్షరేకును అటూ యిటూ తిప్పి పరీక్షించసాగాడు.

నక్షత్రముని, విక్రమకేసరులు క్షణాలమీద కాళీకాదేవికి బలైపోతారని ఎదురుచూస్తున్న శివాలయపు పూజారికి, అఘ్యకులపెద్ద మాటలు చాలా ఆశాభంగం కలిగించినై. అతడు జంకుతూ బొంకుతూ అతణ్ణి సమీపించి భుజం మీదుగా వంగి రక్షరేకు కేసి చూసి, పళ్ళు కొరికాడు.

"అఘ్యనాయకా! ఇది పచ్చిమోసం! దైవద్రోహం! ఈ దేవాలయంలోని పవిత్రమైన కాళీమాత రూపానికి, యీ నాస్తిక వెధవలు నకళ్ళు తయారుచేయించి, మెడల్లో





వేళ్ళాడగట్టుకు తిరుగుతున్నారు. ఎంత అపచారం! ఎంత అపచారం!" అంటూ శిఖిముఖి కేసి దూకబోయాడు పూజారి.

జఖ్యకులపెద్ద అతణ్ణి చేతితో వెనక్కు నెట్టి, "కొంచెంసేపు నీ వాగుడు కట్టిపెట్టు!" అని గట్టిగా హెచ్చరించి, శిఖిముఖిని, "ఈ రక్తరేఖ నీ కెక్కడ దొరికింది?" అని అడిగాడు.

శిఖిముఖి పళ్ళుకొరుకుతూ, జఖ్యకుల పెద్ద కేసి చూసి, "ఆ రక్తరేఖ నా కెక్కడ దొరికిందో నీకు చెప్పవలసిన అవసరం ఏమిటి? ఆ రాగిముక్క గురించి నీవు తెలుసుకోవలసిందేమీ లేదు," అన్నాడు.

"దైవద్రోహులారా! అది రాగిముక్కా? జగజ్జనని కాళీమాతనా నువ్వవమానిస్తున్నది! చూస్తారేం, వాడి తల నరకండి!" అంటూ శిథిలాలయ పూజారి అరిచాడు.

జఖ్యకులపెద్ద కళ్ళెర్ర చేసి, పూజారి కేసి తిరిగి, "నువ్వు కావటానికి జఖ్యుడివైనా, ఏవో దుష్టశక్తులు సంపాయించేందుకు ఏదో సాధన చేస్తూండటం తెలిసే నిన్ను కులంలో నుంచి బహిష్కరించాం. అటువంటి బహిష్కృతుడివి నువ్వు ఇక్కడ పెత్తనం చేయాలని చూశావో, ముందు నిన్ను బలిపెడతాను," అన్నాడు.

ఆ హెచ్చరికతో పూజారి అదురుకుని వెనక్కు తిరిగి, తన అనుచరులకు సౌంజ్ఞ చేశాడు. అందరూ అతడి చుట్టూ మూగారు.

శిఖిముఖికి, జఖ్యకులపెద్ద అన్న మాటలూ, అతడు రక్తరేఖను పరీక్షిస్తున్న తీరూ చూసి చాలా ఆశ్చర్యం కలిగింది. ఆ వెంటనే అతడికి ఆ రక్తరేఖ విక్రమకేసరి తాతగారిదయిన తాళపత్రాలు గల పెట్టెలో దొరికింది అన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. అంతే కాక దాని సాయంతో కామందకం బయట పడవచ్చునేమో నన్న ఆశకూడా కలిగింది.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చూసి అతడూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు









గమనించి, చప్పున ఆభుక్య కులపెద్ద కేసి తల తిప్పి, "ఆభుక్యనాయకా! నీలో ఏ మూలనో కొంచెం మానవత్వం వున్నదన్న సంగతి, యింతకుముందు నీవు అన్న మాటలవల్ల గ్రహించాను. ఆ పూజారి పరమదుర్మార్గుడు. అది అలా వుంచుదాం. ఈ రక్షరేకు మా మహారాజైన విక్రమకేసరికి ఎవరో బహూకరించారు. అది ఆయన వదిలిపోయిన తాళపత్రాలు గల పెట్టెలో దొరకగా, దాన్ని ఆయన కుమారుడైన శూరసేనదేశపు రాజు జయపాలుడు నాకు స్వయంగా మెడలో కట్టాడు." అన్నాడు.

ఆ మాటలు వింటూనే ఆభుక్యకుల పెద్ద అదిరిపడి, కళిముఖి కేసీ, విక్రమకేసరి కేసీ, ఓమారు చూసి, ఒక్క అంగలో విక్రమకేసరిని సమీపించి, అతణ్ణి గట్టిగా కావిలించుకుని, "నువ్వు ఆ మహారాజు విక్రమకేసరి మనవడివా? మా జాతివాళ్ళను మహమ్మారి రోగానికి బలికాకుండా కాపాడిన ఆ మహారాజు వంశాంకురానికి ఎంతద్రోహం చేశాను!" అంటూ కళ్ళనీళ్ళు పెట్టాడు.

తమ కులపెద్ద యిలా అనగానే, అక్కడ చేరిన ఆభుక్యులూ, ఆభుక్య మాంత్రికుడూ, ముందుకు వచ్చి వాళ్ళిద్దరి ముందూ చేతులు కట్టుకుని నిలబడ్డారు.

ఆభుక్య కులపెద్ద, కళిముఖిని దగ్గరకు పిలిచి, సాదరంగా అతడి భుజం మీద చేయివేసి, రక్షరేకును తిరిగి అతడి మెడలో వేలాడ కడుతూ, "ఇప్పుడు మీరేం చెప్పకుండానే, నాకు మీరు వచ్చిన పని చాలా వరకు తెలిసిపోయింది. మీరు ఆ మహారాజు సజీవుడేమో అన్న అనుమానంతో వెతుకుతూ బయలుదేరి యిక్కడికి వచ్చారు. కాని, ఆయన ఎక్కడో కొండల్లో విషజ్వరంతో చాలాకాలం బాధపడి మరణించాడు. ఆయన మీది భక్తికొద్దీ ఆయన మృతదేహాన్ని తెప్పించి, మా పూర్వుల సమాధి పక్కనే సమాధి చేయించాను.





ఈ రక్తరేఖను ఆ మహానుభావుడికి కృతజ్ఞతా సూచకంగా లోగడ నేనూ, నా జాతి వాళ్ళమూ యిచ్చాము." అన్నాడు

శిఖిముఖి ఆ మాటలకు నవ్వి, "మీరు నేం చెప్పేది సాంతం వినకుండానే మమ్మల్ని కాళికాదేవికి బలి యివ్వ జూశాడు. మిమ్మల్ని అపమార్గం పట్టించిన వాడు, ఆ దుర్మార్గుడైన శిథిలాలయ పూజారి. ముందు వాణ్ణి పట్టి బంధించండి. వాడు మాకూ మీకూ కూడా చేసిన ద్రోహం చాలా వుంది," అన్నాడు.

అఘ్వా కులపెద్ద పళ్ళు కొరుకుతూ తన కులంవాళ్ళ కేసి తిరిగి, "ఆ నీచు డెక్కడ? లాక్కు రండి! కాళీమాతకు బలి యివ్వండి!" అంటూ అరిచాడు.

మందిరంలో వున్నవాళ్ళంతా చుట్టూ కలయ చూశారు. అక్కడ పూజారిగాని, అతడి అనుచరులుగాని లేరు. అఘ్వా కుల పెద్దతోపాటు అందరూ, "ఆ నీచుణ్ణి పట్టు కొండి!" అంటూ మందిరం నుంచి బయటికి పరిగెత్తుకొచ్చారు.

కాళీదేవి మందిరం వున్న గుట్టకు పక్కనే వున్న ఒక పెద్ద కొండ మీద శిథిలా లయ పూజారి, అతడి బంట్లూ నిలబడి వున్నారు. అఘ్వాగులపెద్దను చూసి అతడు, "ఈ మహా శక్తిమంతుడు, మీకు పట్టు బడతాడా! అన్నాళ్ళకు నాకు శిథిలా లయం ఎక్కడున్నదీ తెలిసిపోయింది. దావ వుంటే అక్కడికి రండి. మీరో నేనో తేల్చుకుందాం!" అంటూ కేక పెట్టాడు.

అఘ్వా కులపెద్ద తనవాళ్ళ కేసి తిరిగి, "ఆ వంచకజాతి వెధవను ప్రాణంతో పట్టు కొచ్చినవాడికి నా పదో భార్య చిన్న కూతు ర్నిచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు పెద్దగా.

అఘ్వా యువకులూ, నడి వయసు వాళ్ళూ పులుల్లా గంతులు వేస్తూ, పూజారి నిలబడి వున్న కొండమీదికి వేగంగా పరి గెత్తసాగారు. —(ఇంకా వుంది)






# 25

[శిఖిముఖిని కాళికాదేవికి బలిచేయబోయే సమయంలో, బభ్యులకులపెద్ద, అతడి మెడలోని కాళీమాత రూపంగల రక్షరేకు చూసి ఆశ్చర్యపోయాడు. తరవాత సంగతి తెలుసుకుని, పూజారిని దేవికి బలిపెట్టమన్నాడు. కాని, పూజారి కొండ మీదికి పారిపోయాడు. బభ్యులు అతణ్ణి పట్టుకునేందుకు కొండ మీదికి పరిగెత్తసాగారు. తరవాత—]

తనను పట్టుకునేందుకు వచ్చే బభ్యులను చూసి పూజారి ఏమీ తొణక్కుండా, శిరస్త్రాణంలో నుంచి ఒక పొడవాటి తాళపత్రం బయటికి తీసి, దాన్ని శిఖిముఖీ, విక్రమకేసరుల కేసి చూపుతూ నిలబడ్డాడు. విక్రమకేసరి తన దుస్తుల్లో తాళపత్రం కోసం వెతికాడు. అది అక్కడ లేదు.

"శిఖీ! వాడు మన కేసి చూపుతున్న తాళపత్రం ఏమిటో తెలుసా? దాని మీదే శిథిలాలయానికి వెళ్ళే దారి మార్గానికి సంబంధించిన వివరాలన్నీ వున్నవి. కాళికాదేవి గుడిలో జరిగిన గొడవలో అది, నా దుస్తుల్లో నుంచి కింద పడివుంటుంది. దాన్ని ఆ దుర్మార్గుడు దొరక పుచ్చుకున్నాడు," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఓ క్షణం నిస్పృహలో మునిగిపోయి, అంతలోనే తెప్పరిల్లి, "జరిగిందానికి విచారించి లాభం లేదు. ఇప్పుడు









"ఐభ్యనాయకా, మీ సలహా ఏదో చెప్పండి, వింటాం!" అన్నాడు శిఖిముఖి.

"ఆ లంకను దూరాన వుండి చూసిన వాళ్ళున్నారు తప్ప, నా ఎరుకలో దాని మీదికి పోయి, ఆ శిథిలాలయాన్ని చూసిన వాళ్ళు మాత్రం లేరు. ఆ లంక చాలా భయంకరమైనది. కొండ చేంతాడంత పాములూ, రాక్షసి తేళ్ళూ ఆ లంక నిండా వున్నవని మా వాళ్ళు చెప్పుతుంటారు. దాని పేరే వృశ్చికలంక! అంతకూ మీ రా లంకకు వెళ్ళవలసిన అవసరం ఏమిటి?" అని ప్రశ్నించాడు ఐభ్యకులపెద్ద.

ఆ శిథిలాలయం చేరటానికి వున్న ఉపాయం ఒకటే. మనం ఆ పూజారిగాణ్ణి వెన్నంటి పోవటం, వీలైతే పట్టుకోవటం," అన్నాడు.

వీళ్ళిద్దరి సంభాషణా విన్న ఐభ్యుల కుల పెద్ద, వాళ్ళకు ధైర్యం చెబుతూ, "విచారించకండి. ఆ శిథిలాలయం వున్న లంకకు వెళ్ళ దలిస్తే, అందుకు మీకు సహాయ పడేందుకు అవసరం అయినవాళ్ళు ఒక రిద్దరు, మా జాతివాళ్ళలో వున్నారు. మా దళనాయకుడు నాంగసోమ చిన్నతనంలో తండ్రి వెంట ఆ లంక సమీపానికి వెళ్ళి వచ్చాడు. అతడు మీకు దారి చూపగలడు. కాని, నా సలహా...." అంటూ ఆగిపోయాడు.

ఈ ప్రశ్న చాలా సబబైనదిగా శిఖిముఖికి తోచింది. తాత విక్రమకేసరి సజీవుడేమో అన్న అనుమానంతో తాము బయలు దేరారు. ఆయన చాలా కాలం కిందటే మరణించినట్టు తెలిసిపోయింది. ఇక యిప్పుడు శిథిలాలయాన్ని చూడబోయే ప్రయత్నంలో అనవసరమైన యిక్కట్లు తెచ్చుకోవటం ఎందుకు?

శిఖిముఖి తన అభిప్రాయం విక్రమ కేసరికి చెప్పాడు. విక్రమకేసరి ఓ క్షణం ఆలోచించి, "శిఖీ! మా తాతగారు చూడ దలిచి విఫలుడైన ఆ శిథిలాలయాన్ని నేను చూడాలనుకుంటున్నాను. మా తాతగారు











అక్కడ దొరికే బంగారాన్నే కాక, అపూర్వమైన శిల్ప కళాఖండాలను కూడా మా రాజధానికి తేవాలనుకున్నారు. ఆ పని సాధ్యమైతే నేను చేసి, ఆయన ఆత్మకు శాంతి కలిగించాలని వున్నది," అన్నారు.

"అలా అయితే నేనూ నీ తోటివాణ్ణే. మన కిన్ని యిక్కట్లు కలిగించిన ఆ పూజారి దుర్మార్గుడి అంతం ఒకటి చూడాలి. అంతే కాక....నాగుమల్లి వాడి శిఖ తరిగి తెమ్మన్నది. అది లేకుండా నేను మళ్లీ ఆవిడ ముఖం ఎలా చూసేది?" అన్నారు శిలిముఖి.

ఆ మాటలకు విక్రమకేసరి చిరునవ్వు నవ్వి, "ఇంకేం, ఆ శిథిలాలయం ఎక్కడున్నదో వెతుక్కుంటూ వెళ్ళేందుకు మన ఇద్దరికీ అవసరం అయిన కారణం, ప్రోత్సాహం కూడా వున్నది. ఆ పూజారి మనకు ఆ శిథిలాలయం దగ్గిరగాని దొరకడు," అన్నాడు.

"అంత దూరం ఎందుకు, మా వాళ్ళు యిప్పుడే ఆ వెధవను పట్టుకుని కాళ్లూ చేతులూ కట్టి మనదగ్గిరకు తీసుకువస్తారు," అన్నాడు అభ్యుకులపెద్ద.

కులపెద్ద మాటముగించే లోపలే, పూజారి వెనక నుంచి నరభేరుండం హఠాత్తుగా ముందుకు వచ్చి, అక్కడున్న ఒక పెద్ద బండను పైకెత్తి పట్టుకుని, "ఈ భేరుండం పక్కనుండగా పూజారి దొరను ఎవరూ పట్టుకోలేరు. కావాలంటే యీ కొండనే దొర్లించేయగలను!" అంటూ కొండ ఎక్కి వస్తున్న అభ్యుల కేసి బండను విసిరాడు.

తమ మీదికి దొర్లి వస్తున్న రాతిబండను తప్పుకుని అభ్యులు మరింత బిగ్గరగా అరుస్తూ కొండ ఎక్కసాగారు. పూజారి తాళపత్రాన్ని శిరస్త్రాణంలో దాచి, తన అనుచరుల కేసి తిరిగి, "చూస్తారేం, అందరూ బండరాళ్ళను ఆ చవట వెధవల మీదికి ఒకేసారి దొర్లించి, బిలం ప్రవే







శించండి," అని కొంచెం ముందుకు వచ్చి, శిఖిముఖి వాళ్ళతో, "ప్రాణాలమీద ఆశ లేకపోతే, మీరంతా వృక్షకలంకకు రండి! అక్కడ మహా శిఖిలేశ్వరికి మిమ్మల్ని బలి పెట్టి, యీ బ్రహ్మపుత్రా లోయల్లో ఒక అభ్య మహాసామ్రాజ్యాన్ని స్థాపించి, చక్రవర్తి నవుతాను," అంటూ పెద్ద గొంతుతో అరిచాడు.

. "చూస్తున్నారు గదా, వాడు పట్టి వాచాలుడు! మా వాళ్ళు వాణ్ణి తప్పకుండా బంధిస్తారు," అన్నాడు అభ్యులపెద్ద.

శిఖిముఖి, విక్రమకేసరులకు మాత్రం పూజారి ఒక పట్టాన దొరుకుతాడన్న నమ్మకం లేదు. వాళ్ళు అజిత వీరభద్రుల్ని హెచ్చరించి త్వరత్వరగా కొండ మీదికి పోయారు. వాళ్లు వెళ్లేసరికి అక్కడ కొందరు అభ్యులు నిలబడి, నీటితో నిండివున్న ఒక బిల మార్గం కేసి చూస్తున్నారు. పూజారిముఠా ఆ బిలంలో ప్రవేశించి, పక్కనేవున్న చిన్న కొలనులోని నీరు అందులో ప్రవేశించేలా రాళ్ళను తొలగించారు.

"వీరు మహా జిత్తులమారి! పారిపోవటానికి ముందుగా మార్గం చూసుకునే మనతో అంతసేపు మాటలు పెట్టుకున్నాడు," అన్నా డొక అభ్యుడు.

"వాడి జిత్తుల సంగతి మీ కన్న మాకు బాగా తెలుసు. మీరు యిక్కడ కాలం వృధా చెయ్యక, కొండ మీద అన్ని వైపులకూ పోయి, వాడు తన ముఠాతో ఏ బిలం నుంచి బయటపడతాడో కనిపెట్టండి. ఆ తరవాత ఒకళ్ళిద్దరు వెనగ్గా అనుసరించి పోయి, వా డెళ్ళే మార్గం ఏదో మాకు వార్త పంపండి," అన్నాడు విక్రమకేసరి.

అభ్యులు కొండ మీద అన్ని వైపులకూ పరిగెత్తారు. శిఖిముఖి, విక్రమకేసరులు తమ అనుచరు లిద్దరితో కొండ దిగివచ్చి, అక్కడ తాము చూసిందంతా అభ్యుల నాయకుడికి చెప్పారు.







"అయితే, ప్రస్తుతానికి వాడు మన నుంచి ప్రాణాలతో పారిపోయినట్టే. శిథిలాలయం చేరటానికి వాడికి దగ్గిరవున్న తాళపత్రం సాయపడుతుంది. మరి మీ సంగతేమిటి? మీరు అక్కడికి వెళ్ళాలనే పట్టుదలలోనే వున్నారా?" అని అడిగాడు అభ్యుల నాయకుడు.

"ఆ దారి తెలిసిన నాంగ్‌సామ్ అనే మీ దళనాయకుణ్ణి మాకు సాయం యిస్తే, మేము తప్పక బయలుదేరి పోతాం. మాకు ఆ ఆలయంలో వున్న ధనకనకాల మీద ఎలాంటి ఆశా లేదు. ఏవైనా గొప్ప శిల్పాలు వుంటే వెంట తెచ్చేందుకు ప్రయత్నిస్తాం. అన్నిటికన్నా మాకు ముఖ్యం, మా పూర్వ మహారాజు విక్రమకేసరి నెరవేరని కోర్కెను, నెరవేర్చి ఆయన ఆత్మకు శాంతి కలిగించటం," అన్నాడు శిఖిముఖి.

"ఆ మహారాజు సమాధి చూద్దురుగాని రండి. వృశ్చికలంకకు వెళ్ళటానికి అవసరం అయిన పడవలూ వాటి సంగతి తీరిగ్గా రాత్రికి మాట్లాడుకోవచ్చు," అని అభ్యకుల నాయకుడు, శిఖిముఖి వాళ్ళను తన పూర్వులు సమాధి అయిన చోటుకు తీసుకుపోయాడు.

ఒక విశాలమైన ప్రాంగణంలో, ఎత్తుగా నిర్మించిన పది పన్నెండు సమాధులు శిఖిముఖివాళ్ళు చూశారు. ప్రతి సమాధి మీదా వింత వింత ఆకారాలు గల బొమ్మలు చెక్కబడి వున్నవి. వాటిల్లో కొంచెం పెద్దదిగా వున్న ఒక సమాధి దగ్గిరకు అభ్య నాయకుడు పోయి, భక్తితో నమస్కరించి, "విక్రమా! యిదే మీ తాతగారైన విక్రమకేసరి మహారాజు సమాధి. మా అభ్యశిల్పి తనకు చాతనైనంతలో ఆయన రూపం సమాధి మీద చెక్కాడు. ఆయన రూపం నీకు బాగా గుర్తున్నదా?" అని అడిగాడు.

విక్రమకేసరి సమాధిపై నున్న తన తాతగారి రూపశిల్పం కేసి కొంచెం సేపు





పరీక్షగా చూసి, "సందేహం లేదు, ఇందులో మా తాతగారి ముఖలక్షణాలన్నీ వున్నవి. ఆయన్ని నేను చాలా చిన్న వయసులో చూసివున్నా, ఆ ముఖం నాకు బాగా గుర్తే!" అన్నాడు.

ఇభ్య నాయకుడు చెప్పగా ఒకడు పరుగు పరుగున పోయి, రెండు పువ్వు మాలలు తెచ్చాడు. విక్రమకేసరి, శిఖిముఖి ఆ మాలలను సమాధి మీద వేసి నమస్కరించారు. ఆ తరవాత అందరూ తిరిగి గ్రామ మధ్యంలో వున్న చుట్టు గుడిసెకు వచ్చారు. గుడిసె దగ్గిర ఎర్రగాడు శిఖిముఖికి ఎదురై, చిన్నగా మొరుగుతూ అతడి చుట్టూ గిరికీలు కొట్టసాగింది. శిఖిముఖి దాని తలను ఆప్యాయంగా నిమిరాడు.

అందరూ మధ్యాహ్న భోజనాలు ముగించి మాట్లాడుకుంటూ విశ్రాంతిగా కూర్చున్న సమయంలో ఇద్దరు ఇభ్యులు వచ్చి పూజారి అయిపూ అజా లేకుండా ఎటో పోయాడనీ, తామూ మరి కొందరూ కొండ ప్రాంతాలనే కాక, నదీతీరాన్ని కూడా వెతికామనీ తమ కులపెద్దకు చెప్పారు.

"వాడు ఆ కొండల్లోనే ఎక్కడో ఏదో బిలాన్నొకదాన్ని ఎంచుకుని అక్కడే గబ్బిలంలా దాగి వుంటాడు. చీకటి పడితే



గాని వాడు బైటికి రాడు.. కాపలా వేయండి," అన్నాడు ఇభ్యనాయకుడు.

ఆ రాత్రి ఇభ్యనాయకుడు మరికొందరు ఇభ్య ముఖ్యులతో సంప్రతించి, రెండు పడవలు అవసరం కాగలవని నిర్ణయించారు. అందులో ఒకటి శిఖిముఖి అతడి అనుచరులూ ప్రయాణించేందుకూ, రెండవది శిథిలాలయంలో ఏవైనా అమూల్యవస్తువులు దొరికితే వాటిని తెచ్చేందుకూ ఉపయోగపడగలదని తేల్చారు. పోతే ఆ రెండు పడవలకు వెనకగా మరొక పెద్ద పడవలో కొందరు ఇభ్యులను వాళ్ళకు రక్షణగా పంపగల నన్నాడు ఇభ్యనాయకుడు.







ఆ మర్నాటి ఉదయం ఖభ్యులు నదిలో వున్న పెద్ద పడవల్లో మూడింటికి కొత్తగా ఖడ్గమృగచర్మం తాపడం చేసి మధ్యాహ్నం వేళకు వాటిని ప్రయాణానికి సిద్ధం చేశారు. శిఖిముఖి, విక్రమకేసరి, అజితుడూ ఒక పడవలోనూ, దళనాయకుడు నాంగ్‌సోమ్, వీరభద్రుడూ మరొక పడవలోనూ ఎక్కారు. నాంగ్‌సోమ్ వున్న పడవలో నెల రోజులకు సరిపడా ఆహారపదార్థాలు నిలవచేశారు.

నాంగ్‌సోమ్ వున్న పడవ ముందు దారి చూపుతూండగా, రెండు పడవలూ నది దిగువకు బయలుదేరినై. మరొక పెద్ద పడవలో మరికొందరు ఖభ్యులు కొంచెం వెనగ్గా ప్రయాణమయారు. ముందు బయలుదేరిన పడవలు రెండూ నది దిగువకు రెండు మూడు కోసులు ప్రయాణం చేసిన తరవాత, ఉత్తరం వైపు నుంచి వచ్చి నదిలో కలిసే ఒక పాయ వెంట ఎగువకు కొంతదూరం ప్రయాణించి, సరస్సులా కంటిచూపు అనేంతవరకూ జలమయంగా వున్న ప్రదేశాన్ని చేరారు. వాళ్ళకు అందులో కొన్ని లంకలూ, వాటి మీద ఎత్తయిన వృక్షాలూ, ఎగిరే నీటిపక్షులూ కనిపించినై.

నాంగ్‌సోమ్‌కు ఆ ప్రాంతమంతా బాగా పరిచయమైనదే. అతడు అనేకసార్లు మరి కొందరు తన జాతివాళ్ళతో కలిసి, చేపల వేటకు అటుకేసి వచ్చాడు. ఆ జలమయ ప్రదేశంలో పెద్దపెద్ద చేపలేకాక, భయంకర మైన వింత జలచరాలు కూడా వుండటం అతడికి తెలుసు. వృశ్చికలంక చేరే ముందు, చిన్నా పెద్ద లంకలను అనేకం దాటి పోవలసి వుంది.

తెడ్లు వేసి అతి జాగ్రత్తగా పడవలు నడుపుతున్నవాళ్ళకు, నీటిలో తమ చుట్టూ కదిలే పెద్దపెద్ద మొసళ్ళూ, తిమింగిలం లాటి ఆకారాలుగల కొన్ని చేపలూ కంట బడినై. అవి పడవల్ని అనుసరించి ఈదుతూ వస్తున్నవి. —(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 26

[శిథిలాలయ పూజారి, ఐభ్యులను మోసపుచ్చి ఒక బిలమార్గం ద్వారా పారిపోయాడు. ఐభ్యకులపెద్ద, తన దళనాయకుడైన నాంగసోమును శిథిలాలయం వున్న వృశ్చిక లంకకు దారి చూపేందుకు శిఖిముఖీ వాళ్ళతో పంపటానికి ఒప్పుకున్నాడు. రెండు పెద్ద పడవలు సిద్ధం చేయబడినై. అందరూ వృశ్చికలంకకు ప్రయాణమయారు. తరవాత—]

సూర్యాస్తమయం వరకూ శిఖిముఖీ వాళ్ళు ప్రయాణం చేసి, ఆ రాత్రికి విడిది చేసేందుకు అనుకూలంగా వుండే లంక కోసం ప్రయత్నించారు. పావుగంట ప్రయాణ దూరంలో వాళ్ళకో లంక కన బడింది. చీకటి పడుతుండగా వాళ్ళా లంక చేరి, పడవలను ఒడ్డునున్న చెట్లకు కట్టి, వంట పనులు ప్రారంభించారు. తాము చేసిన మంట నుంచి వెలువడుతున్న పొగను గుర్తించి, మూడవ పడవవాళ్ళు కూడా కొంచెం ఆలస్యంగా అక్కడికి రాగల రని వాళ్ళు భావించారు.

క్రమంగా చీకటి కమ్ముకున్నది. వంట పూర్తి కాగానే అందరూ భోజనాలు చేసి, నెగడొకటి వెలిగించి, దాని చుట్టూ కూచుని పిచ్చాపాటీ మాట్లాడుకోసాగారు. మూడవ పడవ యింకా ఆ లంక చేరలేదు. శిఖి ముఖికి, శిథిలాలయ పూజారి తమ కన్న







ముందుగా వృశ్చికలంకకు ప్రయాణం కట్టాడని గట్టి నమ్మకం కలిగింది. ఒకవేళ తమ పడవలూ, వాడున్న పడవా ఎక్కడో మార్గమధ్యాన తారసపడితే, పోరు తప్పదు. అప్పుడు తమలో కొందరైనా జలజంతువులకు ఆహారం అయిపోతారు....

ఇలా ఆలోచిస్తున్న శిఖిముఖికి లంకమీది చెట్లలో నీటిపక్షులు చేసే కలకలంతో పాటు, తీరం వెంట నీటిలో మొసళ్ళూ యితర నీటిజంతువులూ చేసే ధ్వనులు కూడా వినిపిస్తున్నవి. అతడు విక్రమకేసరితో, "ఈ చీకట్లో, యీ లంకా, చుట్టూ వాతావరణం ఎంత భయంకరంగా వున్నదో చూశావా? దీనికన్న క్రూరమృగాల నడుమ మహారణ్యంలో కాలంగడపటం వెయింతలు సుఖంగా వుంటుంది," అన్నాడు.

నాంగ్‌సామ్ అవునన్నట్టు తల వూపాడు. విక్రమకేసరి, "నువ్వీ లంకను గురించి ఆలోచిస్తున్నావా? నాకు పూజారి గుర్తుకొస్తున్నాడు. వాడీ లంకలోనే మరో ప్రాంతాన బస చేశాడేమో అన్న అనుమానం నాకు కలుగుతున్నది," అన్నాడు.

ఆ మాటలకు శిఖిముఖి నవ్వి, పక్కనున్న ఎండుకట్టెలు నెగడులో వేయసాగాడు. ఉన్నట్టుండి హఠాత్తుగా లంకలో ఒకమూల నుంచి గుండెలవిసే లాంటి కేక ఒకటి వినిపించింది. ఎర్రగండు అటుకేసి తిరిగి మొరగసాగింది. శిఖిముఖి చప్పున లేచి నిలబడి, "అది మనిషి గొంతా, లేక ఏదైనా వింతమృగానిదా?" అన్నాడు.

"ఎవరో మనిషి ప్రమాదంలో చిక్కుకున్నాడు, లేక మనను ప్రమాదంలో చిక్కించేందుకు శిథిలాలయ పూజారి ఎత్తు వేస్తూండవచ్చు. ఆయుధాలు సిద్ధంగా పట్టుకుని బయలుదేరండి," అన్నాడు విక్రమకేసరి.

అజితవీరభద్రులు చప్పున రెండు కాగడాలు వెలిగించి ముందు బయలుదేరారు.









ఈ సారి ఎవడో మనిషి అరుస్తున్నట్టుగా స్పష్టంగా కేకలు వినిపించినై. అందరూ అక్కడికి పరిగెత్తే సరికి, కుంటికాలువాడు ఒకడు అటూ యిటూ గెంతుతూ, చేతిలో వున్న దుడ్డుకర్ర సాయంతో, తన మీదికి ఉరుకుతున్న రెండు మొసళ్లతో పోరాడుతున్నాడు.

శిఖిముఖి ఆ కుంటివాడి రక్షణకు ముందుకురికే లోపలే ఎర్రగండు భయంకరంగా మొరిగి వాడి మీదికి లంఘించింది. కుక్క అరుపు వింటూనే కుంటివాడు వణికిపోతూ, "శిఖిదొరా! నన్ను ముందు మొసళ్ళ నుంచి కాదు, ఈ ఎర్రగండు నుంచి కాపాడండి! తరవాత మీ యిష్టం వచ్చిన శిక్ష విధించండి!" అన్నాడు.

ఆ కంఠస్వరం విని అందరూ ఆ కుంటివాడు తమకు ద్రోహంచేసి పారిపోయిన జాంగ్‌లా అని గుర్తించారు. ఎంత దుర్మార్గుడైనా చిత్రహింసలకు గురిచేయుటం మానవత్వం అనిపించుకోదు గనక, శిఖిముఖి ముందుగా ఎర్రగండును దగ్గిరకు పిలిచి, తనచేతి కత్తితో ఒక మొసలిని తల మీద గట్టిగా కొట్టాడు. ఇంతలో అజితుడు ఈటెతో రెండవ మొసలిని నడుం మీద పొడిచాడు.

మొసళ్ళు రెండూ తాము తిన్న దెబ్బలం కన్నా కాగడాల వెలుగుకు ఎక్కువగా భయపడిపోయి దాపులనున్న నీటి కేసి చర చరా పాకి, దఢీమంటూ అందులో పడినై. జాంగ్‌లా ఆయాసపడుతూ నేల మీద కూలబడ్డాడు. అతడేదో చెప్పాలని చూశాడుగాని, నోట మాట పెగలలేదు.

శిఖిముఖీ అతడి మిత్రులూ హఠాత్తుగా ఎదురైన యీ వింత సంఘటనకు ఆశ్చర్యపడ్డారు. జాంగ్‌లా యీ రాత్రివేళ యీ లంకకు ఎలా చేరాడో వాళ్ళు ఊహించలేక పోయారు. శిథిలాలయ పూజారి తమ మీద వేగుచేసేందుకు జాంగ్‌లాను తాము దిగిన







చోటుకు పంపారేమో అన్న అనుమానం మాత్రం విక్రమకేసరికి కలిగింది.

శిఖిముఖి, బాంగ్లాను ఏదో ప్రశ్నించ బోయేంతలో విక్రమకేసరి కత్తి ఎత్తి, "బాంగ్లా! నిజం చెప్పు. అబద్ధం ఆడావో రెండో కాలు కూడా నరికి ప్రాణం వుండగానే నిన్ను మొసళ్ళ దగ్గిరకు తోయించుతాను. నీ యజమాని ఆ పూజారిగాడు, యీ లంకలో ఏ మూల దిగాడు?" అని ప్రశ్నించాడు.

బాంగ్లా ఆ ప్రశ్నకు భయపడినట్టు లేదు. అతడు బతుకుమీద రోసినవాడిలా ఒక నిట్టూర్పు విడిచి, "కేసరిదొరా! నేను మీకు చేసిన ద్రోహానికి, యిప్పుడు నే నెంత నిజం చెప్పినా నమ్మరు. నాకు మీ యిష్టం వచ్చిన శిక్ష విధించండి," అన్నాడు.

"ఈ దొంగ నాటకం నా దగ్గిర సాగదు. నిజం చెపుతావా, లేదా?" అంటూ విక్రమకేసరి కత్తిని బాంగ్లా మెడమీద పెట్టాడు.

శిఖిముఖి నవ్వుతూ, "కేసరీ! అప్పుడే నీ ప్రతిజ్ఞమాట మరిచిపోయి వాడి తల నరకబోతున్నావు. ప్రాణాలతో గదా వాణ్ణి మొసళ్ళకు వేస్తానని నీ వింతకు ముందు అన్నది? కొంచెం ఆగు....బాంగ్లా! ఇప్పటి నీ పరిస్థితి చూస్తుంటే నువ్వు సుఖమైన చావుకోసం ఎదురుచూస్తున్నట్టు కనబడుతున్నావు. కాని నిజం చెప్పకపోతే కేసరి నిన్ను ప్రాణాలతోనే మొసళ్ళకు వేసి భయంకరమైన చావుకు నిన్ను గురిచేస్తాడు. తెలిసిందా?" అన్నాడు.

బాంగ్లా ఓ క్షణకాలం మౌనంగా వూరుకుని, "శిఖిదొరా! ద్రోహి చచ్చేముందు నిజం పలికినా, అబద్ధం మాట్లాడినా ఒకటే. కాని, చావుకు ముందు నేను చెప్పే నిజం మీకు కొంత ఉపకరిస్తుంది. పూజారి యీ రోజు మధ్యాహ్నం ప్రాంతాలే రెండు పడవల్లో శిథిలాలయం వున్న లంక కేసి పోయాడు. మీ రా లంక చేరే సమయానికి వాడు










మీ కోసం మాటువేసి వుంటాడు. తగు జాగ్రత్తలో వుండండి," అన్నాడు.

జాంగ్లా మాటల్లో మోసం లేదన్న నమ్మకం శిఖిముఖికి కలిగింది. "అయితే, జాంగ్లా! నువ్వు నీ యజమానితో వెళ్ళక యీ మొసళ్ళ లంక మీద ఎందుకు దిగబడిపోయావు?" అని ప్రశ్నించాడు.

"చచ్చేముందైనా నిజం చెప్పి చావదలిచాను, దొరా! వినండి. నేను మీకు తలపెట్టిన ద్రోహంవల్లే చిరుతపులికి చిక్కి అవిటివాణ్ణయిపోయాను. నా పాపమే నన్నణిచింది. కామాఖ్యనగరంలో గౌరవంగా బతికే నన్ను, డబ్బాశ చూపి దుర్మార్గుణ్ణిగా చేసినవాడు పూజారి! వాణ్ణి సమయం వచ్చినప్పుడు హతమార్చదలిచాను. కాని, వాడు నీచగ్రహోపాసకుడు! నా ఆలోచనలు పసిగట్టాడో ఏమో నన్ను, ఏదో భయంకరమైన జలజంతువుకు ఆహారంగావేసి పోజూశాడు," అన్నాడు జాంగ్లా.

"నిన్ను జలజంతువుకు ఆహారంగా వేశాడా! అదెలా జరిగింది?" అన్నాడు శిఖిముఖి ఆశ్చర్యపడుతూ.

జాంగ్లా యిలా చెప్పాడు.

"గోల్‌భరా గ్రామప్రాంతంలోని నది దగ్గిర్నుంచి, యీ జలప్రదేశానికి వాడి పడవలు సాగినప్పటి నుంచీ, నేను చుట్టుపక్కల వున్న అన్ని లంకల్నీ పరిశీలించి చూస్తూ, ఒక్కొక్కదాన్నే గుర్తు పెట్టుకో సాగాను. నేను గజయీతగాణ్ణి. ఆ పూజారిని వాడి ముఠాతో ఏదో ఒకచోట పడవలతో పాటు నీటముంచి, ఏ తెప్పకొయ్య మీదో తిరిగి గోల్‌భరా చేరాలన్నది నా పథకం.

"వాడు నా ఆలోచనలు గ్రహించినట్టున్నాడు. ఈ మధ్యాహ్నం పడవలు, యీ లంకపక్క నుంచి పోతూండగా, వాడు పడవ మీంచి నీళ్లోకి తొంగి చూసి, 'ఆహాఁ, శిథిలేశ్వరి కంఠాభరణం అయిన మహాజలసర్పం దర్శన మిచ్చిందా? ప్రసాదం








సమర్పించాలా? తప్పక సమర్పిస్తాను! ఆ ఒక్క సజీవ ప్రసాదాన్ని స్వీకరించి మా అందరికీ ఏ హానీ కలగకుండా శిఖిలేశ్వరి ఆలయానికి చేర్చు,' అంటూ కళ్ళు మూసుకుని ఉష్ణీషాన్ని ఎగరవేశాడు. అది గురిగా వచ్చి నా తలమీద పడింది. వెంటనే వాడు, 'ఓహో, ఎంత అదృష్టం నీది, జాంగ్లా! శిఖిలేశ్వరి సేవికకు ఆహారమై, వచ్చే జన్మలో అభ్యుజాతి కంతకూ నాయకుడివిగా జన్మించబోతున్నావు!' అన్నాడు.

"ఆ దుర్మార్గుడు ఏం చేయబోతున్నాడో నేను ఊహించే లోపలే వాడు సవర భేరుండానికి సైగ చేశాడు. భేరుండం ఒక్క దూకున వచ్చి పడవ మీంచి నన్ను నీటిలోకి గిరవాటు వేశాడు. నేను మునిగిపోయినట్టు నటించి, నీటి అడుగునే ఈదుకుంటూ దాపుల నున్న యీ లంక చేరాను. ఆకలితో, బడలికతో సగంచచ్చివున్న నామీద యింతకు ముందు మొసళ్ళు వచ్చి పడినై. మీరు రక్షించారు. ఇది నా కథ!"

శిఖిముఖి కొంచెం సేపు ఆలోచించి, "కేసరీ! నీ అభిప్రాయం ఏమిటి? జాంగ్లా చెప్పింది నమ్మటమా, మానటమా?" అని అడిగాడు.

"అతడు నమ్మదగిన విధంగా కథ చెప్పాడు!" అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఆ మాటలకు నవ్వి, అజిత వీరభద్రుల్ని నాంగ్‌సోమ్‌నూ ప్రశ్నించాడు. వాళ్ళు జాంగ్లా చెప్పింది నిజంలా కన బడుతున్నదన్నారు.

"అయితే మనం ఉదయం బయలు దేరి పోయేప్పుడు జాంగ్లాను వెంట తీసుకు పోదాం. ఏమంటావ్, కేసరీ?" అని అడిగాడు శిఖిముఖి.

"తప్పకుండా మన పడవల్లో తీసుకు పోదాం. మళ్ళీ ఏదైనా ద్రోహం తల పెట్టే సూచనలు కనబడితే, యీసారి ఏ మాత్రం అవకాశం ఇవ్వకుండా కత్తులతో ముక్కలు

ముక్కలుగా నరుకుదాం," అన్నాడు విక్రమకేసరి.

అందరూ అక్కణ్ణించి కదిలి, తాము విడిచి దిగిన చోటుకు బయలుదేరగానే జాంగ్లా, శిఖిముఖి, విక్రమకేసరుల పాదాలు తాకి వారి వెనకగా కర్రసాయంతో కుంటుతూ నడిచాడు.

సూర్యోదయంతోనే అందరూ నిద్ర మేల్కొని, కాలకృత్యాలు తీర్చుకుని పడవలను ప్రయాణానికి సిద్ధపరిచారు. జాంగ్లాను శిఖిముఖీ, విక్రమకేసరీ వున్న పడవలోకి ఎక్కించారు. అవసరం అయినప్పుడు తెడ్లు వేయటానికి అతడు వీరభద్రుడికి సాయంగా వుండగలడని శిఖిముఖి అలా చేశాడు. వాళ్ళు లంక నుంచి బయలు దేరుతూ, మరికొందరు ఇభ్యులతో కొంచెం వెనకగా ప్రయాణం కట్టిన పడవ కోసం చుట్టుపక్కల అంతా పరికించి చూశారు. పడవ జాడలేదు. బహుశా పడవలోనివాళ్ళు దారి తప్పారేమో అన్న అనుమానం శిఖిముఖికీ, విక్రమకేసరికీ కలిగింది.

గాలివాలు బాగా వుండటంతో తెడ్లు వేయటం మాని పడవలకు తెరచాపలెత్తారు. నాంగ్‌సోమ్, అజితుడూ వున్న పడవ ముందుకు పోసాగింది. మధ్యాహ్నం



భోజనాలవేళ సమయంలో, ఏ లంక మీద దిగి వంటలు చేసుకుందామా అని శిఖిముఖీ వాళ్ళు ఆలోచిస్తూండగా, ఒక లంక మలుపులో నుంచి నీరు అల్లకల్లోలమవుతూ, వాళ్ళ పడవల కేసి రాసాగింది. అప్పటి వరకూ ప్రశాంతంగా వున్న నీటిమీద అంతలేసి అలలు ఎందుకు లేస్తున్నవో ఎవరికీ అర్థం కాలేదు.

నాంగ్‌సోమ్ తన పడవను దాపునవున్న లంక కేసి తెడ్లసాయంతో మళ్ళిస్తూ, శిఖిముఖీవాళ్ళను కూడా హెచ్చరించాడు. అంతలో లంక మలుపు తిరిగిన చోటు నుంచి హఠాత్తుగా రెండు పడవలు అలల





తాకిడికి కిందు మీదులవుతూ వాళ్ళ కేసి కొట్టుకు రాసాగినై.

ఆ పడవలలో ఉన్నవాళ్ళను శిఖిముఖీ, విక్రమకేసరీ వెంటనే గుర్తించగలిగారు. ఒక పడవలో వున్న శిథిలాలయ పూజారి చేతులెత్తి పెద్దగా అరుస్తూ, "జలసర్పం మనను మింగజూస్తున్నది! పడవల్ని లంకకు పట్టించండి!" అంటున్నాడు.

చూస్తూండగానే పూజారి చెప్పే ఆ జల సర్పం కూడా శిఖిముఖి వాళ్ళ కంట బడింది. ఆ సర్పం మెడా, తలా మాత్రం పాముకు వున్నట్టు వున్నది. కాని శరీరం మటుకు పది పన్నెండు ఏనుగుల ప్రమాణంలో లావుగా వున్నది. అది తన కాళ్లతో నీటిని అల్లకల్లోల పరుస్తూ, పూజారి పడవలలో వున్న వాళ్ళను పట్టుకునేందుకు తల కిందికీ పైకీ తిప్పుతున్నది.

ఆ దృశ్యం చూసి శిఖిముఖితో పాటు అందరూ గజగజ వణికిపోయారు. అదృష్ట వశాత్తూ వాళ్ళ పడవలు లంకకు సమీపాన వుండటంతో, అతి త్వరలోనే వాళ్ళు తీరాన్ని చేరుకోగలిగారు. శిథిలాలయ పూజారివాళ్ళ పడవలు మాత్రం జలజంతువు వల్ల లేచిన అలలలో చిక్కుకుని కిందు మీదులవుతూ నీటి వెంట కొట్టుకు పోసాగినై.

ఒడ్డుచేరిన శిఖిముఖి వాళ్ళు చూస్తూండగానే జలజంతువు పూజారి వున్న పడవ లోపలికి తలపెట్టి ఒకణ్ణి నోట కరుచుకున్నది. పూజారీ, అతడి వెంట వున్నవాళ్లూ పిచ్చిగా అరుస్తూ పడవలను తెడ్లసాయంతో దూరంగా నడపసాగారు. జలజంతువు తాను పట్టినవాణ్ణి మింగేందుకు ఓ క్షణకాలం ఆగి, తిరిగి వాటి వెంటబడింది.

"శిఖీ! పనిలోపని, ఆ పూజారి దుర్మార్గుడు నా బాణం దెబ్బకు అందుతాడేమో చూస్తాను!" అంటూ విక్రమకేసరి పూజారి వున్న పడవ కేసి గురిగా బాణాలు వదలసాగాడు. —(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 27

[వృశ్చికలంకకు పోయేదారిలో ఒకచోట, బొంగేలా శిఖిముఖి వాళ్ళకు తటస్థపడ్డారు. తనను శిథిలాలయపూజారి చంపబూనారని అతను శిఖిముఖికి చెప్పాడు. సూర్యోదయంతో అందరూ తిరిగి ప్రయాణమయారు. ఒక లంక మలుపులో, పూజారి పడవలు వాళ్ళకు కనిపించినై. విక్రమకేసరి పూజారి కేసి బాణాలు వదలసాగాడు. తరవాత—]

విక్రమకేసరి వదిలిన బాణాలు శిథిలాలయ పూజారిక్కాడుగదా, అతడున్న పడవ కూడా తగలలేదు. జలజంతువు కదలిక వల్ల లేచే నీటి అలల మీద పూజారి పడవలు అటూ యిటూ ఒరుగుతూ వేగంగా కొట్టుకు పోతున్నవి. జలజంతువు తానంతకు ముందు పట్టుకుతిన్న వాటితో కాస్త తృప్తిపడినట్టుగా, పడవలను లోగడంత వేగంగా తరమటం లేదు. ఒకటి రెండు నిమిషాలు గడిచినై. జలజంతువు నీటిలో వున్న చోటునే ఆగి, మెడ అటూ యిటూ తిప్పి ఓసారి చుట్టూ కలయ జూసింది.

ఆ భయంకర జంతువు దృష్టి తమమీద పడుతుందేమో అన్న భయంతో శిఖిముఖి అతడి అనుచరులూ, దాపులనున్న రెల్లు పొదలచాటుకు తప్పుకున్నారు. ఎర్రగండు మొరగకుండా శిఖిముఖి దాని తల నిమరసాగాడు. అతడికి జలజంతువు తమను







పట్టుకుని కబళిస్తుందన్న భయంకన్నా, ఒడ్డున వున్న తమ పడవల్ని నీట ముంచుతుందేమో అన్న భయం అధికంగా వున్నది. అలా జరిగితే, తాము యీ నిర్జనమైన లంక మీద చిక్కుకుపోతారు...

చూస్తూండగానే శిథిలాలయం పూజారి వున్న పడవలు లంక మలుపు తిరిగి, కనబడకుండా పోయినై. జలజంతువు తృప్తిగా ఒళ్ళు విరుచుకుంటున్నట్టు నీటిలో అటూ యిటూ కొంచెం సేపు పొర్లి లేచి, తల మాత్రం నీటి బయటికి పెట్టి, దూరంగా వున్న మరో చిన్న లంక కేసి బయలుదేరింది. అది కనబడకుండా పోయేవరకూ



ఆగి, శశిముఖివాళ్ళు దాగిన చోటునుంచి బయటికి వచ్చి, తిరిగి తమ పడవల మీదికి వెళ్ళారు.

తమ ప్రయాణం జంతువు వెళ్ళిన దిక్కు కాకపోవటం వాళ్ళకు కొంత ధైర్యాన్నిచ్చింది. కాని, ఈ జలమయ ప్రదేశంలో అటువంటి భయంకర ప్రాణులు మరికొన్ని వుండవచ్చున్న అనుమానం వాళ్ళను బాధించసాగింది. వీటన్నిటికీ తోడు శిథిలాలయ పూజారి తమ ప్రయాణాన్ని ముందుగానే పసిగట్టటం — అన్నిటినీ మించిన సంకటాన్ని తెచ్చి పెట్టవచ్చు.

పడవలు రెండూ కదలబోయే సమయంలో శశిముఖి అందరికీ వినబడేంత పెద్ద గొంతుతో, "వృశ్చికలంకకు వెళ్ళాలనే ప్రయత్నంలో వున్న సాధకబాధకాలు, ఈసరికి అందరికీ తెలిసి వచ్చినై అనుకుంటాను. నేనూ, శశికా ఏ పరిస్థితుల్లోనూ అక్కడికి వెళ్ళక తప్పదు. కాని, మిగతా వాళ్ళెవరైనా, అక్కడ దిగబడిపోదలిస్తే నా అభ్యంతరం లేదు. తిరుగు ప్రయాణంలో అలాంటివాళ్ళను తీసుకుపోతాం. ఈలోపల వాళ్ళకు అవసరం అయిన ఆహారపదార్థాలు యీ లంకలో వదులుతాం," అన్నారు.











ఈ మాటలకు ఒక్క క్షణం అందరూ ఆశ్చర్యపోయారు. వాంగసోమ్, అజిత విరళ్ళములతోపాటు, కుంటి జాంగ్‌లా కూడా ఎన్ని కష్టాలు ఎదుర్కోవలసి వచ్చినా, పుష్పకలంకకు వెళ్ళితీరవలసిందే అన్నాడు. శిథిలాలయ పూజారి అంతం చూడవలసి వున్నదని. కనక తాను ఒంటరిగానైనా సరే, పుష్పక లంకకు వెళ్ళక తప్పదని అన్నాడు, జాంగ్‌లా.

తమ అనుచరుల పట్టుదలనూ, ధైర్యాన్నీ, విశ్వాసాన్నీ శశిముఖి, విక్రమకేసరులు మెచ్చుకున్నారు.

పడవలు కదిలినై. గాలి అనుకూలంగా వుండటంతో తెరచాపలు ఎత్తారు. తమకన్న ముందు లంక మలుపు తిరిగిపోయిన పూజారి వాళ్ళ పడవల కోసం అందరూ జాగ్రత్తగా చుట్టు పక్కల ప్రదేశాన్ని పరిశీలించసాగారు. కాని, సూర్యాస్తమయ సమయమవుతున్నా వాళ్ళకు పూజారి పడవలు ఎక్కడా తారసపడలేదు. చీకటి పడుతూండగా పడవలను ఒక చిన్న లంక ప్రదేశాన ఒడ్డు చేర్చి, తాళ్ళతో వాటిని ఒడ్డునున్న చెట్లకు కట్టి. ఆ దాపులనే అందరూ వంట ప్రయత్నాలు ప్రారంభించారు.

వంట పూర్తయి అందరూ భోజనాలు చేసేసరికి జాముపొద్దు గడిచిపోయింది. ఈ లంక తీరంలో మొసళ్ళున్న సూచనలు లేవు. కాని, లంక మీది చెట్టు చేమల్లో మాత్రం అనేక రకాల పిట్టపక్షులు వున్నవి. అవి పొద్దు పోతున్నకొద్దీ మరింత బిగ్గరగా గీపా అంటూ గోల చేయసాగినై.

నెగడు వెలిగించి శశిముఖీ అతడి అనుచరులూ దాని చుట్టూ చేరి మాట్లాడుకోసాగారు. వాళ్ళ కళ్ళింత దూరంలో పడవలు రెండూ అలల తాకిడికి లేచి పడుతూ, ఆ చీకట్లో నాట్యం చేస్తున్న రెండు పెద్ద భూతాల్లా కనిపిస్తున్నవి. కొంచెం సేపు









మాట్లాడుకున్న తరవాత ఒకరొకరుగా కిరీముఖి వాళ్ళు నెగడు చుట్టూ ముడుచుకు పడుకున్నారు. రెండవ జామున కాపలా పని నాంగసోముడిది.

నాంగసోమ్ ఈటె పట్టుకుని ఒకసారి పడవల దగ్గిరకుపోయి చూసి, తిరిగి నెగడు దగ్గిరకు వచ్చి కూచున్నాడు. నీటిపక్షులు చేసే గోల అతడికి తల దిమ్మెక్కిస్తున్నది. అతడొకసారి బద్ధకంగా ఆవులించి, పక్కనే నిలబడి వున్న ఎర్రగంటు తలను నిమరబోయాడు.

ఎర్రగంటు మెడ పక్కకు తిప్పి, పడవ లున్న దిక్కుకేసి ఓ అడుగువేసి, గాలిలో తలను అటూ యిటూ ఓమారు తిప్పి చిన్నగా మొరిగింది. పసికట్టటంలో ఎర్ర గంటు కున్న శక్తి బాగా తెలిసినవాడు కావటంతో నాంగసోమ్, అది తల తిప్పిన దిక్కుకేసి పరీక్షగా చూశాడు. పడవల్లో ఒకటి ఓ క్షణకాలం పక్కకు ఒరిగి, రెండవ దాన్నుంచి కొంచెం దూరం కదిలినట్టు అతడికి తోచింది.

నాంగసోమ్ ఎర్రగంటు మొరగకుండా దాని తల నిమిరి, ఈటెను గట్టిగా గుప్పెట బిగించి, నేల మీద వంగి నడుస్తూ పడవల దగ్గిరకు వెళ్ళాడు. అతడింతకు ముందు చూసినట్టు ఒక పడవ రెండవ దానికి భిన్నంగా నీటి మీద వూగి వూగి చప్పున ఒక పక్కకు ఒరిగి, మళ్ళీ యథాప్రకారం నిలబడుతున్నది.

పడవ కింద ఏవో మొసళ్ళు చేరి పోట్లాడుతున్నవేమో అన్న అనుమానం నాంగసోమ్‌కు కలిగింది. కాని, పరీక్షగా చూడగా అక్కడ నీటిలో పెద్ద కదలిక ఏమీ అతడికి కనిపించలేదు. దానితో అతడికి శత్రువెవరో పడవ కింద దాగివుండి పడవను ఎత్తి పాతవటమో, లేక దొంగిలించుకు పోవాలనే ప్రయత్నమో చేస్తున్నాడన్న అనుమానం కలిగింది.







నాంగసోము ఎర్రగంధువు పీట ఒడ్డునే వుంచి, నిశ్శబ్దంగా నీటిలో దిగి పడవను చేరి, దానిమీద ఎక్కి నిలబడ్డాడు. ఆ సమయంలో పడవ కొంచెంగా అటూ యిటూ ఒరిగింది. వెంటనే దాని అడుగు నుంచి ఒక నల్లని ఆకారం చప్పున నీటిమీదికి తేలింది. సద్దివెన్నెల్లో ఒకరినొకరు గుర్తించారు.

కన్ను మూసి తెరిచేంతలో నాంగసోము చేతిలోని ఈటెను బలంగా ఆ నల్లని ఆకారం కేసి విసిరాడు. అదే సమయంలో నీటిలో వున్నవాడు చప్పున ఈటెను నాంగసోము మీదికి ప్రయోగించాడు. ఆ ఈటె పడవ అంచును తాకటం, నాంగసోము ఈటె వాడి వెన్నులో దిగబడటం ఒకేసారి జరిగిపోయింది.

నీటిలో వున్నవాడు ఒక్క చావుకేక పెట్టాడు. వెంటనే నాంగసోము నీటిలోకి దూకి వాణ్ణి చేతులతో బలంగా పట్టుకుని ఒడ్డు కేసి ఈడ్చుతూ, పెద్ద గొంతుతో, "శత్రువులు! శత్రువులు!" అని కేకలు పెట్టసాగాడు.

ఆ కేకలు వింటూనే శిఖిముఖివాళ్ళు అదురుకుంటూ నిద్రలు లేచి నాంగసోము వున్న చోటుకు పరిగెత్తుకొచ్చారు. ఆ సరికి నాంగసోము గాయపడినవాణ్ణి బాగా ఒడ్డు మీదికి ఈడ్చుకు వచ్చాడు. వాడి వెన్నులో దిగిన ఈటె అలాగే దిగబడివున్నది. వాడు బాధతో ఆయాస పడుతున్నాడు. అనుచరుడి చేతిలో వున్న కాగడా తీసుకుని, దాని కాంతిలో శిఖిముఖి వాడి ముఖం పరీక్షించి చూశాడు. వాడు మరెవరో కాదు, తిమ్మ గూడెం ప్రాంతాలగల అడవుల్లో దారి దొంగల్లా బతికే ముఠాలోనివాడు. ఆ ముఠా వాళ్ళు ఇద్దరు ముగ్గురు శిథిలాలయ పూజారి ఇంట్లోగా గోలకరా వచ్చారు.

నాంగసోము, శిఖిముఖికి జరిగిందంతా ఒకటి రెండు మాటల్లో టూకీగా చెప్పేశాడు.









శిఖిముఖి దొంగతో. "నువ్వు చేసిన దురంతాలకు తగిన దావే నీ కెదురైంది. నీ వెన్నులో దిగబడి వున్న ఈటెను లాగేయుంచుతాను. కాని వెంటనే చస్తావు. చచ్చేముందు ఒక్క మాట చెప్పు. మా పడవలను అడుగున చిల్లులు పొడిచి ముంచాలనే గదా నువ్వొచ్చింది? పూజారి ఏ లంకలో దిగాడు?" అని ప్రశ్నించాడు.

దొంగ ఓసారి మూలిగి మొదటి ప్రశ్నకు అవుననట్టు తల వూపి, అక్కడికి దాపులనే వున్న మరొక లంక కేసి బాధగా చేయి ఎత్తి చూపాడు. ఆ వెంటనే శిఖిముఖి, నాంగసామును ఈటె లాగివేయమన్నారు. నాంగసామి ఈటెను వెన్నులో నుంచి బయటికి గుంజగానే, దొంగ గిలగిలా ఓ క్షణకాలం తన్నుకుని కొయ్యబారుతుంగలా నిగడదన్నుకుపోయాడు.

"శిఖీ! ఆ పూజారి వెధవ లోగడ మనను అరణ్యంలో వెన్నంటి గోలలరా వచ్చినట్టే, ఇప్పుడు పుష్పగలంక కూడా మన వెనకనే వస్తున్నాడు!" అన్నారు విక్రమకేసరి.

"వాడు పూరికే రావటం లేదు. దారిలోనే మనను నాశనం చేయాలని చూస్తున్నాడు. మన పడవల్ని నీటముంచితే, మనం ఈ దిక్కుమాలిన లంక మీద ఆకలికి అలమటించి చస్తామని వాడి ఆశ. ఏమైనా, ఇక ముందు మనం పడవల విషయంలో మరింత గట్టికావలా ఏర్పాటు చేసుకోవటం క్షేమం," అన్నారు శిఖిముఖి.

నాంగసామి ఆ దిక్కులోనే శత్రువులు పూజారి దిగిన లంకకుపోయి, వాణ్ణి హతమార్చటం బావుంటుందని సలహా యిచ్చారు. కాని, అది కేవలం దుస్సాహసం అవుతుందని, ఏ చెట్టుచాటునో వుండి, వాడూ, వాడి అనుచరులూ తమ మీద దొంగదెబ్బ తీయగలరని శిఖిముఖి చెప్పి—ఆ ఆలోచనను వ్యతిరేకించారు.





ఆ రాత్రి మరే అవాంతరం లేకుండా తెల్లవారి పోయింది. కిలిముకి అతడి అనుచరులూ పడవలను సిద్ధంచేసి, ముందుగా దొంగ చెప్పిన లంకను సమీపించి, జాగ్రత్తగా దాని మీద దిగారు. వాళ్ళు ఎంతో వెతకగా ఒకచోట రాత్రి పూజారి ముఠా వాళ్ళు వేసుకున్న నెగళ్ళ గుర్తులు మాత్రం కనిపించినై. వాళ్ళు ఏ తెల్లవారుజామునో లంక వదిలిపోయారు.

తరవాత నాలుగు రోజులపాటు వాళ్ళు చిన్నా పెద్ద లంకల పక్కగా ప్రయాణం చేసి, అయిదవనాటి సంధ్యాసమయానికి, ఎత్తయిన కొండలతో, మహావృక్షాలతో వున్న ఒక పెద్ద లంకను చూశారు. ఈ మధ్య కాలంలో వాళ్ళకు శిథిలాలయ పూజారి వున్న పడవలు ఎక్కడా కనబడలేదు.

తాను తన జాతి ముఖ్యపెద్దల ద్వారా విన్న వృశ్చికలంక యిదేనని నాంగ్‌సామ్ గుర్తించాడు. అతడు యిదే వృశ్చికలంక అని కిలిముకి, విక్రమకేసరులతో చెప్పగానే, వాళ్ళు ఎక్కడలేని సంతోషంతో పడవలను తీరానికి నడపమన్నారు.

కొద్దిసేపటి తరవాత పడవలు రెండూ తీరాన్ని చేరినై. అందరూ పడవల్లోంచి ఒడ్డుకు దిగారు. ఇంకా వెలుతురు వుండగానే, దాపుల నున్న కొండ ఎక్కి, లంక ఎలా వున్నదీ చూసేందుకు విక్రమకేసరి, కిలిముకి బయలుదేరారు. మిగతావాళ్ళు పడవల దగ్గిరే వుండిపోయారు.

వాళ్ళిద్దరూ కొండ పై భాగం చేరి, దూరంగా లంకలో అంతకన్న చాలా ఎత్తుగా వున్న మరికొన్ని కొండల కేసి కొంచెం సేపు చూసి, వెనుదిరగబోయేంతలో వాళ్ళదృష్టి దిగువనున్న చిన్న గుట్ట మీద పడింది. ఆ వెంటనే వాళ్ళకు కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. ఆ గుట్ట మీద పాడుబడి కూలిపోవటానికి సిద్ధంగా వున్న ఒక దేవాలయం వున్నది. —(ఇంకా వుంది)





# శిథిలాలయం

## 28

[శిఖిముఖి వాళ్ళు రాత్రివేళ ఒక చిన్న లంకలో విడిది చేశారు. వాళ్ళ పడవను నీట ముంచ వచ్చిన శిథిలాలయ పూజారి బంటు ఒకడు సాంగ్‌సాహ్ చేత చంపబడ్డాడు. నాలుగు రోజుల ప్రయాణం తరవాత వాళ్ళు వృశ్చికలంక చేరారు. అక్కడ శిఖిముఖి, విక్రమకేసరులకు పాడుబడ్డ దేవాలయం ఒకటి కనిపించింది. తరవాత—]

గుట్ట మీద కనిపించిన పాడుబడ్డ దేవాలయం కేసి శిఖిముఖి, విక్రమకేసరులు బయలుదేరారు. ఎంతో శ్రమకోర్చి, ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని యీ వృశ్చిక లంకకు వాళ్ళు చేరారు. శిథిలాలయం తమకు యింత సునాయాసంగా కళ్ళబడు తుందని వాళ్ళు కలలో కూడా అనుకోలేదు.

సూర్యాస్తమయమైంది. నాలుగు వైపులా చీకటి ముసురుకుంటున్న సమయంలో వాళ్ళిద్దరూ దేవాలయాన్ని చేరారు. కాని, ఆలయప్రాంగణంలో అడుగు పెడుతూనే వాళ్ళు పొందిన ఆశాభంగం అంతా యింతా కాదు. ఆలయం పూర్తిగా శిథిలావస్థలో వున్నమాట నిజం! కాని, తాత విక్రమ కేసరి ఊహించినట్టు అందులో శిల్పకళా ఖండాలు గాని, స్తంభాలకు బంగారు తొడుగులు గాని ఏమీ లేవు. అంతా పట్టి రాతి కట్టడం. గర్భగుడిలో కాళీదేవిమూర్తివ







స్ఫురింపచేసే ఒక రాతివిగ్రహం, ఒక పక్కకు ఒరిగి వున్నది. గోడలలో వున్న గూళ్ళలో కొన్ని రాతి ప్రతిమలు చెల్లాచెదురుగా పడివున్నవి. ఆలయం ఏదో భూకంపం తాకిడికి గురి అయినట్టుగా శిఖిముఖి, విక్రమకేసరులకు తోచింది.

"కేసరీ, యిది మనం వచ్చిన శిథిలాలయం లాగా లేదు. మీ తాతగారు విన్నది, మనకు భిక్షుజాతివాళ్ళు చెప్పింది ఎంతో అద్భుత శిల్పంతో వున్న ఆలయం గదా?" అన్నాడు శిఖిముఖి.

విక్రమకేసరి, శిఖిముఖి మాటకు అవునన్నట్టు తలవూపి, విగ్రహాన్ని సమీపించాడు. అదే సమయంలో ఒక పెద్ద తేలు విగ్రహం వెనకనుంచి గోడవైపుకు చరచరా పాకిపోసాగింది. అది మామూలు తేళ్ళకన్న పది పన్నెండంతలు పెద్దదిగా వున్నది. విక్రమకేసరి దాన్ని చంపేందుకు కత్తి ఎత్తేంతలో మరి రెండు తేళ్ళు విగ్రహం వెనక నుంచి బయటికి వచ్చినై.

శిఖిముఖి, విక్రమకేసరి చేయి పట్టుకుని, "కేసరీ, వాటిని చంపేందుకు లేనిపోని శ్రమపడకు. ఇది వృశ్చికలంక! ఈ రాకాసి తేళ్ళను చంపదలిస్తే, మనకు మరొక పని చూసుకునేందుకు తీరికే వుండదు," అన్నాడు నవ్వుతూ.

"ఆ మాట నిజమే. మనం వీటి వాత పడకుండా తప్పుకు తిరగటం ఒక్కటే సరైన మార్గం. సరే—యిది మనం అనుకున్న శిథిలాలయం కాదు. ఇప్పుడేమిటి చేయటం?" అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి తలపంకించి ఆలోచిస్తూ దేవాలయం నుంచి బయటికి వచ్చి, చుట్టూ వున్న కొండలకేసి ఓసారి తలతిప్పి చూసి, "మనం అసలు శిథిలాలయాన్ని కనుక్కోవటానికి, యీ కొండలూ, గుట్టలూ వెతక్క తప్పనిసరిలా వున్నది. కాని, ఆ ప్రయత్నంలో మనం పూజారి దుర్మార్గుణ్ణుంచి







ఎలాంటి ఆపదా రాకుండా తగు జాగ్రత్తలో వుండటం అవసరం," అన్నాడు.

"నా కొక అనుమానం కలుగుతున్నది, శిఖి! పూజారి మనకన్న ముందుగానే, యీ వృశ్చికలంక చేరాడు, అందుకు సందేహం లేదు. ఒకవేళ వాడు యీ సరికే ఆ శిథిలాలయాన్ని కనుక్కొని, అక్కడి అమూల్యమైన వస్తువులను హరించి పారిపోయి వుంటాడు గదా?" అన్నాడు కేసరి.

ఆ మాటలకు శిఖిముఖి నవ్వి, "అనుమానాలతో, సందేహాలతో మనం బుర్రలు వేడెక్కించుకోవటం మంచిది కాదు. రేపు సూర్యోదయంతోనే మనం యీ లంక అంతా శిథిలాలయం కోసం గాలిద్దాం. ఒకవేళ పూజారి మనకా సమయంలో తటస్థపడితే, వాడి అంతు చూద్దాం. ఈ సరికే వాడు శిథిలాలయం చేరటం కల్ల," అన్నాడు.

ఆ తరవాత ఇద్దరూ మౌనంగా పడవల దగ్గిరకు వచ్చి, అక్కడ వున్న వాళ్ళకు తాము చూసిన శిథిలదేవాలయాన్ని గురించి చెప్పారు. ఈ లంకలో అలాంటి శిథిలాలయాలు చాలా వుండవచ్చునన్నాడు, నాంగ్ గోమ్. ఒకప్పుడీ లంకలో అభ్యుజాతివాళ్ళు వేలసంఖ్యలో వుండేవాళ్ళని కులపెద్దలు చెప్పగా విన్నానని అతడు చెప్పాడు.



తరవాత వంట పని ముగించి, అందరూ భోజనాలు చేశారు. ఆ సరికి బాగా పొద్దు పోయింది. చంద్రకాంతిలో చుట్టూ వున్న కొండలూ, మహా వృక్షాలూ మిలమిలా మెరిసి పోతున్నవి. పడవలకు బాంగ్‌లాను కాపలా పెట్టి, అందరూ నిద్రలకు ఉపక్రమించారు.

బాగా అలసిపోయి నిద్రపోతున్న శిఖిముఖి, నడి రాత్రివేళ దాపుల నేదో చప్పుడైతే చప్పున కళ్ళు తెరిచాడు. బాంగ్‌లా గుంటుతూ అతణ్ణి సమీపిస్తున్నాడు. వాడేదో ద్రోహం తలపెట్టాడన్న ఆలోచన శిఖిముఖి మెదడులో మెరుపులా కదిలింది. ఆ వెంటనే







"ఎవరైందీ తెలియటం లేదు. నేల బారున పడుకుని జాగ్రత్తగా వినండి. ఏదో తప్పెటల మోత అస్పష్టంగా వినబడుతున్నది... అదుగో, ఇప్పుడు మరింత స్పష్టంగా వినవస్తున్నది!" అంటూ జాంగ్లా దాపుల నున్న చెట్ల కేసి తల తిప్పాడు.

ఆ సరికి శశిముఖికి కూడా ఆ చప్పుళ్ళు స్పష్టంగా వినిపించినై. ఆ వెంటనే అతడు విక్రమకేసరి, తతిమ్మావాళ్ళు కూడా వినేట్టుగా పెద్ద గొంతుతో, "శత్రువులు! లేవండి!" అన్నాడు.

విక్రమకేసరితో పాటు అందరూ ఒక్క పారిగా నిద్రమేల్కొన్నారు. ఏదో ప్రమాదం రానున్నదని గుర్తిస్తూనే ప్రతి ఒక్కడూ ఆయుధాలు చేతికి తీసుకోబోయాడు. కాని అంతలో వాళ్ళను అన్ని వైపుల నుంచి పాతిక ముప్పై మంది వికృతాకారులు చుట్టు ముట్టారు. వాళ్ళల్లో ఒకడికి తల మీది నుంచి కళ్ళను కప్పి వేస్తూ, తోలు ఆకారంగల టోపీ వున్నది. దానికి పొడిచిన రంధ్రాల్లో నుంచి వాడి కళ్ళు మిలమిలా మెరుస్తున్నవి.

తోలుటోపీ వాడు చేతిలో వున్న రాతి గొడ్డలిని పైకెత్తి తన అనుచరులతో, "నాకు కలలో వృక్షదేవత కనిపించి చెప్పింది

అతడు పక్కన వున్న కత్తిని చేతికి తీసుకుని, లేచి నిలబడ్డాడు.

జాంగ్లా ఓ క్షణకాలం నిర్విణ్ణుడై, అంతలోనే స్థిమితపడి, "శశి దొరా! నేను దొంగలా మిమ్మల్ని చంపటానికి వచ్చాననుకుంటున్నారా? అంతా నమ్మి తమరు నమ్మలేదన్నమాట! నేను వచ్చింది, తమను అపాయం రాబోతున్నదని హెచ్చరించటానికి!" అన్నాడు.

తన తొందరపాటుకు శశిముఖి కొంచెం సిగ్గుపడి, "అపాయమా? ఎవరా శత్రువులు? శిథిలాలయ పూజారా?" అని అడిగాడు.







వాళ్ళను గురించే! వాళ్ళలో యోగ్యుడైన వాడిని బలియిస్తే, ఏ ప్రమాదం లేకుండా మనం వృశ్చికమాత మందిరంలో ప్రవేశించ వచ్చు." అన్నాడు.

ఈ వికృతాకారులు వృశ్చికలంకలోని ఆదిమవాసులని, యిప్పటి పరిస్థితుల్లో వాళ్ళను ఎదిరించటం ప్రమాదకరమని శిఖిముఖి గ్రహించాడు. విక్రమకేసరితో అతడా మాట అనగానే, అతడు కూడా అందుకు అంగీకరించాడు.



ఈ లోపల నాంగసోమ్, శిఖిముఖిని సమీపించి, "వీళ్ళు మాట్లాడే భాష మా అభ్యజాతివాళ్ళు మాట్లాడేదానికి చాలా దగ్గిరగా వున్నది!" అన్నాడు.

"అందువల్ల మనకేమైనా మేలు కలుగుతుందంటావా? మనం ఏ దురుద్దేశంతోనూ యీ లంకకు రాలేదనీ, తుఫాను దెబ్బకు పడవలు యీ లంక చేరినవనీ చెప్పు!" అన్నాడు శిఖిముఖి.

నాంగసోమ్ వాళ్ళ నాయకుణ్ణి సమీపించి, శిఖిముఖి చెప్పమన్న విధంగా చెప్పి, "మనమంతా ఒకే అభ్యజాతికి చెందిన వాళ్ళం. మనలో మనకు శత్రుత్వం ఎందుకు? ఉదయం రాగానే మా దారిన మేం పోతాం." అన్నాడు.

ఆ మాటలకు నాయకుడు ఆశ్చర్యపడి నట్టు తనవాళ్ళ కేసి చూసి, నాంగసోమ్‌తో, "మేం అభ్యజాతివాళ్ళ మన్నది ఏనాటి మాట! మాది వృశ్చికజాతి. రెండు రోజుల క్రితం యీ లంకలో శిథిలాలయ పూజారినని వాడొకడు దిగి, తామూ అభ్యజాతివాళ్ళమనీ, శిథిలేశ్వరి ఆలయం వెతుక్కుంటూ వచ్చా మనీ అంటున్నాడు. అతననే శిథిలేశ్వరి ఆలయం, మేం చెప్పే వృశ్చికమాత మందిరం ఒకటేనని నాకు అనుమానం కలిగింది. రేపు మిమ్మల్ని అతడి గుంపులో చేరుస్తాము. అప్పుడుగాని అసలు మీరంతా ఎందుకు యీ లంక కొచ్చింది బయట









వదడు. ఎల్లుండి పౌర్ణమినాడు నేను వెఱ్ఱి వెలగపండు తిని, భూగర్భంలో ఆ మందిరం ఎక్కడున్నదో కనుక్కుని, మిమ్మల్నందర్నీ వృశ్చికమాతకు బలిపెడతాను," అన్నాడు.

శిఖిముఖి ఏదో మాట్లాడబోయాడు. కాని వృశ్చికజాతి వాళ్ళ నాయకుడు అతడి కేసి రాతిగొడ్డలి వూపి, తన అనుచరులకు, బందీలందర్నీ వెంట తీసుకురమ్మని చెప్పి, ముందు బయలుదేరాడు.

శిఖిముఖి వాళ్లు చేసేది లేక వాళ్ల వెంట బయలుదేరారు. శిథిలాలయపు పూజారి యీ లంక చేరావని, ఏదో ఎత్తులు వేసి శిథిలాలయం ఎక్కడ వున్నదీ తెలుసుకునేందుకు ప్రయత్నిస్తున్నారని శిఖిముఖికి అర్థమైపోయింది. వృశ్చికజాతివాళ్ళ నాయకుడు చెప్పేదాన్ని బట్టి, ఆ ఆలయం యీ లంకలో ఎక్కడో భూగర్భాన కప్పబడి వున్నది. వాడనే వెఱ్ఱివెలగపండు సంగతేమిటి?

శిఖిముఖికి కలిగిన యిలాంటి సంశయమే నాంగసోమకు కూడా కలిగింది. అతడు తన పక్కగా నడుస్తున్న ఒక వృశ్చికజాతి వాణ్ణి, "వెఱ్ఱి వెలగ పండేమిటి? దానికి అంత మహత్తున్నదా? ఎక్కడ దొరుకు తుంది?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు వృశ్చికజాతివాడు చేపత్తి, దాపుల వున్న రెండు కొండ శిఖరాలను చూపుతూ, "ఆ వెలగపండు వుండే చెట్లు నాలుగైదు ఆ శిఖరాల దిగువనున్న చిన్న కొలను ఒడ్డున వున్నవి. ఆ పండు తిన్న వాడికి భూగర్భంలో ఎక్కడ ఏమున్నదీ తెలిసి పోతుంది," అన్నాడు.

ఈ వెఱ్ఱి వెలగపండు మహత్తును గురించి నాంగసోమ గోలభరా గ్రామంలో బభ్రుజాతి పెద్దలు మాట్లాడుకుంటూండగా చాలాసార్లు విన్నాడు. ఆ పండు ఒక్క వృశ్చికలంక లోనే దొరుకుతుందని, అది తిన్నవాడికి లోకం మరోరకంగా కనబడు తుందని, జ్ఞాపకం పోవటం కూడా అతడికి





తెలుసు. కాని, యీ భూగర్భ రహస్యాలు కనుక్కునే శక్తి దాని కున్నదని అతడు మొదటిసారిగా యిప్పుడే వింటున్నాడు.

ఏదో విధంగా ఆ విచిత్రవెలగపండు సంపాయించి, తినగలిగితే శిథిలాలయం కనుక్కోవటం తేలిక అని, తమ సమస్యలన్నీ సునాయాసంగా పరిష్కారమైపోతవనీ, నాంగ్‌సోమ్ ఆలోచించాడు. కాని, ఆ వెలగపండు వున్న చోటుకు చేరాలంటే, తను వృశ్చికజాతివాళ్ళ కళ్ళు కప్పవలసి వుంటుంది....

నాంగ్‌సోమ్ యిలా ఆలోచిస్తున్నంతలో వృశ్చికజాతివాళ్ళ నాయకుడు ఒక కొండ గుహ దగ్గిర ఆగి, పెద్ద గొంతుకతో, "బందీలందర్నీ యీ రాత్రికి యిక్కడే నిద్రపొమ్మనండి. ఉదయం కాగానే వాళ్ళ నేంచేయాలో ఆలోచిస్తాను," అని, కొండగుహలోకి పోయాడు.

శిలాముఖివాళ్ళు గుహ ముందున్న చెట్ల కింద పడుకున్నారు. వాళ్ళను పట్టుకున్న వృశ్చికజాతివాళ్ళు కూడా దగ్గిరలో అక్కడక్కడా బండరాళ్ళకు చేరగిలబడి కునికిపాట్లు పడసాగారు.

నాంగ్‌సోమ్‌కు యిది మంచి అవకాశంగా కనిపించింది. తాను విచిత్రవెలగపండు కోసం శిఖరం కింద వున్న కొలను దగ్గిరికి పోతు తున్నట్టు శిలాముఖికి చెప్పదామనుకున్నాడు



గాని, ఒకవేళ అందుకతడు అభ్యంతరం తెలుపుతాడేమో అన్న భయం కలిగింది. ఆ కారణంగా నాంగ్‌సాప్ పడుకున్న చోటు నుంచి మెల్లిగా లేచి, కొండ శిఖరం దిగువ నున్న కొలను కేసి బయలుదేరాడు.

నాంగ్‌సాప్ కొలను ప్రాంతాన్ని చేరేసరికి ఒక వృశ్చికజాతివాడు కొలను పక్కనున్న వెలగచెట్ల కింద అటూ యిటూ పహరా తిరుగుతున్నాడు. వాడి దెబ్బ తీయకుండా తాను వెలగపండు సంపాయించటం సాధ్యం కాదని నాంగ్‌సాప్ గ్రహించాడు. ఆ వెంటనే అతడు, ఒక రాతి చాటున దాక్కుని చిన్నగా ఈల వేశాడు.

నాంగ్‌సాప్ వేసిన ఈల వినపడగానే పహరావాడు, "ఎవరక్కడ?" అంటూ నాంగ్‌సాప్ దాగివున్న రాతి దగ్గరకు పరిగెత్తుకు వచ్చాడు. నాంగ్‌సాప్ చప్పున రాతి వెనక నుంచి లేచి, పహరావాడి ముఖంమీద బలంగా ఒక దెబ్బ కొట్టాడు. పహరావాడు కిక్కురుమనకుండా కింద పడిపోయాడు. నాంగ్‌సాప్ అతడి కాళ్ళూ చేతుల్నీ ఒక బలమైన చెట్టుతీగతో బంధించి, వాడ్ని రాతికి ఆనించి కూచోబెట్టి, వేగంగా వెర్రివెలగచెట్ల కేసి పరిగెత్తాడు.

ఒకటి రెండు నిమిషాల్లో వృశ్చికజాతి పహరావాడికి స్పృహ వచ్చింది. వాడు వెలగచెట్ల కేసి తలతిప్పి చూశాడు. వాడికి అటుకేసి పరిగెత్తుతున్న నాంగ్‌సాప్ కనిపించాడు. వెంటనే వాడు కట్లు విప్పుకునేందుకు పెనుగులాడసాగాడు. కట్లు తెగలేదు కాని, పక్కనున్న బండరాయి కదిలింది. అది మీద పడుతుందేమో నన్న భయంతో వాడు భుజం ఆనించి దాన్ని వెనక్కు తోయబోయాడు. బండరాయి స్థానంతప్పి కిందకు దొర్లసాగింది. దానితో పాటు పహరావాడు కూడా శిఖరమునివాళ్ళు నిద్రపోతున్న కొండ దిగువకు దొర్లుకు రాసాగాడు.

—(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 29

[రాత్రివేళ శిఖిముఖి వాళ్ళను వృశ్చికలాంగలోని ఆదిమవాసులు పట్టుకున్నారు. వాళ్ళ నాయకుడు చెప్పిన ప్రకారం వెంగపంతు శవం కోసం వాంగపాపు వెళ్ళి, అక్కడ కాపలా వున్న వాణ్ణి పట్టుకుని, కాళ్ళూ చేతులూ కట్టివేశాడు. వాడు పక్క నున్న బండరాయితో పాటు, శిఖిముఖి వాళ్ళు నిద్రపోతున్న కొండ దిగువకు దొర్లుకు రాసాగాడు. తరవాత—]

గుహలో నిద్రపోతున్న వృశ్చికజాతి వాళ్ల నాయకుడికీ, గుహముందు కునికిపాట్లు పడుతున్న శిఖిముఖి అతడి అనుచరులకూ, కొండపై నుంచి దొర్లుకు వస్తున్న బండ రాయీ, కాపలావాడూ కలిసి చేసే పెద్ద ధ్వని భయం కలిగించింది. ఏదో పెను తాకిడికి కొండ శిఖరం తునాతునకలై కింద పడుతున్నదనుకున్నాడు, శిఖిముఖి. అతడు గొంతెత్తి తనవాళ్ళను హెచ్చరించే లోపలే, గుహలో నుంచి వృశ్చికజాతివాళ్ళ నాయకుడు మెరుపులా బయటికి వచ్చాడు.

"కొండ అంచు నుంచి దూరంగా పరిగెత్తండి. భూకంపం! భూకంపం!" అంటూ అరిచాడు వాడు.

ఆ హెచ్చరిక వింటూనే అందరూ పారిపోబోయేంతలో, పెద్ద ధ్వనితో బండ రాయీ, ఓ క్షణం ఆలస్యంగా కాపలా వాడూ కొండ మీది నుంచి కిందపడ్డారు,



అదృష్టవశాన బండరాయి మనుషు లెవరూ లేని చోట పడింది. కాని కావలావాడు మాత్రం కీచుమని అరుస్తూ తన జాతివాళ్ళందరి మీద దబీమంటూ పడిపోయాడు.

వృశ్చికజాతి నాయకుడు కిందపడి మూలుగుతున్న కావలావాణ్ణి సమీపించి, "ఇదేమిటి? కాళ్ళూ చేతులూ కట్టుకున్నావేం?" అని ప్రశ్నించాడు.

వాడు తడబడుతూ లేచి నిలబడి, "మనం పట్టుకున్న యీ ఇభ్యజాతి వాళ్ళల్లో ఒకడు నేను కావలాకాసే చోటుకు వచ్చి, దొంగదెబ్బ తీసి నా కాళ్ళూ చేతులూ కట్టివేశాడు. ఈ సంగతి చెప్పేందుకు నేను కొండ మీది నుంచి దిగి వచ్చాను," అన్నాడు.

ఈ మాటలు వృశ్చిక నాయకుణ్ణి, శిఖిముఖి, విక్రమకేసరుల్ని కూడా ఆశ్చర్యపరిచినై. శిఖిముఖి తన అనుచరుల కేసి చూసి, వాళ్ళల్లో నాంగ్‌సామ్ లేడని తెలుసుకున్నాడు. అతడు విక్రమకేసరితో యీ సంగతి చెప్పబోయేంతలో వృశ్చిక నాయకుడు గడగడ వణికిపోతూ, "మీలో ఒకడు రహస్యంగా ఆ వెర్రివెలగపళ్ళ కోసం వెళ్ళాడు. ఒకవేళ దుస్సాహసం కొద్దీ వాడా పండు తిన్నాడో, చాలా చిక్కుల్లో పడిపోతాడు. ఇప్పుడేం చేయటం?" అన్నాడు.

"అలా అయితే మనం త్వరగా పోయి నాంగ్‌సామ్ ఆ వెలగపండు తినకుండా ఆపే ప్రయత్నం చేద్దాం. ఇంతకీ ఆ పండు తింటే రాబోయే ప్రమాదం ఏమిటి?" అన్నాడు శిఖిముఖి.

"వృశ్చికజాతి వాళ్ళ నాయకుడు తప్ప మరెవరూ ఆ వెర్రివెలగపండు తిని నిభాయించుకోలేరు. ఆ మధ్య నాకు పట్టుబడ్డ శిఖవాడికి — వాడు పెట్టుకున్న పేరు — శిథిలాలయపూజారి కామాలు — వాడి చేత ఆ పండు తినిపించి, నిజం మాట్లాడేటట్టు







చేద్దామనుకున్నాను." అన్నాడు వృశ్చిక నాయకుడు.

కళిముళి వృశ్చిక నాయకుడితో, "నాంగ్‌సోమ్ ఎవర్నీ మోసగించి వెర్రి వెలగపండు కోసం వెళ్ళలేదు. అతడికి మధ్య, యీ ప్రాంతాల గాలి నీరూ పడక మనస్థిమితం కాస్త తప్పింది. మనం మనం అంతా మిత్రులం. శిధిలాలయం ఎక్కడుండో కనుక్కోవటంలో మీకు అన్ని విధాలా సాయపడగలం. ముందు నాంగ్‌సోమ్ ఎక్కడున్నాడో వెతికి పట్టుకుందాం పదండి." అన్నారు.

నాంగ్‌సోమ్ వెర్రివెలగపండు తినివుంటే అతణ్ణి తప్పక వృశ్చికమాతకు బలి యిస్తానని వృశ్చిక నాయకుడు తన వాళ్ళతో చెప్పి, కళిముళి వాళ్ళతో, "పదండి! పండు తిని ఏ వాడు ప్రాణం మీదికి తెచ్చుకోక ముందే పట్టుకుందాం." అన్నాడు.

అందరూ వృశ్చిక నాయకుడి వెంట వెర్రివెలగపండు చెట్లున్న కొలను కేసి బయలుదేరారు. కాని, యీ లోపలే నాంగ్‌సోమ్ వెలగచెట్టెక్కి, ఒక పండు కోసుకుని తిన్నాడు. అది తిన్న కొద్ది క్షణాల కల్లా అతడికి ఏదో మైకం కమ్మినట్టయిపోయింది. తాను నిలబడ్డ భూమి, చెట్లు



చేమలూ, కొండలూ—అన్నీ గిర్రున తిరిగిపోతున్నట్టు తోచింది.

"నేను తిన్నది వెర్రివెలగపండు! నాకది వెర్రెత్తుతున్నట్టున్నట్టున్నది. ఈ వెర్రితోగాని భూగర్భంలో వున్న శిధిలాలయం కనుక్కోలేనేమో! అసలు శిధిలాలయం, వృశ్చికమాత మందిరం ఒకటేనా? ఒకటే! అదుగో శిధిలాలయం! అదుగో, వృశ్చికమాత మందిరం!" అంటూ నాంగ్‌సోమ్ తల పీక్కుని, అరుస్తూ కొండదార్ల వెంట పరిగెత్తసాగాడు.

అతణ్ణి పట్టుకునేందుకు బయలుదేరిన కళిముళి వాళ్ళకు అతడు చెట్లల్లో నుంచి,









కొండకోనల్లో నుంచి అరిచే అరుపులు తప్ప మనిషి మాత్రం కనిపించలేదు. ధ్వని వచ్చిన దిక్కుగా వాళ్ళు సూర్యోదయం అయ్యే వరకూ అతడి కోసం గాలించి, బాగా అలిసిపోయి, ఒక కొండ అంచున వున్న చెట్ల కింద కూలబడ్డారు.

వెర్రివెలగపండు చెట్టున్న కొలనుకు అవతల వున్న అరణ్యంలో వృశ్చికజాతివాళ్ల కాపుదలలో వున్న శిథిలాలయ పూజారికి, నాంగ్‌సోమ్ పిచ్చిగా వేసే కేకలు, ఆ రాత్రి వేళ వినిపించినై. అతడు తన అనుచరులైన నవరభేరుండాన్నీ, తతిమ్మావాళ్ళనూ హెచ్చరించి, వృశ్చికజాతి కాపలా వాళ్లతో, ఆ కేకలు పెట్టేవాడు వృశ్చికమాత ఆవేశించిన మహాభక్తుడని, అతణ్ణి అనుసరించి పోతే, మాతమందిరం కనబడుతుందని నమ్మబలికాడు.

మాయమర్మాలు అంతగా ఎరగని వృశ్చిక జాతివాళ్ళు, శిథిలాలయ పూజారి వెంట నాంగ్‌సోమ్ కోసం బయలుదేరారు. తూర్పు తెలతెలవారుతూండగా వాళ్ళకు ఒక గుహ ముందు నాంగ్‌సోమ్ కనిపించాడు. గుహ ముఖం చిక్కని సాలె గూడతో కప్పబడి వున్నది. అందులో ఒక రాకసితేలు చిక్కుకుని, బయట పడేందుకు నానా ప్రయాసా పడుతున్నది.

నాంగ్‌సోమ్ ఆ సాలెగూడ ముందు కత్తి పట్టుకుని అటూ యిటూ గెంతుతూ, "రక్షించండి! రక్షించండి! భయంకర బలజంతువు నన్ను మింగబోతున్నది!" అంటూ అరుస్తున్నాడు.

ఆ అరుపులూ, నాంగ్‌సోమ్ భయంతో వణికిపోతున్న తీరూ చూసి, శిథిలాలయ పూజారి అతడికి వెర్రి వెలగపండు తిన్న కారణంగా మతిస్థిమితం తప్పిందని గ్రహించాడు. వృశ్చికజాతివాళ్ళు నమ్ముతున్నట్టు బహుశా ఆ స్థితిలోనే అతడు నిజమైన శిథిలాలయం ఎక్కడ వున్నదో





కనుక్కొవచ్చునన్న నమ్మకం కూడా అతడికి కలిగింది.

పూజారి అతణ్ణి సమీపించి, "నువ్వు ఖద్యుజాతి వాడివి కాదా? నిన్ను గెల్ఖరా గ్రామంలో చూశాను. నీ పేరు నాంగసామ్. అవునా?" అని ప్రశ్నించారు.

నాంగసామ్ ఆ మాటలు వింటూనే ఉలిక్కిపడి వెనక్కు తిరిగి, "నెత్తి మీద శిఖతో ఋక్షుడ అవతరించిన మహానుభావులు మీ రెవరు? సిద్ధుల్లా వున్నారు. నన్ను యీ ఖడ్గమృగం నుంచి కాపాడాలి." అంటూ పూజారికి సాష్టాంగపడ్డాడు.

పూజారి అతణ్ణి భుజాలు పట్టుకుని లేపి నిలుచో పెట్టి. "అది ఖడ్గమృగం కాదు. రెండు తలల గండభేరుండం. ఒక్క క్షణంలో చంపేయిస్తాను," అంటూ పక్కనున్న నవరభేరుండంతో. "భేరుండం! ఆ పిశాచిని నరుకు." అన్నారు.

ఆ వెంటనే భేరుండం కత్తితో తలను బలంగా కొట్టాడు. అది రెండుగా తెగిపోయి, రక్తంతో పాలిగూడు తడిసిపోయింది. నాంగసామ్ ఆ నెత్తురు చూస్తూనే వణుకుతూ పూజారి పాదాలు పట్టుకుని, "మహా సిద్ధులు నన్ను రక్షించారు! నెత్తురు ప్రవాహంలో కొట్టుకుపోతున్నాను. ఉత్తరాము!" అన్నాడు.



శిథిలాలయ పూజారి అతడికి అభయం యిస్తున్నవాడిలా చేతిని తల మీద పెట్టి, "నీ కొచ్చిన భయం ఏమీ లేదు. రక్తపు చెరువు. సెలయేటి జాలుగా మార్చాను. నువ్వు దాని వెంట బయలుదేరి భూగర్భంలో శిథిలాలయం వున్నచోటు చేరు." అన్నారు.

"గురుసిద్ధా, తమ ఆజ్ఞ!" అంటూ నాంగసామ్ అక్కణ్ణించి కదిలి వేగంగా నడవసాగాడు.

శిథిలాలయపూజారి తన బంట్లతో, "బిల్లి తోక పట్టుకుని బ్రహ్మపుత్రానది యీవల చూసినట్టుంది మన పని! అయినా ఏ పుట్టలో ఏ పాముందో చెప్పలేం. వీడి







వెర్రి మనసు శిథిలాలయం చేర్చినా చేర్చ వచ్చు. మీరు పారిపోకుండా జాగ్రత్త పడాలి." అని చెప్పి నాంగ్‌సామ్ వెంట నడవసాగారు.

నాంగ్‌సామ్ వాళ్ళను ఆ చుట్టుపక్కల గల గుట్టల్లో, చెట్లల్లో నానా గిరికీలా కొట్టించాడు. వెర్రి వెలగపండు విషం అతడి మస్తిష్కాన్ని బాగా వశపరుచుకున్నది. అతడికి ప్రతి చిన్న ప్రాణి ఏనుగంత ఆకారంలో భయంకరంగా కనబడసాగింది. అలాంటి సమయాల్లో అతడు పెద్దగా, "గురుసిద్ధా, నీవే రక్ష!" అంటూ కేకలు పెట్టసాగాడు.

మిట్టమధ్యాహ్నం వేళకు నాంగ్‌సామ్ అందర్నీ ఒక ఎత్తయిన పర్వతం మీదికి చేర్చాడు. దిగువను ఒక చిన్న లోయ వున్నది. ఆ లోయలో బాగా ఎత్తుగా, గుబురుగా పెరిగిన వటవృక్షాలు అసంఖ్యాకంగా వున్నవి.

నాంగ్ లోయ కేసి ఓ మారు చూసి జుట్టు గట్టిగా పీక్కుని, "గురుసిద్ధా! శిథిలాలయం ఆ అగాధంలో వున్నది. ఎంత బంగారం! ఎన్ని మణిమాణిక్యాలు! ఆలయం మీది కలశం....అదుగో, మెరుస్తున్నది!" అన్నాడు.

శిథిలాలయపూజారి లోయలోకి తొంగి చూశాడు. నాంగ్‌సామ్ చెప్పిన దేమీ అతడికి కనిపించలేదు. పెద్ద పెద్ద ఊడలు దించుకున్న వటవృక్షాలు మాత్రం అతడి కంటబడినై.

"ఇది వెర్రి వాగుడు! వెధవ మనల్ని గుట్టలూ పుట్టలూ తిప్పి నానా హైరాన పెట్టాడు, లోయలోకి తోసేస్తే సుఖపడి పోతాం," అన్నాడు శిథిలాలయపూజారి కోపంగా.

ఆ మాట వింటూనే సవరభేరుండం ముందుకు వచ్చి, "గురుప్రభో! కార్తిని వున్న పళంగా తోయమన్నారా, ముక్కలుగా నరికి విసరమన్నారా?" అన్నాడు.









మరుక్షణం వృశ్చికజాతివాళ్లలో కలకలం లేచింది. వాళ్ళు రాతి గొడ్డళ్ళను పైకెత్తి ముందుకు వచ్చి, "ఈ సభ్యజాతి వాడికి ఎలాంటి హాని జరక్కూడదు. అతడు వృశ్చికమాత గణాచారి. అతడు చెప్పినట్టు ఆ లోయలో వృశ్చికమాత మందిరం వున్నదేమో ఎవరు చూశారు!" అన్నారు.

పూజారి ఏదో అనబోయేంతలో సవరభేరుండం చేతులు వూపుతూ, "అది నిజమే, గురుప్రభో! అలా గాల్లోకి ఎగిరి లోయలో వాలమన్నారా?" అన్నాడు.

శిథిలాలయపూజారి అతణ్ణి గట్టిగా కసిరి, "నువ్వు మళ్ళీ అతిగా తాగటం మొదలు పెట్టినట్టుంది, జాగ్రత్త. కొండ ముచ్చుగా మార్చి, యిక్కడి చెట్ల మీద వదిలి పోతాను." అన్నాడు.

"గురుప్రభో! అలా చేయకండి. కొండ ముచ్చులు కొండల్లో తప్ప చెట్ల మీద బతకటం...."

సవరభేరుండం మాట పూర్తి చేసే లోపలే పూజారి కీచుమంటూ ఒక్క ఎగురెగిరి, "అదే, వచ్చె వచ్చె! శబరశుంఠ శిఖిముఖి వాడిదంతా!" అన్నాడు.

శిఖిముఖి కొండ మీదికి వస్తూనే, "నాంగ్‌సోమ్‌ను కొండ అంచు నుంచి యివతలికి లాగండి." అని శిథిలాలయపూజారిని చూసి, "దుర్మార్గుడా, యింత కాలానికి దొరికావ్! పారిపోవాలని చూశావే వీపులో కత్తో, బాణమో గుచ్చుకుంటుంది." అన్నాడు.

ఎలా పారిపోవటమా అని ఆలోచిస్తున్న పూజారికి, శిఖిముఖి మాటల్లో ఒక ఉపాయం తోచింది. అతడు చప్పున ముందుకు దూకి నాంగ్‌సోమ్‌ను భుజాన వేసుకుని, కొండ అంచునే పరిగెత్తుతూ ఇరుకు రాళ్ళ మధ్య జొరబడ్డాడు.

పాము నోటి నుంచి తప్పుకుని పులినోట పడినట్టయింది, పూజారి పని. అటు వైపు నుంచి కుంటుతూ వస్తున్న ఖాంగ్‌లా ఒక్క





గావు కేక పెట్టి. "పాపాత్ముడా! ఇక నువ్వు ప్రాణాలతో పారిపోలేవు!" అంటూ అతడి మీదికి ఉరికాడు.

శిథిలాలయపూజారి, నాంగ్‌సోమ్‌ను భుజం మీది నుంచి కిందికి జార్చి, మొలను వేలాడుతున్న చురకత్తితో బాంగ్‌లా గుండెలకు గురి చేసి పొడవ బోయాడు. కాని అంతలో బాంగ్‌లా వచ్చి మీద పడటంతో, కత్తి గురి తప్పి అతడి భుజంలో గుచ్చుకున్నది. బాంగ్‌లా అంత బలమైన కత్తిపోటునూ లెక్క చేయకుండా పూజారి మెడ పట్టుకోబోయాడు. కాని, పూజారి తల పక్కకు తిప్పి కొండ అంచుకు ఒరిగి పోవటంతో, అతడి నెత్తిమీది శిఖ బాంగ్‌లా చేతికి దొరికింది.

బాంగ్‌లాకు తగిలిన గాయం నుంచి రక్తం కారుతున్నది. కాని, అతను పూజారి శిఖ వదలకుండా గట్టిగా పట్టుకుని కొండ మీదికి లాగేందుకు ప్రయత్నిస్తున్నాడు. పూజారి తాను కింది లోయలో పడిపోతానన్న భయంతో గిలగిల తన్నుకుంటున్నాడు.

ఆ పరిస్థితుల్లో శిఖిముఖి అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, "బాంగ్‌లా, నీ స్వామిభక్తి మెచ్చదగింది. సవరగండుపోతు కూతురు నాగుమల్లి, ఏది శిఖ కావాలన్నది!" అంటూ కత్తితో శిథిలాలయపూజారి శిఖ మొదటికంటా కోశాడు. మరుక్షణం శిథిలాలయపూజారి ఒక్క చావుకేక పెట్టి లోయలోకి పడిపోయాడు.

ఆ క్షణం వరకూ నాంగ్‌సోమ్ ఏం చేస్తున్నదీ ఎవరూ గమనించలేదు. అతడు లోయలోని మహా వటవృక్షాల కేసి కన్నార్పకుండా చూడ సాగాడు. అతడికి శిథిలాలయ పూజారి పెట్టిన చావుకేక వినిపించింది. ఆ వెంటనే నాంగ్‌సోమ్, "అదుగో, శిథిలాలయం!" అని అరిచి లోయలోని వటవృక్షాల కేసి దూకేశాడు.

—(ఇంకా వుంది)







# శిథిలాలయం

## 30

[వెర్రి వెలగపండు తిన్న నాంగ్‌సాప్ మతిచెడి కేకలు పెట్టసాగాడు. పూజారి అతణ్ణి పట్టుకుని, శిథిలాలయం కనుక్కొనేందుకు బయలుదేరాడు. కొండ మీద శిఖిముఖి వాళ్ళు అతణ్ణి ఎదిరించారు. ఆ సందర్భంలో జాంగ్‌లా గాయపడ్డాడు. శిథిలాలయ పూజారి కింది లోయలో పడిపోయాడు. నాంగ్‌సాప్ లోయలోకి దూకేశాడు. తరవాత—]

నాంగ్‌సాప్ శిథిలాలయం అంటూ అరిచి లోయలోకి దూకటం చూస్తూనే శిఖిముఖి, విక్రమకేసరి నిర్విణ్ణులై పోయారు. గోల్ ఛరా మంది ఎంతో నేర్పుగా అతడు పడవను నడిపి, ఇవా స్వర్ణశిలంకకు చేర్చాడు. మార్గంలోనూ, ఇక్కడికి చేరింతరవాతా మొక్కవోని ధైర్యంతో తమకు సహాయ పడ్డాడు. అటువంటి విశ్వాసపాత్రుడు మతి భ్రమతో లోయలోకి దూకి ప్రాణాలు కోల్పోవటం, వాళ్ళిద్దరికీ అంతులేని ఆవేదనను కలిగించింది

"శిఖీ! మనం గొప్ప మిత్రుణ్ణి పోగొట్టుకున్నాం. ఆ వెర్రివెలగపండులో ఏవో మహత్తర శక్తులున్నవని నమ్మి, తిని, ఘోరమైన చావు తెచ్చుకున్నాడు." అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఏదో జవాబు చెప్పబోయేంతలో జాంగ్‌లా పెద్దగా మూలుగుతూ,







"శిఖరా! నాంగసాము చచ్చిపోయి వుండడు. ఆ దూకటంలో ఏ మహావృక్షం మీద అయినా పడివుంటాడు. దాని కొమ్మలు అతణ్ణి కాపాడే అవకాశం వుంది. పైగా, అతడు శిథిలాలయం కనబడినట్టు కేక వేసి మరీ లోయలోకి దూకాడు. అందులో ఏమైనా వాస్తవం వుండవచ్చు," అన్నాడు.

ఆ మాటలు వినగానే శిఖిముఖి మనసులో కొంత ఆశ మొలకెత్తింది. అతడు జాంగ్లాను సమీపించి భుజం మీద చేయి వేసి ఆప్యాయంగా నిమిరి, "జాంగ్లా! నీ స్వామిభక్తే కాక, ధైర్యసాహసాలు కూడా నాకెంతో ఆనందం కలిగిస్తున్నవి. నువ్వు పట్టుకోకపోతే ఆ శిథిలాలయ పూజారి మళ్ళీ చేజారి పోయివుండేవాడు." అని జాంగ్లా భుజం మీద తగిలిన గాయం నుంచి కారిన రక్తం గడ్డకట్టిపోవటం చూసి, "అరెరె! గాయానికి యింకా కట్టుకట్ట లేదా?" అంటూ చుట్టూ కలయచూశాడు.

అదంతా గమనిస్తున్న వృశ్చికజాతి నాయకుడు చప్పున దాపుల వున్న పొద ల్లోకి పోయి ఏదో ఆకుపసరు తెచ్చి, జాంగ్లా గాయానికి పూసి, కట్టు కట్టాడు. అప్పుడు విక్రమకేసరి, జాంగ్లాతో, "జాంగ్లా! నువ్వు చెప్పినదాన్నిబట్టి నాంగ సాము మాత్రమే కాక, దుష్టుడైన శిథిలా లయ పూజారి కూడా ఏ చెట్టుకొమ్మల మీదనో పడి బతికి వుండవచ్చుగదా?" అని అడిగాడు.

"అవును, దొరా! అలా జరిగితే ఆశ్చర్య పడవలసిందేమీ లేదు," అన్నాడు జాంగ్లా.

ఆ మాట వింటూనే వృశ్చికనాయకుడు కోపంగా ఒక గెంతు గెంతి, "బతికుంటే వాళ్ళిద్దర్నీ పౌర్ణమినాడు వృశ్చికమాతకు బలి ఇస్తాను. వాళ్ళల్లో ఒకడు మోసకారి, రెండవవాడు వృశ్చికజాతి నాయకుడు మాత్రమే తినే అర్హత గల వెర్రివెలగపండు తిని మాతకు అపచారం చేశాడు." అన్నాడు.









అతని మాటలు విక్రమకేసరికి చాలా కోపం తెప్పించినై. అతడు చర్రున కత్తి దూసి, "నువ్వు మొదటి నుంచీ యీ లంక కంతా మహారాజువైనట్టు మాటాడు తున్నావు. మనుషుల్ని బలిపెట్టటం అంత చులకన అనుకున్నావా? ఏదీ నీ శక్తి చూస్తాను. నీ ఆయుధం తీసుకుని యివతలికి రా!" అంటూ కొంచెం దూరంగా పోయి నిలబడ్డాడు.

వృశ్చికజాతివాళ్ళలో కలకలం బయలు దేరింది. వాళ్ళు వాళ్ళ నాయకుడి చుట్టూ చేరి గడవగడవగా మాట్లాడసాగారు. ఇలా నాలుగైదు నిమిషాలు గడిచింతరవాత వృశ్చికనాయకుడు. తన వాళ్ళను తొలగ దోసుకుని. రాతిగొడ్డలి పైకెత్తి విక్రమ కేసరిని సమీపించాడు,

అప్పుడు బలి కన్న ఘోరమైన హత్య జరిగిపోనున్నదని శిఖిముఖి గ్రహించాడు. కేసరి ముందు వృశ్చిక నాయకుడు ఎందుకూ కొరగాడు. ఒక్క కత్తి విసురుతో అతడు వాణ్ణి ముక్కలుగా నరకగలడు!

శిఖిముఖి ఒక పెద్ద కేకతో వాళ్ళిద్దర్నీ వారించి జాంగ్‌లాను వెంటబెట్టుకుని వాళ్ల మధ్యకు పోయి నిలబడి వచ్చిరాని అభ్యు జాతివాళ్ళ భాషలో. "వృశ్చికనాయకా! నువ్వు తొందరపడకు. కేసరి చేతిలో వున్న కత్తి పదును ముందు. నీ రాతిగొడ్డలి ఏడువ యోగం. అసలీ పోట్లాటకు అర్థం లేదు. నువ్వింత వరకూ వృశ్చికమాత మందిరం ఎక్కడున్నదో కనుక్కోలేదు. అంతేకాక నాంగ్‌సోమ్ బతికి వున్నదీ లేనిదీ కూడా మనకు తెలియదు," అన్నాడు.

జాంగ్‌లా వృశ్చికనాయకుడికి అర్థ మయ్యే విధంగా శిఖిముఖి అన్న మాటలు వివరించి చెప్పాడు. నాయకుడు కోపంతో ముక్కుపుటాలు అదురుతూండగా. "ఈ లంక నాది! ఇక్కడికి వచ్చిన వాళ్లంతా నా బానిసలు!" అన్నాడు.







కోపంతో విక్రమకేసరి కత్తి ఎత్తబోయేంతలో శిఖిముఖి అతణ్ణి ఆపి, "ఎవరూ ఎవరికీ యిష్టమై బానిసలు కారుగదా? మా కన్న శక్తిమంతుడవని రుజువు చేసుకుని మాత్రమే నువ్వు మమ్మల్ని బానిసలుగా చేసుకోగలవు. నీ మంచి కోసం చెబుతున్నాను: చూడు: ఈ కత్తి. నీ రాతిగొడ్డలి కన్న పదునైనది. గట్టిది. బలమైనది. నీవు దీన్ని మించిన ఆయుధం. శక్తి సంపాయించుకున్నావు. మేము బహుశా నీకు బానిసల మవుతాం." అన్నాడు.

వృశ్చికనాయకుడికి, శిఖిముఖి చెప్పింది నాలుగు వాక్యాల్లో గబగబా చెప్పి, ఝాంగ్లా కేసరి చేతిలో వున్న కత్తి మీద తన మణికట్టును గట్టిగా ఆనించి. పైకి తీసి బొటబొట కారుతున్న రక్తాన్ని వృశ్చిక నాయకుడికి చూపుతూ, "కత్తి పదును ఎలాంటిదో తెలిసిందా? యిక శిఖిదొర చెప్పినటు విను." అన్నాడు.

వృశ్చిక నాయకుడు కళ్ళెర్రజేసి, ఒక పొలికేక పెట్టి, చేతిలో వున్న రాతిగొడ్డలిని దూరంగా విసిరి, "ధర్మయుద్ధం! ఆయుధం లేకుండా వట్టి చేతులతో పోరాడుదాం." అంటూ రొమ్ము చరిచాడు.

కత్తి కిందకు జార్చి, వృశ్చికనాయకుడితో కలయబడేందుకు విక్రమకేసరి పోబోయేంతలో, శిఖిముఖి అతణ్ణి ఆపి, "ఈ వృశ్చిక తెగ నాయకుడితో పోరాడే హక్కు మా తెగ నాయకుడి కొడుకుది! ఇతడి అనుచరుల్ని మాత్రం ఒక కంట కనిపెట్టి వుంతండి." అంటూ వృశ్చిక నాయకుడి మీదికి లంఘించాడు.

ఇద్దరూ మహారోషంతో ముష్టిఘాతాలిచ్చుకుంటూ, ఒకళ్ళనొకళ్ళు కింద పడదోసేందుకు తీవ్రంగా పోరాడసాగారు. వృశ్చిక నాయకుడు దేహబలంలో శిఖిముఖి కన్న మిన్న అయినా, శిఖిముఖి కున్న నేర్పు ఒడుపూ లేనందున, శిఖిముఖి





అతణ్ణి తల మీదా, రొమ్ముల మీదా బలంగా పొడిచి, చివరకు ఒక్క ఊపుతో నేల మీదికి పడదోసి, ఒక చేత్తో అతడి గొంతు బిగబట్టి, రెండవచేత్తో జుట్టు పట్టుకుని, తలను ఒకటి రెండుసార్లు నేలకు వేసి గట్టిగా కొట్టాడు.

వృశ్చికనాయకుడు కళ్ళు తేలవేస్తూ, చేతులు రెండూ పైకెత్తి చిన్న గొంతుతో ఏదో అనసాగాడు. జాంగ్లా అతడి పక్కన వంగి, ఆ మాటలు విని, శిఖిముఖితో, "శిఖి దొరా! ఇక వాణ్ణి వదలండి. అతన్ని దాసునని వేడుకుంటున్నాడు," అన్నాడు.

శిఖిముఖి చప్పున లేచి నిలబడ్డాడు. వృశ్చిక నాయకుడు కూడా లేచి కూర్చుని ముందుకు వంగి శిఖిముఖి పాదాలు పట్టుకుని ఏమో గొణిగాడు. తమ నాయకుడు అలా చేయగానే వృశ్చికజాతి వాళ్ళంతా వున్న చోటనే ప్రాణాదారం పడ్డారు.

శిఖిముఖి, వృశ్చిక నాయకుణ్ణి లేవనెత్తి, "మనిషి మరో మనిషికి ఏ పరిస్థితుల్లోనూ దాసిన కానవసరం లేదు. జరిగిపోయింది యుద్ధరం మర్చిపోదాం. ఇక నుంచి మనం మిత్రులం!" అన్నాడు.

వృశ్చిక నాయకుడి కళ్ళ నుంచి నీళ్ళు జలజలా కింద రాలినై. అతడు శిఖిముఖికి, విక్రమకేసరికి తన కృతజ్ఞత



చెప్పుకుని, తన జాతివాళ్ళతో, "ఇకనుంచి మనకందరికీ నాయకుడు, యీ శిఖిదొర! ఆయన మాటకు తిరుగులేదు," అన్నాడు.

తరవాత అందరూ చెట్ల కింద కూర్చుని, వెంట తెచ్చుకున్న ఆహారం తిన్నారు. అప్పుడు శిఖిముఖి, విక్రమకేసరితో ముందు తాము చేయవలసిన పనిని గురించి సంప్రతించాడు. ఆ ఇద్దరికీ నాంగ్‌సోమ్ లోయలో ఎక్కడో సురక్షితమైన స్థానంలో పడి బతికే వుంటాడన్న నమ్మకం వున్నది. ఆ సంభాషణ విన్న జాంగ్లా, నాంగ్‌సోమ్ ప్రాణాలతో వుంటే, శిఖిలాలను పూజారి కూడా బతికే వుండొచ్చు అన్నాడు.







వృశ్చిక నాయకుడు తనకున్న శంకను మరోసారి బయట పెట్టాడు: వెర్రివెలగ పండు మహత్తు అమోఘమైనది. నాంగ్ సాంగ్ లోయలోకి దూకేముందు శిథిలాలయం అంటూ కేకపెట్టటం మతిభ్రమవల్ల కాదు. అతడికి శిథిలాలయం కనబడే వుంటుంది!

"శిథిలాలయం మాట దేవు డెరుగు. ముందు ఆ లోయలోకి పోయి అతడు బతికున్నాడేమో చూసి, రక్షించవలసిన బాధ్యత మనమీద వున్నది. జాంగ్‌లా అన్నట్టు శిథిలాలయపూజారి కూడా ఏ చెట్టు కొమ్మల్లోనే సురక్షితంగా దిగివుంటే, వాణ్ణి వెతకవలసిన పనికూడా వున్నది. వెలుగు వుండగానే మనం ఆ లోయలోకి దిగుదాం," అన్నాడు శిఖిముఖి.

"మీ ఆజ్ఞ, దొరా! కాని, ఆ లోయ చాలా భయంకరమైనది. అక్కడ మహా సర్పాలూ, తేళ్ళే కాక, ఏనుగులూ, సింహాలూ, పులులూ...."

వృశ్చికనాయకుడు మాటలు ముగించక ముందే శిఖిముఖి అడ్డువచ్చి, "ఈ లంకలో భయంకరంగా కాక, ప్రశాంతంగా, సౌమ్యంగా వున్న ప్రదేశం ఎక్కడుంది? నువ్వనే వృశ్చికమాత మందిరం ఆ లోయలోనే గదా వున్నది. ఆ ఆలయాన్ని కనుక్కొని, తిరిగి వృశ్చికమాతకు పూజా పునస్కారాలు చేయవలసిన బాధ్యత మీ జాతి వాళ్ళకు మాత్రం లేదా?" అని అడిగాడు.

"ఆ మాత కోసం ప్రాణాలిస్తాం, దొరా! కాని, నేను వెర్రివెలగపండు తిని వున్నట్టయితే, శాక్తమునిగాడు మాతమందిరం చేరి, నరబలి యిచ్చి వుండేవాణ్ణి. నరబలి లేందే మాత కరుణించదు," అన్నాడు వృశ్చిక నాయకుడు.

"ఆ బలుల సంగతి తరవాత మాట్లాడదాం. ముందు లోయలోకి దారి తీయండి," అన్నాడు శిఖిముఖి.









అందరూ కొండమీది నుంచి లోయలోకి దిగసాగారు. వృశ్చికనాయకుడు ముందు ఉండి దారితీశాడు. అతడు చెప్పినట్టు లోయ చాలా భయంకరంగా వున్నది. అక్కడ వున్న మహావృక్షాల్లో ఎక్కువ భాగం పెద్దపెద్ద ఊడలు దించుకున్న మర్రి చెట్లు. వాటి నీడల్లో ఏనుగులు తారట్లాడుతున్నవి. మరి కొన్నిచోట్ల సింహాలు కోరలు చాచి గర్జిస్తున్నవి. చెట్లకొమ్మల్లో మహాసర్పాలూ, వాటి తోకల నంటుకుని పెద్ద పెద్ద తేళ్ళూ పారాడుతున్నవి.

శిఖిముఖి అతడి అనుచరులూ ఆయుధాలు సిద్ధంగా వుంచుకుని, తమ పరిసరాలు జాగ్రత్తగా పరీక్షించి చూసుకుంటూ లోయ అడుగుకు చేరారు. శిఖిముఖి చెప్పగా, వృశ్చిక నాయకుడు కొండమీది నుంచి నాంగసామ్ కిందికి దూకిన ప్రాంతానికి దారితీశాడు. ఆ ప్రదేశమంతా ఎత్తయిన వృక్షాలతో, వాటిని చిక్కగా అల్లుతూ పెరిగిన లతలతో క్రిక్కిరిసి వున్నది.

వృశ్చిక నాయకుడు తల ఎత్తి చెట్ల కొమ్మల కేసి చూస్తూ కొంత దూరం నడిచి, చప్పున ఆగి, "దొరా! నాంగసామ్ దూకిన కొండ అంచు దిగువన మనం వున్నాం. అదుగో, ఆ కొమ్మల్లో ఏదో ఆకారం కనబడుతున్నది. కాని, చెట్టును సమీపించటం ప్రమాదం. శిఖి దొరా! దానికింద ఏనుగు కుటుంబం కాపరం పెట్టినట్టున్నది." అన్నాడు.

శిఖిముఖి, విక్రమకేసరి తల ఎత్తి పైకి చూశారు. వాళ్ళకుకూడా చెట్టుకొమ్మల్లో ఏదో మానవాకారం లాంటిది అస్పష్టంగా కనబడింది. అది నాంగసామ్ అవునో కాదో తెలుసుకోవాలంటే, ముందు చెట్టుకింద వున్న ఏనుగుల్ని బెదరగొట్టి పారదోలాలి. ఇంతా చేస్తే, ఆ కనబడేది నాంగసామ్ కాక కొండమీంచి కాలుజారి పడిన ఏ ఎలుగుబంటో కావచ్చు.......







కలిముఖి. విక్రమకేసరి యిలాంటి సంశయాలతో కొట్టుమిట్టాడుతూండగా విగ్రగండు పెద్దగా మొరిగింది. కుక్క అరవటం. అది తలఎత్తి చూస్తూన్న దిక్కూ గమనిస్తూనే కలిముఖికి ఆ చెట్టుకొమ్మల్లో చిక్కుకుని వున్న ఆకారం నాంగ్‌సాప్ అయివుంటుందన్న నమ్మకం కలిగింది.

"కేసరీ! మనం నేర్పుగా ఆ చెట్లకింద వున్న ఏనుగుల్ని దూరంగా తరమాలి. తరవాత చెట్టెక్కి, ఆ కనబడేది నాంగ్‌సాపేనేమో చూడవచ్చు." అన్నాడతను.

కలిముఖి మాట ముగించే లోపలే, చెట్టు కింద వున్న ఏనుగుల్లో రెండు పెద్దవి, భయంకరంగా ఘీంకరించి, తొండాలెత్తి వాళ్ళ కేసి రాసాగినై. అది చూస్తూనే వృశ్చికనాయకుడు, "అందరూ త్వరగా ఆ రాళ్ళ చాటుకు పరిగెత్తండి. అక్కణ్ణుంచి బండ రాళ్ళు తోసి ఏనుగుల్ని బెదరగొట్టటం సాధ్యమేమో చూద్దాం." అన్నాడు.

ఆ హెచ్చరిక వింటూనే అందరూ కొండ అంచున వున్న రాళ్ల వెనక్కు పారిపోయారు. ఏనుగులు చెవులు టపటపలాడిస్తూ, తొండాలతో నేలను తాడిస్తూ, వాళ్ళు దాగివున్న వైపుకు కొంతదూరం పరిగెత్తుకు వచ్చి, అక్కడ వున్న బండ రాళ్ళ మధ్య కాళ్ళకు పట్టు దొరక్క వెనక్కు పోసాగినై. అదే అదనుగా కలిముఖివాళ్ళు అక్కడ అసనాటుగా వున్న బండరాళ్ళను వాటి కేసి దొర్లించారు. ఏనుగులు ఘీంకరిస్తూ వెనుదిరిగి అక్కణ్ణించి దూరంగా పరిగెత్తినై.

ఇప్పుడు అందరూ రాళ్ళ చాటునుంచి బయటికి వచ్చి, జాగ్రత్తగా చెట్ల కిందికి పోయారు. వృశ్చికనాయకుడు తన జాతి వాళ్లొకళ్లో చెట్టెక్కమని చెప్పేంతలో కుంటి జాంగ్‌లా పట్టుకర్రను చెట్టుబోదెకు ఆనించి, కోతిలా చెట్టు మీదికి గబగబా ఎగబాకి పోయాడు. —(ఇంకా వుంది)






# 31

[వృశ్చికనాయకుడు శిలాముఖితో కలియబడి ఓడిపోయాడు. శిలాముఖి అతణ్ణి క్షమించి కొండ కింది లోయలోకి బయలుదేరాడు. అక్కడ వాళ్ళు చెట్టు కింద వున్న ఒక ఏనుగుల మందను పారదోలారు. చెట్టు పైన కనిపించే ఆకారం వాంగ్‌సాము కేమో అన్న అనుమానం కలిగి బాంగ్‌లా గబగబా చెట్టు పైకి ఎగబాకి పోయాడు. తరవాత—]

శిలాముఖివాళ్ళు చెట్టు కింద నిలబడ్డారు. బాంగ్‌లా గుబురుగా వున్న కొమ్మల్లోంచి ఆశ్చర్యంగా చిన్న కేక పెట్టి. "శిల దొరా! ఇక్కడున్నది వాంగ్‌సామే! స్పృహ లేదు. కాని ఊపిరాడుతున్నది. మరొకళ్ళిద్దర్ని పంపితే, జాగ్రత్తగా కిందికి దించవచ్చు." అన్నాడు.

ఆ మాటలు వింటూనే వృశ్చికజాతివాళ్ళిద్దరు చెట్టెక్కారు. తరవాత కొద్ది సేపటికి బాంగ్‌లా, వాళ్ళిద్దరూ కలిసి చచ్చినట్టు పడివున్న వాంగ్‌సామును లతలు పెనవేసి కట్టిన తాళ్ళతో నిదానంగా నేల మీదికి దించారు.

శిలాముఖి, విశ్రమకేసరి కలిసి వాంగ్‌సాము బతికివున్నాడో లేదో అని పరీక్షించబోయేంతలో, వృశ్చికనాయకుడు అల్లంత దూరంలో వున్న పొదలోంచి యింత ఆకు తెచ్చి, దాని పసరును వాంగ్‌సాము







"నాంగసామికి యింకా ఆ వెర్రివెలగ పండు విషం దిగినట్టు లేదు. ఏమిటి చేయటం?" అన్నాడు.

విక్రమకేసరి ఏదో చెప్పబోయేంతలో, చెట్లల్లో నుంచి, "రక్షించండి! రక్షించండి!" అన్న కేకలు వినిపించినై.

అందరూ అటుకేసి తలలు తిప్పారు. ఎర్రగంటు పెద్దగా మొరిగింది. శిఖిముఖి ఆశ్చర్యంగా, "అది పిశాచం అరుపా? లేక శిథిలాలయ పూజారి కంఠధ్వనా?" అంటూ కత్తిదూసి, ఆ ఆర్తనాదం వచ్చిన దిక్కుగా బయలుదేరాడు.

వటవృక్షాల నీడల్లో నుంచి శిఖిముఖి వెలుగులోకి వచ్చి ఆర్తనాదం వచ్చిన దిక్కు కేసి పరీక్షగా చూసేంతలో తిరిగి, "రక్షించండి!" అన్న అరుపు వినబడింది. ఈసారి ఆ కంఠ స్వరంలో మొదట వున్న స్పష్టత్వం లేదు, కొనఊపిరితో వున్నవాడి మూలుగులా వున్నది.

"కేసరీ! ఆ గొంతు శిథిలాలయ పూజారిదే, అనుమానం లేదు. వాడు నిజంగానే ఏదో ప్రమాదంలో చిక్కుకున్నట్టున్నది." అన్నాడు శిఖిముఖి.

కేసరి జవాబివ్వబోయేంతలో ఎర్రగంటు పొదలమించి దూకి ముందుకు పోయి

ముక్కుల్లో పోశారు. మరుక్షణమే నాంగ్ పెద్దగా తుమ్మి, ఎగిరి లేచి కూర్చున్నాడు.

"నాంగ్! కొండమీది నుంచి లోయ లోని చెట్టుకొమ్మల మీద పడి చిన్న దెబ్బలు తగిలినా, ప్రాణాలతో బయటపడ్డావ్!" అన్నాడు శిఖిముఖి.

నాంగసామి పిచ్చివాడిలా చుట్టూ వున్న వాళ్ళనేసారి కలయచూసి, "శిథిలాలయం! శిథిలాలయం! అదుగో!" అంటూ గుంపుగా వున్న చెట్ల కేసి చేయిచూపి, లేచి పరిగెత్తబోయాడు.

శిఖిముఖి అతడి నడుం పట్టుకుని బలవంతాన కూర్చోబెట్టి, విక్రమకేసరితో,





పెద్దగా మొరగసాగింది. అందరూ దాని వెనకగా పొదల్లో నుంచి బయటికి వెళ్ళారు. వాళ్ళకు అక్కడ కనబడిన దృశ్యం భయాశ్చర్యాలను కలిగించింది.

ఒక పెద్ద సర్పం శిథిలాలయ పూజారిని దాదాపు మోకాళ్ళవరకు మింగింది. పూజారి రెండు చేతులతోనూ నేలమీద వున్న ఏదో వస్తువును గట్టిగా పట్టుకుని, అటూయిటూ కదులుతూ పెద్దగా అరిచేందుకు ప్రయత్నిస్తున్నాడు.

"ఈ పూజారి ఎంత దుర్మార్గుడైనా, వీణ్ణి, పాము బారినుంచి రక్షించటం మన కనీస మానవధర్మం." అంటూ శిఖిముఖి పరుగు పరుగున ముందుకు పోయి, కత్తితో పాము నడుం మీద బలంగా కొట్టాడు. ఆ దెబ్బకు పాము అటూయిటూ పొర్లింది. దాని నోటిలో వున్న శిథిలాలయ పూజారి బయటపడ్డాడు. శిఖిముఖి వెంట వున్న వృశ్చిక జాతివాళ్ళు తమ చేతుల్లో-వున్న రాతి ఆయుధాలతో పామును ఎడాపెడా బాదసాగారు.

శిఖిముఖి, విక్రమకేసరి పూజారిని సమీపించారు. పాము నోటి నుంచి బయట పడిన అతడి కాళ్ళు రెండూ రక్తం ఓడుతున్నవి. పాదాల ఆకారమే పూర్తిగా మారిపోయింది, అవి మాంసపు ముద్దల్లా ఎర్రగా





మెరుస్తున్నవి. పూజారి బాధతో గిలగిల కొట్టుకుంటూ పెద్దగా మూలుగుతున్నాడు. అతడి చేతులు మాత్రం ఏదో వస్తువును బలంగా పట్టుకునే ఉన్నవి.

శిఖిముఖి వంగి అతణ్ణి లేవనెత్త బోయేంతలో పూజారి చిన్నగా అరిచి, "శిఖీ, నన్నిక్కడే చావనియ్యి. నేనెలాగైతేనేం, చచ్చే ముందు శిథిలాలయాన్ని కనుక్కొన్నాను! నా మంత్రశక్తి, కథిలేశ్వరి పై నా భక్తీ వృథాపోలేదు," అన్నాడు.

"నువ్వు శిథిలాలయాన్ని కనుక్కొన్నావా! ఎక్కడుందది? మా కంటికి కనబడదేం! చావబోయే ముందు కూడా ఎందుకు దంభాలు పలుకుతావు?" అన్నాడు శిఖిముఖి కొంచెం కోపంగా.

శిఖిముఖి అలా అనగానే, పూజారి తల ఎత్తి సూటిగా అతడి కళ్ళల్లోకి చూశాడు. తరవాత ఒక క్షణం ఆగి, "నేను దుర్మార్గుణ్ణని, మోసగాణ్ణని నీ అభిప్రాయం! అంతేనా? నేను కధిలేశ్వరి కోసమే తుచ్ఛ మానవులు కొందరికి హాని కలిగించవలసి వచ్చింది. ఆ దేవి ముందు ఈ మానవులెంత! అదిగో, శిథిలాలయపు గోపుర కలశం! చూడు!" అంటూ చేతులు రెండూ పైకెత్తాడు.

అంతవరకూ శిఖిముఖి, విక్రమకేసరి పూజారి చేతులతో బలంగా పట్టుకుని ఉన్న వస్తువు కేసి చూడలేదు. ఇప్పుడు వాళ్ళకు సూర్యకాంతిలో ధగధగ మెరుస్తున్న కలశం ఒకటి కంట బడింది. వాళ్ళకు కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. ఆ కలశాన్ని చూస్తూనే వృక్షకజాతి వాళ్ళందరూ నేల మీద మోకరిల్లారు.

ఒకటి రెండు క్షణాలు ఎవరి నోట నుంచి మాట వెలువడ లేదు. శిఖిముఖికి యిదేదో శిథిలాలయ పూజారి తమ మీద ప్రయోగించిన కనుకట్టు విద్య ఏమో అన్న అనుమానం కలిగింది. విక్రమకేసరి ఏమాలో









చించాడో ఏమో, కలశాన్ని రెండు చేతుల తోనూ బలంగా పట్టుకుని పైకెత్తాలని చూశాడు. కాని అది కదలలేదు.

అంత ప్రాణాపాయ స్థితిలోనూ శిథిలాలయపూజారి అది చూసి, వికవిక మంటూ నవ్వి, "ఆ కలశమేదో నేలమీద పళ్ళెంలా బోర్లించి వున్నదనుకుంటున్నావా, దినకేసరీ! ఇప్పుడు చెప్పుతున్నాను. నేను నీ తాత నెరుగుదును. ఆయనలో వున్న మొండితనం నీలోనూ వున్నది." అన్నాడు.

"నువ్వనేదేమిటి, పూజారీ! శిథిలాలయం గోపుర కలశం వరకూ భూమిలో కూరుకుపోయిందనా?" అని అడిగాడు శిఖిముఖి.

"ఎన్నో ఏళ్ళ క్రితం భూకంపం కారణంగా అదే జరిగింది. ఆలయం కొన్ని అడుగుల లోతు భూమిలోకి దిగిపోయింది. పక్కన వున్న కొండరాళ్ళు దొర్లి దాన్ని కప్పివేసినై. ఆ రాళ్ళూరప్పలూ తొలగించావంటే శిథిలాలయం, అందులోని శిథిలేశ్వరి దేవి కనబడుతుంది, శిఖీ! అయినా మీ శబర జాతివాళ్ళకు ఆ దేవితో పనిలేదు గదా. అక్కడ దొరికే బంగారం తప్ప!" అన్నాడు పూజారి యీసడిస్తున్నట్టుగా.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చూశాడు. చావబోయే ముందు కూడా శిథిలాలయ పూజారి తమ మీదకు అభ్యుజాతివాళ్ళనూ, వృశ్చికజాతివాళ్ళనూ రెచ్చగొట్టి చూస్తున్నాడని వాళ్ళిద్దరూ గ్రహించారు. పూజారిని ఏమి చేయటమా అని వాళ్ళు ఆలోచించేంతలో, నాంగసామి అడుగులో అడుగు వేసుకుంటూ కలశం దగ్గరకు వచ్చి, రెండు మూడు క్షణాలు కన్నార్పకుండా చూసి దాన్ని తాకాడు. ఆ వెంటనే అతడిలో ఏదో కొత్త శక్తి ప్రవేశించినట్లయింది.

నాంగసామి ఒకసారి పెద్దగా నిట్టూర్చి, "కేసరిదొరా! ఇప్పటికి నాకు వెర్రివెలగ పండు తిక్క వదిలిపోయింది. ఈ కలశంలో ఏదో మహత్తున్నది. దీని అడుగున ఆలయం









వున్నదనేందుకు సందేహం లేదు. వాళ్ళ తప్పులూ తొలగిస్తాం," అన్నారు.

"ఇది చాలా కష్టంతో కూడిన పని. అయినా తప్పదు. ఏమంటావు, శిఖీ?" అని అడిగారు విక్రమకేసరి.

"ఎంత కష్టకార్యమైనా మనం సాధించి తీరవలసిందే. ఇంతదూరం వచ్చి శిలాలయంలో ప్రవేశించకుండా ఎలా వెళ్ళటం? మీ తాతగారి ఆత్మకు శాంతి కలిగించవద్దా? మీ తండ్రిగారి ఆజ్ఞ నెరవేర్చవద్దా? కాని యీ పూజారి మాట ఏమిటి? వీడి ఇంట్లు ఎక్కడ? తనవాళ్ళను ఉసికొల్పి చూస్తున్నాడు." అన్నాడు శిఖిముఖి.

నాంగసామి, శిఖిముఖి అభిప్రాయం ఏమిటో గ్రహించినవాడిలా నవ్వుతూ ముందుకు వచ్చి రహస్యం చెప్తున్నవాడిలా, "కాళ్ళు రెండూ నజ్జు నజ్జయిపోయిన పూజారి వాయుకమ్మ త్వరలోనే వస్తాడు. వాడి మాటలు మీరు పట్టించుకోకండి — నాకూ, యీ కలశం శిథిలాలయానికి సంబంధించినదే అన్న నమ్మకం వున్నది." అన్నాడు.

"మనం యిక్కడ గుట్టగా పడిపోయిన చిన్నా పెద్దరాళ్ళను ఎత్తి దూరంగా పారేస్తే తప్ప వాటి అడుగున వున్న ఆలయాన్ని చేరలేం. ఇది చాలా రోజులమీద జరగవలసిన పని. మనం యీ దాపులనే విడిదిపాలు ఏర్పాటుచేసుకోవలసి వుంటుంది. అందుకు అవసరం అయిన ఇళ్ళు కొమ్మలతో, ఆకులతో ముందు నిర్మించుకుని, తరవాత యీ పని ప్రారంభిద్దాం." అన్నాడు శిఖిముఖి.

నాంగసామి తలవూపి వృశ్చికజాతివాళ్ళ కేసి చూశాడు. వృశ్చికనాయకుడు చేతులు కట్టుకుని శిఖిముఖి ముందుకు వచ్చి నిలబడ్డాడు. శిఖిముఖి అతడు చేయవలసిన పని చెప్పాడు. వాడు అంతా విని, "శిఖీ దొరా! ఆ ఇళ్ళు కట్టటం ఏమంత పెద్ద







పనికాదు. మాతమందిరాన్ని కప్పినరాళ్లను తొలగించటమే బహుకష్టం. ఒకటి రెండు మచ్చిక చేసిన ఏనుగులుంటే పని చులకన అవుతుంది.'' అని శిథిలాలయ పూజారిని వేలితో చూపుతూ. ''వారు ఎలాగూ చస్తారు. కాని మందూ మాకూ లేకుండా చావనివ్వటం బాగుంటుందా?'' అన్నాడు.

''దాత్రైతే ఏదైనా చికిత్స చేసి వాడి బాధ కాస్త తగ్గించండి. నేనా మాట మరి దాను.'' అన్నాడు శిఖిముఖి.

వృశ్చికజాతి నాయకుడు చెప్పగానే అతని అనుచరులు చెట్లల్లోకి పోయి ఏవో ఆకులూ అవీ తెచ్చి పూజారి కాళ్ళకు కట్లు కట్టబోయారు. పూజారి గట్టిగా అభ్యంతరం చెపుతూ, అల్లంత దూరంలో వున్న ఒక చెట్టుకొమ్మకు ఉయ్యాల వేసి తనను అందులో కూర్చోబెట్టమన్నాడు.

''నేను మరి నాలుగైదు సూర్యోదయాల కంటె ఎక్కువ చూడలేను. ఈ లోపల మీరు శిథిలాలయాన్ని వెలికి తీయండి. శిథిలేశ్వరుని చూసి సుఖంగా ప్రాణాలు వదులుతాను.'' అన్నా డతను.

చావబోయేవాడి కోర్కె నెరవేర్చటం ధర్మం అని శిఖిముఖి, విక్రమకేసరి వృశ్చిక జాతివాళ్ళకు అలాగే చేయమని చెప్పారు. వాళ్ళు శిథిలాలయ పూజారి కాళ్ళకు కట్లు కట్టి, దాపులనున్న ఒక చెట్టుకొమ్మకు అమర్చిన ఉయ్యాలలాంటి దాంట్లో అతణ్ణి కూర్చోబెట్టారు.

ఆ సాయంకాలాని కల్లా అందరూ కలిసి చెట్లకొమ్మలు నరికి భూమిలో పాతి, వాటి మీద పెద్దపెద్ద ఆకులు కుట్టి, వృశ్చికజాతి వాళ్లూ, శిఖిముఖి అతడి అనుచరులూ వుండేందుకు వీలుగా చిన్న చిన్న గుడిసెల్లాంటివి తయారుచేశారు. ఆ రాత్రి వాళ్లెవరికీ సరిగా నిద్రల్లేవు. చుట్టూ అడవి ఏనుగులు ఘీంకరించటం, క్రూరమృగాల అరుపులూ వాళ్ళ కర్ణపుటాలను బద్దలు





చేయసాగినై. గుడిశెల చుట్టూ సెగళ్ళు వేసుకుని, కునికిపాట్లు పడుతూ వాళ్ళు సూర్యోదయం వరకూ కాలంగడిపారు.

మరునాటి రోజు సూర్యోదయం నుంచీ అందరూ కలిసి పెద్ద పెద్ద రాళ్ళకు అడవి తీగలతో అల్లిన మోకులు బిగించి కట్టి, దూరంగా లాక్కు పోయి గుట్టగా వేయసాగారు. అది ఎంతో శ్రమతో కూడిన పని. దానికి అంతరాయం కలిగిస్తూ, మధ్య మధ్య అడవి ఏనుగులు కొన్ని అక్కడికి వచ్చి ఘీంకరిస్తూ వాళ్ళ మీద పడేందుకు ప్రయత్నించ సాగినై. అలాంటి సమయాల్లో అందరూ పనులు మాని ఏనుగులను బెదర గొట్టేందుకు డప్పులు వాయించటం. రాళ్ళు విసరటం చేయసాగారు.

సూర్యుడు పడమటి దిక్కుకు వాలే వరకూ వాళ్ళ పనికి పెద్ద ఆటంకం ఏమీ కలగ లేదు. శిఖిముఖి యిక ఆ నాటికి పని విరమించి, పంటపనుల సంగతి చూద్దాం అనుకునేంతలో, హఠాత్తుగా ఆ ప్రదేశానికి చుట్టూ వున్న గుట్టల మీద నాలుగు ఏనుగులు కనిపించినై. వాటిమీద పెద్దపెద్ద త్రిశూలాలు ధరించిన భయంకరాకారులున్నారు.

శిఖిముఖి, విక్రమకేసరి తమ అనుచరుల్ని హెచ్చరించి ఆయుధాలు చేత పట్టబోయేంతలో, ఏనుగుల మీద వున్నవాళ్లు పెద్దగా, "ఎక్కడి వాళ్ళక్కడ కదలకుండా నిలబడండి. మా వెనక నూరు ఏనుగుల మీద మరికొందరు అఘోరీలు వస్తున్నారు. పారిపోజూస్తే మీ ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!" అన్నారు.

శిఖిముఖి, విక్రమకేసరి యిప్పుడు ఏమి చేయటమా అని, నాంగసామి కేసి, వృశ్చిక నాయకుడి కేసి తలలు తిప్పారు. వాళ్ళిద్దరూ తమ చేతుల్లోని ఆయుధాలు పైకెత్తి త్రిశూలాలు ధరించిన వాళ్ళ కేసి బయలుదేరారు. —(ఇంకా వుంది)








## 32

[వివవర్మం వేట చిక్కిన శిధిలాలయ పూజారిని, శిఖిముఖివాళ్ళు కాపాడారు. వాళ్ళకు గోపురకలశం ఒకటి కనబడింది. శిఖిముఖి, తన అనుచరుల సాయంతో, దాని చుట్టూ వున్న రాళ్ళను తొలగించసాగాడు. ఆ సమయంలో పెద్ద పెద్ద త్రిశూలాలు ధరించిన నలుగురు అఘోరీలు ఏనుగుల మీద వచ్చి వాళ్ళను చుట్టుముట్టారు. తరవాత—]

తమను చుట్టుముట్టిన ఆ నలుగురు అఘోరీలే కాక, వాళ్ళకు సాయంగా మరి వంద మంది అఘోరీలు ఏనుగుల మీద వస్తున్నట్టు వినగానే విక్రమకేసరితోపాటు అందరూ భయకంపితు లయ్యారు. పోరాటం లేకుండా లొంగిపోవటం అవమానకరం; అట్లని అంత మంది శత్రువులను, యీ కొద్దిమంది అనుచరులతో ఎదిరించజూడటం ఆత్మ హత్యతో సమానమవుతుంది....

విక్రమకేసరి యిలా ఆలోచిస్తున్నంతలో శిఖిముఖి చిన్నగా అరిచి, ఎగిరి గంతేసి, "అజితా, వీరభద్రా! వృశ్చిక వాయుకుస్తీ, నాంగసామునూ వెనక్కు లాక్కురండి. ఏనుగుల మీద వున్న ఆఘోరీలతో వాళ్లిలా పోరాడగలరు!" అన్నాడు.

వెంటనే అజిత వీరభద్రులు ముందుకు పరిగెత్తి, నాంగసామునూ, వృశ్చికవాయు కుస్తీ భుజాలు పట్టుకుని నిలిపి, శిఖిముఖి







ఆజ్ఞ ఏమిటో వాళ్ళకు చెప్పారు. వాళ్ళిద్దరూ కోపంగా తమ చేతిలోని ఆయుధాలను అఘోరీల కేసి చూపి, అయిష్టంగా వెను దిరిగి శిఖిముఖి వున్న చోటుకు వచ్చారు.

శిఖిముఖి, రాళ్ళు లాగుతున్న తనవాళ్ళ నందర్నీ పనులు ఆపమని ఆజ్ఞాపించి, "ఈ అఘోరీల వల్ల మన కెలాంటి హాని కలగదు. గోలభైరా గ్రామానికి వచ్చే దారి లోని అరణ్యాల్లో మనం వీళ్ళందర్నీ ఒకసారి కలుసుకున్నాం గదా!" అన్నాడు.

"అవును, కలుసుకున్నాం. దరా! వీళ్ళు మహా క్రూరులు, నరభక్షకులు!" అన్నాడు కుంతి బాంగ్లా.



"ఆ మాట నిజమే! వీళ్ళ నాయకుడు ఘోరచిత్తుడు మనకు అభయహస్తం యిచ్చాడు. స్వయంగా యిదిగో, యీ రుద్రాక్షమాల నా చేతికి కట్టాడు." అంటూ శిఖిముఖి చేతి నున్న మాలను అందరూ చూసేందుకు వీలుగా పైకెత్తాడు.

ఆ సరికి విశ్వకేసరికి బ్రహ్మపుత్రా నదీలోయ లోని మహారణ్యాల్లో లోగడ తాము అఘోరీలను కలుసుకున్న సంఘటన గుర్తుకొచ్చింది. అతడు చిరునవ్వు నవ్వుతూ శిఖిముఖి కేసి తిరిగి, "శిఖీ! నువ్వన్నట్టు మనకు ఈ అఘోరీల నుంచి ఎలాంటి ప్రమాదం రాదు. పైగా వీళ్ళ పెంపుడు ఏనుగుల సాయంతో, యిక్కడ వున్న రాళ్ళగుట్టలను తొలగించి, త్వరగా శిథిలాలయాన్ని బయటికి లాగవచ్చు." అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నాను. కాని, ఒక సంగతి. వీళ్ళు ఆ ఘోరచిత్తుడి శిష్యులు కాకపోతే చిక్కుల్లో పడతాం. ఆ సంగతి తెలుసుకోవటం ఎలా?" అన్నాడు శిఖిముఖి.

"వీళ్ళు మహాకాలుడి భక్తులు. ఆ కాలుణ్ణి పూజించే వారికి మాత్రం హాని చేయరు." అన్నాడు కుంతి బాంగ్లా.











"ఆ మాట నిజం, శిఖివీరా!" అన్నాడు వాంగసేను.

"వృశ్చికమాతను మించిన దైవం లేదు. ఎవరా మహాకాలుడు? మా వృశ్చికజాతి వాళ్ళం చావనైనా చస్తాంగాని, ఈ అఘోరీల దేవుణ్ణి ఒప్పం!" అంటూ వృశ్చిక నాయకుడు చేతిగొడ్డలి ఎత్తి, తన జాతి వాళ్ళందర్నీ తన దగ్గరకు రమ్మని హెచ్చరించాడు.

వృశ్చిక నాయకుని మూర్ఖత్వం, మొండితనం బాగా ఎరిగిన శిఖిముఖి, అనవసర రక్తపాతం జరగబోతున్నదని గ్రహించి, అతనితో శాంతంగా, "వృశ్చికనాయకా! ఈ అఘోరీల విషయంలో నువ్వేమీ ప్రమేయం పెట్టుకోనవసరం లేదు. నువ్విలా చూస్తూవుండు." అని చెప్పి, రుద్రాక్షమాల వున్న చేతిని పైకెత్తి "ఘోరచిత్తుడికీ, జై! జై, మహాకాళా!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే పీనుగులపై నున్న నలుగురు అఘోరీలూ త్రిశూలాలను దించి, "జై, మహాకాళా!" అని అరిచారు. తరవాత శిఖిముఖి వాళ్ళను సమీపించాడు. వాళ్ళల్లో ఒకడు శిఖిముఖి కేసీ, విగ్రహం కేసీ నేసీ అనుమానంగా చూస్తూ, "ఇందులో ఏమీ మోసం లేదుకదా? మీ నాయకుడు పూజారి మహాజిత్తులమారి అని విన్నాం. వాడెక్కడ? మా గురువుగారైన ఘోరచిత్తుడి పేరు మీ కెవరు చెప్పారు?" అని అడిగాడు.

శిఖిముఖి, అఘోరీలకు నమస్కరించి, "మేము శిథిలాలయపూజారి అనుచరులం కాము. వాడు మాకు ప్రబల విరోధి. ఘోరచిత్తుడు స్వయంగా నా చేతికి కట్టిన రుద్రాక్ష మాల యిదిగో!" అంటూ చేతిన వున్న మాలను చూపాడు.

అఘోరీలు ఆశ్చర్యపోతూ ఒకరి ముఖా లొకరు చూసుకున్నారు. వాళ్ళల్లో ఒకడు











నాలుగైదు నిమిషాలు గడిచీ గడవక ముందే, పర్వతాకారంలో వున్న ఒక ఏనుగు మీద వృద్ధు డొకడు మిట్ట వెనక వున్న పల్లంలో నుంచి మిట్ట మీదికి వచ్చాడు. అతడి వెనకగా మరి కొందరు అఘోరీలూ, ఆభ్యుజాతివాళ్ళూ కాలినడకన ఏనుగు వెనగ్గా కదిలి వచ్చారు.

అంత దూరంలో వుండే, ఏనుగు మీద వున్న వృద్ధుణ్ణి గుర్తించిన శిఖిముఖి, సంతోషంగా ఒక కేక పెట్టి, "ఘోరచిత్రుడికీ, జై!" అన్నాడు.

ఘోరచిత్రుడు తాపీగా ఏనుగును నడుపుకుంటూ శిఖిముఖి వాళ్ళున్న చోటుకు వచ్చి, అందర్నీ ఓసారి కలయజూసి, మౌనంగా ఏనుగు మీంచి దిగి, శిఖిముఖిని గట్టిగా కౌగలించుకున్నాడు. ఆ దృశ్యం చూస్తూనే విక్రమకేసరికి తమ కష్టాలన్నీ తొలగిపోయినవని, వచ్చిన పని విజయవంతంగా నెరవేరబోతున్నదని, గట్టి నమ్మకం కలిగింది. అతడు ఉత్సాహంగా, "ఘోరచిత్రుడికీ, జై!" అన్నాడు. అతడి అనుచరులంతా జై అంటూ ఏకకంఠంగా పలికారు.

ఘోరచిత్రుడు చిరునవ్వు నవ్వుతూ విక్రమకేసరిని సమీపించి, "కేసరీ! మీ తాత విక్రమకేసరి గురువు మాకు చేసిన

పక్కన వున్న వాడితో, "ఇది వింతగా లేదా? మనం శత్రువుల్ని వేటాడ వస్తే, వాళ్ళు మనకు మిత్రులం అని చెప్పుకున్నారు. ఆ రుద్రాక్షమాల సంగతి నమ్మదగిందేనా?" అన్నాడు.

ఆ ప్రశ్నకు రెండవ అఘోరి అరచేత్తో నుదుటి మీద కొట్టుకుని, "ఈ అనుమానాలతో కాలయాపన జరిగిపోతున్నది. లాభంలేదు, మన గురువునే పిల్చుకు వస్తాను," అంటూ ఏనుగును దాపుల నున్న మిట్ట మీదికి దౌడు తీయించి, అక్కడ దాని మీద నిలబడి చేతులు ఊపుతూ పెద్దగా ఏవో కేకలు పెట్టసాగాడు.









ఉపకారానికి ప్రత్యుపకారం చేసే అవకాశం కలిగినందుకు చాలా ఆనందంగా వుంది. ఆయన చూడాలనుకున్న శిధిలాలయాన్ని మనుమడివైన నువ్వు చూడగలిగావు. ఆ ఆలయ ప్రాంగణంలో వున్న అపురూప శిల్పాలూ, నిధులూ అన్నీ నీవే. ఇదుగో, ఛత్రప్రాకారం పైన ఎక్కి చూడు! ఆ సంపదనంతా మోసుకు పోయేందుకు మరి కొందరు ఇభ్యజాతివాళ్ళు కూడా వస్తున్నారు." అంటూ విక్రమకేసరిని సునాయాసంగా ఏనుగు పైకి ఎత్తాడు.

ఏనుగు పై నుంచి విక్రమకేసరి పరిసర ప్రాంతాలను ఒకసారి కలయచూశాడు. ఎత్తుగా వున్న గుట్ట వెనక భాగాన్నుంచి కొందరు ఇభ్యజాతివాళ్లూ, అఘోరీలూ తమ కేసి రావటం అతడి కంటబడింది. ఇంతమంది ఇభ్యజాతివాళ్ళను ఘోరచిత్తుడు ఎలా కూడగట్టుకున్నాడో అతడికి అర్థంకాలేదు.

కేవలం ఏనుగు మీంచి దిగి ఘోరచిత్తుడికి తన కృతజ్ఞత తెల్పుకుని, శిఖిముఖికీ, నాంగ్‌సోన్‌కూ తాను చూసిన ఇభ్యజాతి వాళ్ళను గురించి చెప్పాడు. శిఖిముఖి కూడా ఆశ్చర్యం కలిగి, అతడు ఘోరచిత్తుణ్ణి ప్రశ్నించాడు.

"అంతా ఆ మహాకాలుడి దయ!" అంటూ ఘోరచిత్తుడు ఆకాశం కేసి చేతులెత్తి నమస్కరించి, "మహారణ్యంలో మిమ్మల్ని కలుసుకున్న తరవాత, శిధిలాలయ పూజారిని గురించి మరి కొన్ని వివరాలు తెలుసుకోవటమే గాక ఈ లంక లోని శిధిలాలయం సంగతి ఒక ఇభ్య వృద్ధుడి ద్వారా వివరంగా విన్నాను. ఆ పూజారి దుర్మార్గుడూ, మీరూ ఇక్కడికి బయలుదేరారని తెలిసి, వాళ్లనుంచి మీకు ప్రమాదం రాకుండా చూసేందుకు నేనూ మరొక పడవలో నా శిష్యులతో ప్రయాణం కట్టాను. దారిలో ఏ పడవ వెనక కొంచెం అల







క్యంగా బయలుదేరి దారితప్పిన, గోలభరా అభ్యుల పడవ తటస్థపడింది. అందరం కలిసి యీ వృక్షకలంక చేరాం." అన్నాడు.

"మీ సహాయానికి ఎంతో కృతజ్ఞులం. ఇక్కడ వున్నది నిజంగా తాతకేసరి చూడా లనుకున్న శిథిలాలయం అయివుంటే, మనం త్వరత్వరగా దీన్ని కప్పిన రాళ్ళగుట్టలను తొలగించాలి." అన్నాడు శిఖిముఖి.

"అదెంతపని! నా వెంట మరికొన్ని మచ్చిక చేసిన ఏనుగులు వున్నయ్. వాటి చేత పనిచేయించటంలో సమర్థులైన అభ్యజాతివాళ్ళు కొందరున్నారు." అన్నాడు, ఘోరచిత్తుడు.



ఇంతలో ఘోరచిత్తుడి వెంట పడవలో వచ్చిన అభ్యజాతివాళ్లంతా కిలకిలమంటూ అక్కడికి వచ్చారు. వాళ్లు తమ గ్రామం వాడైయిన నాంగ్‌సోమ్‌నూ, శిఖిముఖి, విక్రమకేసరులనూ గుర్తించారు. అందరూ వాళ్ళ చుట్టూచేరి ఆనందం పట్టలేక నాట్యం చేయసాగారు.

ఈ కోలాహలం మధ్య నుంచి ఘోరచిత్తుడు శిఖిముఖిని, విక్రమకేసరిని దూరంగా తీసుకుపోయి, "ఇంతకూ ఆ శిథిలాలయ పూజారినని చెప్పుకునేదుష్టుడు ఏమయ్యాడు? ఈ లంకలో వాడి శిష్యుల్ని ముగ్గురిని పట్టుకున్నాం. వాళ్ళు మా దగ్గర బందీలుగా వున్నారు. తమ గురువు ఏమైందీ తెలియదంటున్నారు." అన్నాడు.

"ఇంతవరకూ మీకు ఆ పూజారిని గురించి చెప్ప మరిచాం. మీరు పట్టుకున్న ఆ ముగ్గురూ వాడి శిష్యులు కాదు, బంట్లు. మా ప్రాంతాల్లోని తిమ్మగూడెం అరణ్యాలలో వాళ్ళు దారిదొంగలు. డబ్బాశ చూపి ఆ దుర్మార్గుడు వాళ్ళను యింత దూరం తీసుకు వచ్చాడు. ఇక వాడు ఏమయ్యా డంటారా? చావుబతుకుల్లో వున్నాడు." అంటూ శిఖిముఖి, ఘోరచిత్తుణ్ణి చెట్ల కేసి తీసుకుపోయి. కొమ్మలకు కట్టిన ఉయ్యా







లలో కూర్చుని వున్న శిథిలాలయ పూజారిని చూపించారు.

పూజారి కళ్లు తెరిచేవున్నవి. కాని, మనిషిలో చలనం లేదు. పాము నోటినుంచి బయటపడినప్పటికీ, ఆ పట్టు తగిలిన గాయాలు మాననందువల్ల అతను ప్రాణాపాయ స్థితిలో వున్నాడు.

శిఖిముఖి కొద్ది మాటల్లో తాము వృక్షక లంకలో దిగిన క్షణాన్నుంచి జరిగినదంతా ఘోరచిత్తుడికి చెప్పి, "ఆ విషసర్పం నుంచి నేను కాపాడకపోతే, యీ పాటికి దాని పొట్టలో జీర్ణమై పోయివుండేవాడు, పూజారి." అన్నాడు.

ఆ మరుక్షణానే పూజారిలో చలనం కనబడింది. అతను చేతులు రెండూ ఎత్తి ఘోరచిత్తుడికి నమస్కరిస్తూ, "నువ్వు మహాకాలుడి భక్తుడివి. నేను శిథిలేశ్వరి పూజారిని. ఆ విధంగా ఇద్దరం ఒకేరకం భక్తులం. నేను మరి ఎంతో కాలం బతకను. రాళ్ళతో కప్పబడిన శిథిలేశ్వరిని త్వరగా వెలికి తీయించు. చూసి, ప్రాణాలు విడుస్తాను." అన్నాడు. ఈ మాటలు అంటూండగానే అతడి కళ్ళ నుంచి నీళ్ళు ఏకధారగా ప్రవహించసాగినై.

ఘోరచిత్తుడు నాలుగైదు క్షణాలపాటు కన్నార్పకుండా శిథిలాలయ పూజారి ముఖం కేసి చూసి, ఒక్కసారిగా నిలువెల్లా కంపించిపోయి, బొంగురుపోయిన గొంతుతో, "ఇతడు ఎంత దుర్మార్గుడైనా మహాభక్తుడు! సందేహం లేదు!" అంటూ వెనుదిరిగి, తన శిష్యులతో, "ఏనుగుల్ని తోలుకు వచ్చి ఆలయాన్ని కప్పిన రాళ్ళను త్వరగా ఎత్తించివేయండి!" అని చెప్పాడు.

గురువు ఆజ్ఞ వింటూనే ఆఘోరీలూ, వాళ్ళ వెంట వచ్చిన ఇభ్యులూ ఏనుగుల మీద ఎక్కి వాటిని ఆలయం కేసి పరిగెత్తించుకు రాసాగారు.

—(ముగింపు వచ్చేసంచికలో)








## 33

[ఆలయాన్ని కప్పి ఉన్న రాళ్ళను, శిఖిముఖి, విక్రమకేసరి తొలగిస్తూండగా, అపారిం గుడుపైన ఘోరదత్తుడు అక్కడికి వచ్చి, శిఖిముఖి ద్వారా జరిగినదంతా విన్నాడు. మరణావస్థలో ఉన్న శిథిలాలయ పూజారిని పలకరించి, అతడు తన శిష్యుల్నీ, అఘుర్జజాతి వాళ్ళనూ ఏనుగుల సాయంతో రాళ్ళను తొలగించమని ఆజ్ఞాపించాడు. తరవాత—]

ఘోరదత్తుని శిష్యులూ, అఘుర్జజాతి వాళ్ళూ శిథిలాలయాన్ని కప్పివేసిన పెంకె రాళ్ళను తొలగించే పనికి పూనుకున్నారు. వాళ్ళు మోకులను రాళ్ళకు కట్టి, రెండవ కొసను ఏనుగుల నడుములకు బిగించి, వాటిని గట్టిగా అదలించగానే, అవి ఘీంకరిస్తూ రాళ్ళను దూరంగా లాక్కుపోసాగినై.

శిఖిముఖి, విక్రమకేసరి ఘోరదత్తుని పక్కన నిలబడి ఎప్పుడు శిథిలాలయం బయటపడుతుందా అని, కుతూహలంగా చూడసాగారు.

సూర్యాస్తమయం సమయానికి రెండు మూడు గంటలు ఉండగానే రాళ్ళన్నీ తొలగించటంతో శిథిలాలయం బయట పడింది. అక్కడ ఉన్న దేవీవిగ్రహాన్నీ, ఆ విగ్రహం ముందు గుట్టలు గుట్టలుగా పడి ఉన్న బంగారు కణికెల్నీ చూసి, శిఖి ముఖీ, విక్రమకేసరులు నివ్వెరపడి





పోయారు. కాని, వాళ్ళకు ఆ బంగారం మీద ఎలాంటి ఆశా లేదు. తాత విక్రమకేసరి, తన రాజధానికి తీసుకు పోవాలనుకున్న అపురూపశిల్పాల కోసం ఆ శిథిలాలయం లోని అన్ని గదులూ వెతకసాగారు.

ఒక చీకటి గది వెనకవైపు నుంచి వస్తున్న కాంతి రావటం ముందుగా కళిముఖి చూశాడు. అతను విక్రమకేసరికి ఆ సంగతి చెప్పి, ఆ కాంతి వస్తున్న చోటుకు వెళ్ళాడు. అక్కడ ఎనిమిది అడుగుల ఎత్తున, పలకలు తీర్చి చెక్కబడిన ఒక రాయి వున్నది. వెలుగు ఆ రాయికి ఒక పక్క నుంచి వస్తున్నది.

"కేసరీ! దీని వెనక ఏదో పెద్ద గది వున్నట్టున్నది. లోపలి నుంచి కాంతి బయటికి వస్తున్నదంటే — దాని పై భాగాన కప్పు వుండి వుండదు." అన్నాడు కళిముఖి.

"నాకూ అదే అనుమానం కలుగుతున్నది. కాని, ఈ రాయి ఒక పట్టాన కదిలేట్టు లేదే!" అన్నాడు విక్రమకేసరి రాతిని కదిలించే ప్రయత్నం చేస్తూ.

కళిముఖి తన అనుచరుల్ని కేక వేశాడు. అందరూ కలిసి తలుపులా నిటారుగా వున్న రాతిని ఒక పక్కన గట్టిగా పట్టుకుని, వెనక్కు గుంజారు. రాయి దభీమంటూ వెనక్కు పడిపోయింది. ఆ వెంటనే వారికి గదిలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న బంగారు, లోహ విగ్రహాలు — అన్నీ రకరకాల దేవీమూర్తులవి కనిపించినై.

ఆ విగ్రహాలను చూసి కళిముఖి, విక్రమకేసరులు పరమానందం చెందారు. తమ దేశంలో అలాంటి గొప్ప శిల్పాలను తయారు చేయగల శిల్పి ఒకరూ లేరు. తాత విక్రమకేసరి [illegible] వాళ్ళ ద్వారా ఆ కళాఖండాలను గురించి విన్నదాంట్లో అబద్ధం ఏమీ లేదు....

కళిముఖి, విక్రమకేసరి తాము చూసిన కళాఖండాలను గురించి ఘోరచిత్తుడితో







చెప్పేందుకు ఆలయం నుంచి బయటికి వచ్చారు. వాళ్ళకు ఆలయం ఎదురుగా ఉన్న ఒక రాతి మీద ఘోరచిత్రుడూ, పక్కనే తన బంట్లయిన ఆటవి దొంగల భుజాల మీద చేతులు వేసి నిలబడి, గర్భగుడిలోని దేవీవిగ్రహం కేసి చూస్తున్న పూజారీ కనిపించారు. నవరత్నబృందం అటూ ఇటూ చూస్తూ పూజారికి ఏమో చెప్తున్నారు.

శక్తిముక్తి తనను సమీపించగానే, కపిలాలయ పూజారి అతడికి నమస్కరిస్తూ, "శక్తీ, అటవికుడివైనా, చిన్నవాడివైనా నీకు నమస్కరించకుండా ఉండలేను. నీ ధైర్య సాహసాలూ, వీటికి ఘోరచిత్రుడి సహాయం వల్లనే నేను కపిలేశ్వరిని చూడగలిగాను. ఇక్కడ దొరికే వెండి బంగారాలతో నేను మహారాజులా జీవించాలని తలచాను. కాని, కపిలేశ్వరి మరోలా తలచింది. నేను వెయ్యేళ్ళుగా ఈ ఆలయానికి పూజారినంటే—ఈ ఒక్క జన్మలోనే అని కాదు; నా పూర్వజన్మలన్నీ కలిపి అన్న మాట! నాకు పూర్వజన్మ జ్ఞానం ఉన్నది." అంటూ శివమెత్తిన వాడిలా అటూ ఇటూ ఊగిపోతూ, కళ్ళు మూసుకుని ఏదో గొణగసాగాడు.



శక్తిముక్తి, పూజారిని పట్టుకున్న ఆటవి దొంగలను హెచ్చరిస్తూ, "జాగ్రత్త, గట్టిగా పట్టుకోండి. కాలు జారి ముందుకు పడ్డాడంటే, చావు తప్పదు!" అన్నాడు.

పూజారి ఆ మాటలు వింటూనే కళ్ళు తెరిచి, "శక్తీ, నే నెలాగూ ఎక్కువ కాలం బతకను. ఒకవేళ బతికినా నుజ్జయి పోయిన కాళ్ళు నరికించుకుని కుంటి పూజారిగా హీనమైన బతుకు బతకాలి. సరే, నువ్వూ, విక్రమకేసరీ, నా శిష్యులైన నవరత్నబృందాన్ని, ఈ నాడు అరణ్యా తప్పర్చి శిక్షించక, క్షమించి వదిలి పెట్ట కోరుతున్నాను." అన్నాడు.







శిఖిముఖి అతణ్ణి కసురుకుంటూ, "ఏయ్, భైరుండం! నీ కేనాడూ ఆకాశంలో పక్షిలా ఎగిరే శక్తి లేదు. తాగిన మైకంలో అలా అనుకుంటూండేవాడివి. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని, మంచి మార్గాన పడక పోయావో, నేను సవరనాయకుడు గండుపోతుకు ఒప్పచెప్పుతాను," అన్నాడు.

"అలాగే చేయి వీరా! వింధ్యకు దక్షిణాన్నుంచి, హిమాలయాలు చేరిన సవరజాతి వారెవరున్నారు? గండుపోతు తప్పక నాకు మంచి మర్యాదలు చేస్తాడు. అతని కూతురు నాగమల్లి నుంచి మాత్రం నన్ను రక్షించండి!" అన్నాడు సవరభైరుండం.

అతని మాటలకు అందరూ విరగబడి నవ్వారు.

సూర్యోదయంతోనే అందరూ ప్రయాణ సన్నాహాలు ప్రారంభించారు. శిథిలాలయం లోని అపూర్వ శిల్పాలను, అక్కడి నుంచి తమ దేశానికి తరలించుకు పోయేందుకు శిఖిముఖి, విక్రమకేసరి వృశ్చికనాయకుడి అనుమతి కోరారు. వృశ్చిక నాయకుడు తన జాతివాళ్ళతో సంప్రతించి, "ఆ శిల్పాలే కాదు. వృశ్చికమాత మందిరంలో వున్న బంగారు కలశాల్ని కూడా మీరే ఎత్తుకు పొండి. ఈ వృశ్చికలంకలో వాటి అవసరం మాకు లేదు. మాకు వృశ్చికమాత వున్నది. అరణ్యంలో కావలసినంత వేటా, పండ్లూ ఫలాలూ వున్నవి!" అన్నాడు.



శిఖిముఖి వృశ్చికనాయకుడికి తన కృతజ్ఞత చెప్పుకుని విక్రమకేసరితో, "కేసరీ! నేను ఆటవికుడిగా మాట్లాడుతున్నాను. బంగారమనేది మనిషిని బాధలా, కష్టాల పాలు చేస్తుంది. ఇది వేటాడి జీవించే మా శబరజాతి వాళ్ళ నమ్మకం!" అన్నాడు.

ఆ మాటలకు విక్రమకేసరి నవ్వి, "నీ నిజాయితీ మెచ్చదగిందే. కాని, క్షత్రియుడిగా, శూరసేనదేశ రాజకుమారుడుగా నే మాట్లాడుతున్నాను. సమస్తమూ, వివేకి



ఆయన రాజు చేతిలో ఆ బంగారం ప్రజలకు మేలు చేస్తుంది. శత్రువుల్ని సంహరిస్తుంది!" అన్నాడు.

"అలా అయితే, నా అభ్యంతరం ఏమీ లేదు. ఆ అపూర్వ శిల్పాలతో పాటు, బంగారాన్ని కూడా నీ రాజధాని నగరానికి ఎత్తుకుపో." అన్నాడు శిఖిముఖి.

"ఆ ఎత్తుకుపోయేది నేనొక్కణ్ణి కాదు. నువ్వు ముందుగా మా రాజధాని నగరం వస్తున్నావు. ఆ తర్వాత మనిద్దరం కలిసి మీ కుంభారపట్టి పల్లెకు వెళతాం. శిథిలాలయపూజారి శిఖ కోశావుగదా! జాగ్రత్తగా దాచావా? నవరనాయకుడు గంధు పాటు కూతురు నాగమల్లి అది కావాలన్నది గదా?" అన్నాడు విక్రమకేసరి.

"అవును. నేను ఇల్లు వదిలి యింత దూరం ఉత్తరంగా ప్రయాణించింది, ఆ శిఖ కోసమే అన్నట్టుగా యిప్పుడు అనిపిస్తున్నది. ఆ నాగమల్లిది ఎలాంటి పగ!" అన్నాడు శిఖిముఖి నవ్వుతూ.

"అది నాగమల్లి కాదు, నాగంపాము! అలాంటి వాళ్ళల్లో పగ, ప్రేమాకూడా అంత బలంగానే వుంటవి. అవునా?" అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి చిరునవ్వు నవ్వుతూ వూరుకున్నాడు. ఆ తరవాత వాళ్ళిద్దరూ తమ అనుచరుల సాయంతో, శిథిలాలయంలోని బంగారాన్ని, శిల్పాలనూ పడవలకు ఎక్కించారు. మిట్టమధ్యాహ్నం వేళ పడవలు రెండూ గోలీపురా కేసి తిరుగు ప్రయాణం అయినై. వీడ్కోలు ఇచ్చేందుకు వచ్చిన వృశ్చికనాయకుడికి శిఖిముఖి, విక్రమకేసరి తమ కృతజ్ఞత చెప్పుకున్నారు. మారచిత్తుడు ఆతడికి, సంవత్సరానికి ఓసారి వచ్చి, దేవీదర్శనం చేస్తానని మాటయిచ్చాడు.

దారిలో ఎలాంటి ప్రమాదాలూ జరక్కుండా వారంరోజుల తరవాత పడవలు రెండూ గోలీపురా గ్రామం చేరినై. అక్కడ







ఐశ్వర్యవారి కులపెద్ద, అందరినీ ఆహ్వానించి, రెండురోజులపాటు గొప్పగా విందువినో దాలు ఏర్పాటు చేశాడు. విక్రమకేసరి శిథిలాలయం నుంచి తెచ్చిన శిల్పాలలో సాటిలేని చెక్కుకున్న ఒక దేవతా విగ్రహాన్ని తన తాత విక్రమకేసరి సమాధికి ఎదురుగా స్థాపన చేశాడు. నాంగ్‌సామీకూ, తదితరులకూ తను తెచ్చిన బంగారంలో కొంత పంచిపెట్టాడు.

మూడవ నాటి ఉదయం గోలఛరా జిమ్ములకు వీడ్కోలు చెప్పి, శివమణి వాళ్ళు ప్రయాణమై రెండువారాల తరవాత కామాఖ్య నగరం చేరి, అక్కడ రాము పూర్వం నివిధి చేసిన సత్రంలోనే దిగారు. సత్రపు యజమాని వాళ్ళను గుర్తించి ఎంతో మర్యాద చేసి, కుంటి జాంగ్లా ద్వారా శిథిలాలయాన్ని గురించి సర్వం విన్నాడు.

కామాఖ్య నగరంలో ఒక వారం రోజులు విశ్రాంతి తీసుకున్న తరవాత ఘోరచిత్రుడు తన శిష్యులతో హిమాలయాల్లోని తీర్థాలకు మళ్ళీ ప్రయాణమైపోతూ, విక్రమకేసరిని కౌగలించుకుని, "గురువు విక్రమకేసరి, మా అఘోరీలకు చేసిన మేలుకు, అతని మనవడివైన నీకు, మా చేతనైన సహాయం చేశాం. ఎంతో తృప్తిగా వుంది! నీకు నూరేళ్ళ ఆయుష్షు. ఆ తరవాత శివ సాయుజ్యం ప్రాప్తించాలని కోరుకుంటున్నాము." అన్నారు.

కామాఖ్యనగరం నుంచి ప్రయాణమయేప్పుడు శివమణి కుంటి జాంగ్లాను తన వెంట రమ్మన్నాడు. బతికున్నంత వరకూ సుఖంగా బతికేలా చూస్తానన్నాడు. కాని అతడు ఆ నగరం వదిలేందుకు ఇష్టపడలేదు. అప్పుడు విక్రమకేసరి అతడికి కొంత బంగారం ఇచ్చి, దానితో బతికినన్నాళ్ళు సుఖంగా బతకమన్నాడు.

ఆ బంగారం చూసి కుంటి జాంగ్లా కృతజ్ఞతతో కళ్ళనీళ్ళ పర్యంతమై "దొరా!

నేను మొదట్లో మీకు ద్రోహం చేశాను. అయినా మీ రిద్దరూ నన్ను క్షమించారు. నేను యిక్కడే మరెదైనా సత్రం కట్టి సుఖంగా జీవిస్తాను. బహుశా, మీ కుమారు లెవరైనా, యీ ప్రాంతాలు చూసేందుకు వస్తే, వారికి నా సత్రంలోనే ఆతిథ్యం జరుగుతుంది." అన్నాడు.

కళాముఖి, విక్రమకేసరి అతడి మాటలకు చాలా సంతోషించారు. తరవాత రాము తెచ్చిన కల్పాలనూ, బంగారాన్నీ మోసేందుకు గుర్రాలనూ, వాటిని తోలేందుకు మనుషులనూ కుదుర్చుకుని, తమ అనుచరులైన అజిత వీరభద్రులతో కలిసి దాదాపు మూడునెలల ప్రయాణం తర్వాత శూరసేనపురి రాజధానినగరం చేరారు.

విక్రమకేసరి తండ్రి జయపాలుడు వాళ్ళకు రాజోచితమైన సన్మానం చేశాడు. భటుల ద్వారా సవరనాయకుడు గండుపోతు కుటుంబానికి, కళాముఖి తండ్రి శివాలుడికి కబురు చేసి, వాళ్ళను తన రాజధానీ నగరానికి పిలిపించాడు.

గండుపోతు కూతురు నాగమల్లి, కళాముఖిని చూస్తూనే, "శిథిలాలయం పూజారి కళ తెచ్చావా?" అని అడిగింది.

ఎంతోకాలంగా భద్రంగా తన నడుముకు బిగించుకున్న ఆ కళను కళాముఖి ఆమె కిచ్చాడు. నాగమల్లి ఆనందం అంతాయింతా కాదు. విక్రమకేసరి చెప్పగా వాళ్లిద్దరి ప్రేమను గురించి విన్న రాజా జయపాలుడు, వాళ్ళ తల్లిదండ్రులతో మాట్లాడి, ఒక శుభ ముహూర్తాన, కళాముఖికీ, నాగమల్లికీ వైభవంగా వివాహం చేశాడు.

శబర, సవరజాతి పెద్దలూ, వాళ్ళ పిల్లలూ, అనుచరులూ, ఒక నెలరోజుల పాటు జయపాలుడి ఆతిథ్యంలో విందులూ, వేడుకలతో కాలం గడిపి, తరవాత ఎవరి గ్రామాలకు వాళ్ళు వెళ్ళిపోయారు.

—(అయిపోయింది)

